


శ్రీ సద్గురవేనమః.

# బుద్ధ్యుపదేశిని

యను

# మానసబోధ సుజ్ఞాన తత్త్వకీర్తనలు.

## ప్రథమాశ్వాసము.

క. శ్రీగురు నాయక నీదయ,
బాగుగ రాఁగోరి యన్య ♦ భ్రమలను నెల్లన్,
ద్యాగంబొనరిచి మది స,
ద్యోగమునన్ నీదుచరణ ♦ యుగ్మము గొల్తున్. ౧

తే-గీ. ప్రేమమీఱంగ నన్గని ♦ పెంచినట్టి,
తల్లి శ్రీలక్ష్మికేను వం ♦ దన మొనర్చి,
తండ్రి లక్ష్మీనృసింహార్యుఁ ♦ దలఁచి యతని,
పాద పద్మంబులకు మ్రొక్కి ♦ భక్తితోడ. ౨

క. సరసుర బ్రహ్మేంద్రాదులు,
స్మరియించెద శివనిమున్ను ♦ సద్భక్తిని నే,
పరిచర్యలందు మఱి య,
ప్పురముని గణనాథు విఘ్న ♦ పతిని నుతింతున్. 3

చ. ఎలమి రజస్సు బ్రహ్మయన ♦ నింపుగ సృష్టికి వాణిశక్తియై,
పొలుపుగ విష్ణు సత్త్వమనఁ ♦ బోషణసేయఁగ లక్ష్మిశక్తియై,
యలరుఁ దమంబు శంభుఁడన ♦ నంత మొనర్పఁగ గౌరిశక్తియై,
చెలఁగు త్రిమూర్తులం దలఁచి ♦ చింతనసేతుఁ ద్రిశక్తులందగన్.

క. ధర హేమమొకటి సకలా,
భరణము లైనట్లు భూత ♦ పంచకమును నై,

నరసుర లాద్యఖిలము నై,
పరఁగెడు పరమాత్మ నెపుడు ♦ భావింతు మదిన్. ౫

క. అరయఁ ద్రిమూర్త్యాదులకును,
సరీసృ పామ ర్త్యమ ర్త్య ♦ జగములకును నా,
పరమాత్మ కంటె మున్ గల,
పరబయలగు కేవలాత్మఁ ♦ బ్రకటింతు నొగిన్. ౬

తే-గీ. మేటి మునులగు వ్యాస వా ♦ ల్మీకులాది,
కవుల నాంధ్రగీర్వాణ స ♦ త్కవుల నెంచి,
యచల భావజ్ఞు లగునార్యు ♦ లందఱకును,
ముదము మీఱంగ సాష్టాంగ ♦ ముల నొనర్తు. ౭

క. అరుదార నాంధ్రసంస్కృత,
వరఛందః కావ్యములను ♦ వ్యాకరణము నేఁ,
బరికించి యెఱుఁగ నెన్నఁడు,
గురుకృప నీ కృతినొనర్పఁ ♦ గోరిన వాఁడన్. ౮

చ. పరువడిఁ దప్పులుండినను ♦ భ క్తిరసంబును నుప్పతిల్లఁగా,
నెర నొనరించు సత్కృతికి ♦ నెంతయు వక్రము గల్గనేర్చునే,
వరుసగ నిక్షుదండమున ♦ వంకరవోయినఁ దీపిమానునా,
తిరముగఁదప్పులున్న నిట ♦ దిద్దుఁడి వేఁడెదఁ బండితుల్ దయన్.

వ. ఇందుఁ బరమార్థానుభవంబుచేఁ బ్రపంచానుగుణ్యా మగు బ్రహ్మ విష్ణు మహేశ్వ రాది దేవత లబద్ధమనియు, మతకుల శాస్త్ర విషయాది మార్గము లసత్యములనియుఁ, గ్రతువ్రత దాన తీర్థాది కర్మంబులు వ్యర్థములనియు, సన్న్యాస వానప్రస్థాశ్రమాది వేషధారుల పద్ధతులు డంబములనియు స్పష్టముగాఁ దెలుపఁబడుచున్నది, యదార్థవిచారణంబున సమస్తము మిథ్యయగుట నిశ్చయముగావున, నిది దూష్యంబుగా నెంచక పండితులు నా మనోభావము గ్రహింతు 1
రని నమ్ముచున్నాఁడను.

సీ. తనుఁదాను వినుతించు ♦ కొనుటయుఁ బరదూష -
ణంబుఁ గూడదఁటంచు ♦ నార్యులనిరి,
తనకుల గుణవిద్య ♦ లనుహెచ్చుగా నెంచు -
కొనుటె యాత్మస్తుతి ♦ యనఁగఁబరఁగు,

గుటిలతఁ బరకుల ♦ గుణములఁదెగడుట -
నిందితంబనఁబడు ♦ నెంచిచూడఁ,
బరులరోయుచుఁ దన్నుఁ ♦ బ్రకటించుకొనువాఁడె -
యనయంబుదుర్జనుం ♦ డనఁగనొప్పుఁ,
తే-గీ. గాని నిజమునుజూపించి ♦ క్రమముగాను,
మాయచేఁ గల్పితంబుల ♦ మట్టుపఱచి,
బ్రహ్మమే సత్యమని తెల్పి ♦ భ్రాంతులెల్లఁ,
దొలఁగఁద్రోసెడు బోధంబు ♦ దూష్యమగునె. ౧౦

వ. అనియిట్లు విద్వజ్జనంబులంగొనియాడి మజ్జన్మక్రమంబుఁ గొంత యెఱింగింతు నెట్లనిన. 2

సీ. నెల్లూరుజిల్లాను ♦ నెగడెడుకందుకూర్ -
పరగణాలోఁ బల్లి ♦ పాట్పురమున-
గోన్గుంట బలిజ స ♦ త్కుల సింధువిధుఁడు క -
ర్పురగోత్రపంకజ ♦ తరణి యనఁగ,
జెలఁగె బోలకము ల ♦ క్ష్మీనృసింహాఖ్యుఁ డౌ -
ననఘుఁ డాతనిసతి ♦ యలరె లక్ష్మి,
యన హరిపద్మల ♦ ట్లమరువారల గర్భ -
మం దుద్భవించితి ♦ మైదుపురము,
తే-గీ. నవనిఁ గొండయ వెంగయ ♦ నరయరామ,
యాఖ్యుఁడును నక్కమాంబిక ♦ యనఁగ నొప్ప,
వీరు నల్వురకును నేను ♦ బెద్దనగుచు,
ధరణిఁ బరఁగితి నరసింహ ♦ దా సనంగ. ౧౧

వ. మఱియు మదీయగురుపరంపర నించుక వివరింతు. అజ్ఞాన తమః ప్రభాకరుండై, సుజ్ఞానసంపత్కార శోభితుండై, భక్తజనరక్షకుండై, జగత్ప్రసిద్ధిఁజెందిన పోతులూరి వీరబ్రహ్మ గురునకు దూదేకుల సిద్దప్పయు, సిద్దప్పగురునకు జంగ మమరలింగమును, నమరలింగగురునకు శేషరాజును, శేషరాజ గురునకుఁ జెంచు రాజును, జెంచు రాజగురున కమినిగడ్డ - కోటప్పదేవరయుఁ, బోకల- శేషాచలా హ్వాయుండును శిష్యులైరి. మఱియు నచలగురుపరంపరలో నొకం డైన శ్రీ శివ రామదీక్షిత గురునకు రామకృష్ణుండును, రామకృష్ణ

గురునకు మహేశ్వరుండును, మహేశ్వరగురునకు మీఁదఁ జెప్పిన కోట
ప్పదేవరయుఁ, గోటప్పదేవరగురునకుఁ బోకల – శేషాచలాహ్వ
యుండును శిష్యులైరి. శ్రీశేషాచలసద్గురుండు చెన్నపురంబున శిష్య
గణంబులు సేవింప, రెండవ పరమేష్ఠియుంబోలి దిగ్దేశంబుల యశం
బునొంది, మహానుభావుండగుచు, లోకంబున సాధుజనంబులు సుల
భోపాయంబునఁ దరించున ట్లనేకగ్రంథంబు లాంధ్రంబున రచియిం
చి, యచలబోధ వెదఁజల్లిన నెల్లవారికిఁ దెల్లంబుగ వెల్లడించిరి. ౩

క. ఆ శేషాచల గురునకు,
నేశిష్యుఁడనైతిఁ బ్రీతి • నిహసౌఖ్యములన్,
రోసి దురితంబు లగుభవ,
నాశంబులు దొలఁగుకొఱకు • నతులితభక్తిన్. ౧౨

సీ. హరి యొక వేల్పంచు • హరుఁడొక్క వేల్పంచు-
వివరింప నజుఁడొక్క • వేల్పటంచు,
పాకశాసనుఁడంచుఁ • బంచభూతములంచు-
గణపతినా నవ • గ్రహములంచు,
శక్తులంచును జాల • జగతి నీవేల్పులఁ –
గోరి నేనెంతయుఁ • గొల్వఁజాల,
నీవ యొక్కఁడవంచు • నెంచి భజించెద –
సతతంబు నీకటా • క్షంబు వలనఁ
తే-గీ. బుద్ధి దెల్పిన మానస • బోధ యనఁగ,
బరఁగు సుజ్ఞాన కీర్తనల్ • పద్యవచన,
యుక్తముగఁ జెప్పఁదలఁచితి • రక్తిమీఱఁ,
బల్కు పల్కించు గురురాయ • ప్రౌఢిమెఱయ. ౧౩

వ. అని యిట్లంతరంగంబున సద్గురు ప్రార్థనంబుగావించి మఱియును.



షష్ఠ్యంతములు.

క. జ్ఞానాస్పదునకు గురునకు,
ధాతాదులు గొల్చుమేటి • దైవతమునకున్,
భూతాధారున కాపో,
జ్యోతికి నసమాన సుపరి • శుద్ధాత్మునకున్. ౧౪

క. గుణశూన్యునకును భువన,
ప్రణుతునకును బంధమోక్ష ♦ భవహీనునకున్,
బ్రణవాకారునకును బుధ,
గణసేవితునకును బూర్ణ ♦ కరుణాంబుధికిన్. ౧౫

క. ఖండాఖండ రహితునకు,
దండి జగద్భ్రాంతి వర్జి ♦ తాచలమునకున్,
నిండగు పరబయలునకు,
నండఁబ్రద విగతమగు న ♦ నంతంబునకున్. ౧౬

వ. అర్పణంబుగ నిపుడే నొనర్పంబూనిన బుద్ధ్యుపదేశిని యను మానసబోధ సుజ్ఞానతత్త్వ కీర్తనల గ్రంథంబున కాది యెట్టి దనిన:— పంచభూత వికల్ప ప్రపంచం బను దేశంబున సప్త ప్రాకార రక్షితంబగు నవద్వారపురంబున, నేకస్తంభ సౌధాంతరంబున, జగత్ప్రభుం డగు పరమహంసమహారాజు మాయాకాంత సమేతుండై కోటిసూర్యప్రకాశంబునఁ దేజరిల్లుచు, సుషుమ్నాసింహాసనంబునఁ గొల్వుండి, చతుర్వింశతిభటులు పరివేష్టింప జీవుండను మంత్రితో విశ్వపరిపాలన సేయుచుండ, నాత్మజ్ఞానరహస్యంబు లోకోపకారంబుగఁ దెలుప, మేధావి యయినబుద్ధి సర్వసంకల్పయుక్తం బగు మనంబున కిట్లనియె. (౩౩-వకీర్తన.) 5

క. పరమార్థ చింతనము సు,
స్థిర మొప్పఁగఁ జేయు నట్టి ♦ దినమే దినమౌఁ,
బెఱదినములు వృథ గావున,
నిరతము సద్గోష్ఠి విడక ♦ నెఱపుము మనసా. ౧౭

వ. ఓ మనసా, ప్రపంచజనంబులు కుల రూప ధన యౌవన విద్యారాజ్య తపశ్శీలంబులను నష్టమదంబులచేతను, సురాపాన హింసానృత ద్యూతకృత్రిమ జారచోరత్వంబులను సప్తదుర్వ్యసనంబుల చేతను, గామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యంబులను నరిషడ్వర్గంబుచేతను దగులువడి, సద్విచారంబు లేక దుర్గతికిం బాత్రులగుచున్నారు. కావునఁ బ్రాజ్ఞుండు జీవితంబునఁ గాలంబు వృథాసేయక సద్గోష్ఠిం బ్రవర్తింపవలయు. సద్గోష్ఠి యనఁగా బరమార్థవిషయం బనంబడు. పరమార్థంబన భగవద్విచారంబగు. అట్టి భగవద్విచారం

బందతికిని గలుగనేరదు. అది యనేకజన్మసుకృత ఫలవిశేషంబున మనుజునకు లభ్యంబగుఁ, గాని తొలుత నేజ్ఞానం బేరికిం బట్టువడదు. సత్కర్మాచరణవలన భక్తియు, భక్తివలన జ్ఞానమును గలుగుచున్న వి. సత్కర్మ పిందె వంటిది. భక్తి కాయవంటిది. జ్ఞానము పండువం టిది. కాన, సత్కర్మాచరణలేక భక్తియును, భక్తిలేక జ్ఞానమును, జ్ఞానములేక ముక్తియును సంభవింపదు. అట్టిముక్తిం బొందించుటకు సద్గురుఁడే మూలము. పంచాంగములేక దినశుద్ధి తెలియంబడనట్టు
లింక నేవిధంబునను జ్ఞానము వహింపరాదు. వినుము. 6

1. తో హా రా.

భక్తికి సుగుణమె మూలము ముక్తికి - భక్తికారణం బింత
ముక్తిభుక్తులను నొసఁగఁగ గురుఁడే - మూలము నరులకు నంత
అరయఁగ మనసే రాజింద్రియముల - కాదిమాయలకు నెల్లఁ
బరమాత్మయె సర్వమునకు మూలము - బ్రహ్మేంద్రాదుల కెల్ల
నిరవుగ నిహమును మెప్పించుటకును - హేమ తారకసువిద్య
పరమును సాధించుటకును నిరవై - పరఁగు బ్రహ్మసద్విద్య.
జనముల నందఱ మాయముంచునది - చపలత్వమె భావింప
జననజరామరణములఁ బాపునది - సారామృతమె గణింప
నమలత నొసఁగును శేషాచలగురు - నతులితకృపఁ గైకొన్న
సమయు నఘంబులు నరసింహాఖ్యుని - సద్వచనంబులు విన్న.

క. జ్ఞానమె ధనమణి భూములు,
జ్ఞానమె సతిసుతులు పసిఁడి ♦ జ్ఞానమె గృహముల్,
జ్ఞానమె భూషాంబరములు,
జ్ఞానులకును రక్షకంబు ♦ జ్ఞానమె మనసా. ౧౮

వ. ఓమనసా, జ్ఞాని దారాసుత ధన కనకవస్తు వాహన గృహ క్షేత్రాదుల ఘనంబుగా నెంచక, జ్ఞానధనమే సమస్తమని నమ్మి సేవించుచుండు. ఇతరు లట్టి జ్ఞానవిత్తం బార్జింపనేరక మాయంబడి మతిహీనులై తమ గతు లెఱుంగక నటింతురు. గోమాంసమందుఁ బుట్టిన గోరోజనంబు సకల శుభకార్యములకు యోగ్యమైనట్లు, జ్ఞానము గలవాఁడు హీనకులమందుఁ బుట్టిన నతండు సర్వోత్తము డనం బడు. జ్ఞానము జన్మంబుఁ బాపి రక్షించునది గావునఁ జంజాలు వలన

నైనం బడయందగును. అమృతము జరామరణములఁ బాపునదిగాన విషంబువలననైనం బొందందగు. హేమంబు లేమి నడంచునదిగాన, నమేధ్య మందైనను గైకొనందగు. హితవచనంబులు మేలిచ్చునవి గావున బాలుని వలననైన వినందగు. జ్ఞానమంత్యజుని యొద్దనైనను సులభముగా గ్రహించుటకు సాధ్యపడదు. శుశ్రూషచేసి యైనను ధనమిచ్చియైనను దానేర్చినవిద్య నొసంగియైనను గ్రహింపవలయు. ఒండొకవిధంబున లభ్యంబు గానేరదు. శుశ్రూషచేసి వహించిన జ్ఞానమువలన నిష్టసిద్ధియు మోక్షంబును గల్గుచున్నది. విద్యాధనములిచ్చిఘటించిన జ్ఞానమువలనఁ గోర్కెమాత్రము ఫలించునేగానిముక్తి లభింపనేరదు. కావునఁ జండాలునొద్ద నైన శుశ్రూష చేసియే జ్ఞానము వహించి మోక్ష గతింజెందుట యోగ్యంబగు. అట్లు త్రికరణ శుద్ధితో గురుమూర్తింగొల్చి జ్ఞానము సాధించుట యెరికిని దుస్తరంబువినుము. 7

## 2. కీర్తన. జంఝూటి రాగము - రూపకతాళము.

జ్ఞానమెంతవారికైనఁగాన శక్యమా - లేనిపోనిభ్రాంతులొంది-పూనరుగురుఁ-గానఁగ నభి-మానము నెదమానరు-సు॥ జ్ఞాన॥ తల్లిదండ్రు లిల్లుభార్య పిల్లలాదిగా-నుల్లమందు నమ్మిచాలఁ-గల్లరు లివియెల్లను మఱి-యిల్లని గన నొల్లరు-సు॥ జ్ఞాన॥ ధరణి శేషాచలవరార్యుల దండికరుణను-నరయ నరసింహాఖ్యమదిని-మఱవక తగ-నిరతము సు-స్థిరతరముగ నెఱఁగిన-సు॥ జ్ఞాన॥

క. ఎక్కడఁ దిరిగిన మోక్షము,
చిక్కుట దుర్లభము గురుని ♦ సేవించి తగన్,
మ్రొక్కి గురుపంచఁగాచిన,
నిక్కముగనవచ్చుఁ గాక ♦ నేర్పున మనసా. ౧౯

వ. ఓమనసా, గురుకటాక్షంబులేక, నరుం డడవులన్ని చరించినను, నాకసంబునకేగినను, నఖిలతీర్థములు సేవించినను, సకలయజ్ఞంబులు సల్పినను, కూపతటాక గోపుర దేవాలయాదు లేర్పఱచినను, వేదశాస్త్రపురాణములు విభజించినను, ననేకప్రబంధములు గల్పించినను బ్రయోజనంబులేదు. ముక్తికి గురుచరణమేగతియగు. కావున,

### 3. కీర్తన. హిందుస్థాని రాగము - అటతాళము.

కనవె జీవ గురుమూర్తిసేవ॥ కనవెజీవ॥ అనుమానమేల సన్మార్గంబునార్జించు - పనికంటె లోకమున ఘన మొకటిలేదు॥ కనవె॥ బ్రతుకుచూడఁగ క్షణ భంగురం బగుదీని-మతిలోననమ్మి నీగతిదెలియవేమి॥ కనవె॥ వెనుకముందటివారు విఫలులై మాయలో - మునిఁగిపోయినవిధము గని కానలేవు॥ కనవె॥ సరసంబుగా శేషాచల శ్రీ సద్గురుకరుణ - నరసింహదాసున కనువైనత్రోవ। కనవె।

క. మరిజన్మ జన్మములలోఁ,
నరయఁగ దలిదండ్రి బంధు • లాదిగలరు త,
న్నెఱిఁగించు గురుఁడు దొరకఁడు,
దొరకినచో జన్మసిద్ధి • దొరకుటె మనసా ౧౦

క. నీట మునుంగును శిల యా,
నీటను నొక తెప్ప నుంప • నెపుడు మునుఁగ ద,
ప్పాటిగ గురుఁ డను నావే,
నేటుగ భవవార్ధి మునుఁగ • నీనిది మనసా. ౧౧

వ. ఓమనసా, ప్రాజ్ఞుండు గురుచరణం బనునావచే సంసార సముద్రమును దరించు. అట్టిగురుచరణం బంద లేని పామరులు తామ్ర మృణ్మయ దారు లోహ శిలాది ప్రతిమల దైవంబు లనియెంచి, యర్చనవందనాదు లొనర్చుచు నైవేద్యంబు లిచ్చుచు, నానావిధ భ్రమ లందగిలి, జ్ఞానహీనులై నటియింతురు. అట్టిమందబుద్ధు లెట్లు తరింపఁ గలరని పల్కి మఱియు నిట్లనియె. 9

### 4. కీర్తన. యమునాకల్యాణి రాగము - అటతాళము.

నిక్క మెఱుఁగక చెడనేలమనసా - కుక్కవలెఁ దిరుగు టది గొప్పయగునా॥ నిక్క॥ కర్మములు సల్పుటది ధర్మమగునా - ధర్మపథమైన పరదారిగలుగ॥ నిక్క॥ కొంచెమగుమానవులఁ గొల్వనేలా- మంచి నొక్కించుకయు నెంచవేలా॥ నిక్క॥ కూరిమితో శేషాచల గురునిఁ గనవే - నారసింహాఖ్యువచనంబు వినవే॥ నిక్క॥

క. కనవచ్చు ముందె యేష్యము,
కనవచ్చును జావు దేశ • కాలగతులఁ బో,

కనరా దలగురు మర్మము,
ఘనముగ నిల నెంతవారి ♦ కైనను మనసా. ౨౨

వ. ఓమనసా, గురుమర్మ మనఁగా, జన్మకర్మబంధముల విడఁగొట్టు బ్రహ్మవిద్య. అది బ్రహ్మమును దర్శింపఁజేయునది గాన బ్రహ్మవిద్య యనంబరఁగె. జనులు సమస్త కార్యంబు లొనర్చుటకు శక్తులయినను బ్రహ్మవిద్య సాధించుట కేరికిని దుస్తరంబు. కనుక నే లోకంబున సహజముగా నెవ్వరును దమతమపను లాచరించు నెడ 'నిదిబ్రహ్మవిద్యయే' యనిపల్కుట. తామొనరించుపనులు సులభము లనియు బ్రహ్మవిద్య యసాధ్యంబనియు గణించి నట్లర్థ మగుచున్నది. మఱి యట్లే బ్రహ్మవిద్య యలవిగానిదని సర్వజనులు ననుసరింపక వర్జించిరి, జగంబున నావిద్య కోటి కొక్కానొకం డవలంబించుటరుదు. బ్రహ్మవిద్యదెలియక నరుం డఖిలమర్మకర్మ ధర్మంబు లెఱింగినను నవియెల్లను, వృథా యగుటంజేసి, నిత్యానిత్యవస్తువివేకము, నిహాముత్రార్థ ఫలభోగ విరాగము, శమాదిషట్కమ సంపత్తి, ముముక్షుత్వం బనునీసాధనచతుష్టయం బార్జించి, నిరంతర భక్తిచే గురుసేవకుండై పరమధర్మంబగు గురుమర్మంబు గ్రహించి ముక్తింగనుట సార్థంబు కావున. 10

౯. కీర్తన. నాదనామక్రియ రాగము - త్రిశ్రజాతిరూపక తాళము.

గురుమర్మ మెఱుఁగవే జీవా - వట్టి - గుఱుతులెల్లను గ్రుడ్డిత్రోవ। అరయ నది దుర్మతుల కందంగరానిదై - పరమభక్తులకెల్లఁ బ్రత్యక్షమైనది॥ గురు॥ అదియు నిదియును నేది గాదు - దాని - వెదకి చూచినఁ గానరాదు। మదికిఁదోఁచుచునుండు నదుకశక్యముగాదు - ముదమార - నదియెన్న మోక్షమైయున్నది॥ గురు॥ ధరణిగగనము లెల్ల నిండు - నెట్టి - తఱిని నాశము లేక యుండు। హరిహర బ్రహ్మాదులకు నాదియైయుండు - సుర మునీశ్వరులచే శోధింపఁబడుచుండు॥గురు॥ మఱుఁగు తఱుఁగులులేని బాట-యట్టి - మార్గమందు కెు మంచితేఁట। గురుదార శేషాచ లార్యులకరుణచే - నరసింహ దాసునకు స్థిరపదంబైనట్టి॥ గురు॥

క. తాపంబుల కాస్పదమగు,
నీపాపఁపు జన్మమెత్తి ♦ యేమిఫలము దు,

ర్వ్యాపారములకు లోనై,
యేపగిదిఁ దరింపఁగలవో ♦ యిలలో మనసా. ౨౮

వ. ఓమనసా, తాపములనఁగా: వాతపైత్య శ్లేష్మాది రోగంబులచేఁ బ్రాపించు దుఃఖంబు లాధ్యాత్మిక తాపంబులగు. చోర ఫణి వృశ్చిక క్రూరమృగాదులచే సంభవించు దుఃఖంబు లాధిభౌతిక తాపంబులగు. శీతవ ర్షాతప శిలా నిలాగ్న్యశనులచేఁ గల్గు దుఃఖంబు లాధిదైవిక తాపంబులగు. ఈ త్రివిధ తాపంబులచే, శిఖింబడిన శలభంబు మాడ్కి, జన్మజన్మంబులఁ బరితపింపనేల ? సుగతింగనిన సమస్తతాపంబుల కునికి యగు జన్మలఁబాసి సుఖస్థితిం జెందెదవు. అట్లగుటం జేసి.

**6.** కీర్తన. ముఖారిరాగము – అటతాళము.

సుగతి మార్గము సుకరంబు గనుజీవ। జగతి వాసనలందుఁబడి నీ వగడుచెందుట తగదురా॥ సు॥ ఎన్నిజన్మము లెత్తియుంటివో తొల్లి। యెన్నిజన్మము లింక నీవిల నెత్తవలయునో శ్రమలురా॥ సు॥ మనసు చంచలమడఁచి వేయఁగలేక। మొనసి యజ్ఞా నాంధముననిటు మునిఁగి పోవఁగ నేలరా॥ సు॥ సరవి శేషాచల గురూత్తముకరుణఁ। బరఁగ నరసింహాఖ్యుఁ డనయముఁ బల్కు హితమాలించరా॥ సు॥

క. ధర జన్మించుటె దుఃఖం,
బిరవుగ సంసార జలధి ♦ నీఁదుటె దుఃఖం,
బరయ జరామరణంబులు,
సరవి ననుభవింప దుఃఖ ♦ సంతతి మనసా. ౨౮

వ. ఓమనసా, జీవుండు మలమూత్ర గర్భంబునఁ బిండరూపంబై, కరచరణా ద్యవయవము లంకురించి యవి పూర్ణమగునంతకు గర్భ నరకంబునంబడి పరితపించుచుండు. పిదప మూత్రద్వారంబు వెడలించుకొని బయటంబడి, బాల్యంబున మలమూత్రంబులం బొరలుచుఁ, దల్లి చనుఁబాలుద్రావుచు, నలుగడల సిగ్గులేక బల్లివిధంబునం బ్రాఁకు. కౌమారంబునఁ గేవల మవివేకియై తిరుగుచు నహితంపుఁ బనులొనరించు. యౌవనంబునఁ గన్నుగానక స్త్రీలోలుఁడై చరించుచు, నర్థార్జనాపేక్షం దుష్క్రియలైనఁ గావించుచు, నధర్మంబులకు లోనగు. వార్థకమున దేహపటుత్వంబుదొలఁగి, దంతంబు

గూఁడి, మతిదప్పి తబ్బిబ్బులాడుచుఁ బర్యంకంబునఁ బడిలేవలేక, తనవారెల్లఁ దనయందప్రియులై నిందింపఁజేయునదిలేక ఘోరదుఃఖంబునంగుందు. అంత మృతుండై మగుడి జన్మించు. ఇట్టి దుఃఖాస్పదుండగు జీవుండు పరత్వంబుఁజెంది ముక్తుండగునంతకు సుఖం బించుకయైనఁ జెందఁడు. కావున, 12

## 7. కీర్తన. ముఖారి రాగము – అటతాళము.

వలదు – జీవ – వలదు – జన్మాలఁబడఁగ – వలదు॥ జీవవలదు॥ వలదు జన్మలఁబడఁగ – ఫలమేమి గలదింక – సలలితంబుగ మోక్ష – సరణి తెలియుము మమత॥ వలదు॥ కుండగాదెలచాటు – కొక్కు చంద మెక్కి – కండలు పెంచినఁ – గాటిపాలేగద॥ వలదు॥ నాదినేనునీవు–నీదినీ వారనుచు మీఁదవచ్చెడుకీడు – మేలెఱుఁగనిభ్రమత॥ వలదు॥ మేలు దెల్పిన నాత్మ – కీలు దెలియవుమాయా – జాలములో మునిఁగి బేల బుద్ధులుపూన॥ వలదు॥ ధరణిశేషాచలస – ద్గురుకరుణ గైకొన్న – నరసింహాఖ్యుని మాట – నమ్ము మోసమునొంద॥ వలదు॥

క. చిత్రించిన బొమ్మలక్రియఁ,
జిత్రముగాఁ దోఁచెఁగాక • క్షితిలోఁ దనువుల్,
చిత్రము కారకుఁ డింతకుఁ,
జిత్రకుఁడని తెలియు మిది వి • చిత్రము మనసా. ౨౭

వ. ఓమనసా, యీదేహము వాయుయంత్ర యుతంబగు కీలుబొమ్మ యనంబరఁగు. ఇదిక్షణభంగురంబు. జలబుద్బుదమట్లు, పండు టాకు పగిది, మెఱపుఁదీఁగె పోల్కి, వడగండ్ల మాడ్కిఁ గనుపించుచు, స్వప్ననిద్రాజాగ్రత లను మాయలోఁ దనలోపలి హంసచే నాడుచు, నంతలోఁ గీలూడిన బొమ్మగతిం బడిపోవు. ఇది గారడి మాయగాఁ దెలియుమని పల్కి, మఱియు నిట్లనియె.

## 8. కీర్తన. ముఖారి రాగము – ఆదితాళము.

మాయరూప మీతనువు – ఇది మఱిఁగిన సద్గతిగనవు। మాయరూపమిది మంటికుండగద – వేయిభోగముల పెట్టిపెఁగినను॥ మాయ॥ పచ్చితోలుపైపూఁత – ఇది – ఉచ్చపీతులరోఁత। హెచ్చుగఁ బ్రేవులు నెముకలు నరములు – బొచ్చునంజుడుల రొచ్చుతలంపఁగ॥ మాయ॥ పాములపుపుల కుంట – ఇది – భయదుఃఖంబుల పంట। చీఁకిడి యుమి

పుసి చెమట తెమడలును - చీమునెత్తురులసీఁద(పుడొక్క॥ మాయ॥ తొమ్మిది దారులకొంప - ఇది - నుష్కర్మంబులగంప । కుమ్మున నూఁదడి కొలిమితిత్తి ని-క్కమ్ము క్షుదతృష్ణలకిమ్మగుకుంపటి॥ మా॥ అరయఁగ నగవులపుట్ట - ఇది - ఆవులింతలచట్ట । తెలుచుగఁద్రేపులు దగ్గులపానముల - కిరవగుతుమ్ముల కెక్కిళ్లకు మూలము॥ మాయ॥ స్థిరమెఱుంగులే గణన - (శ్రీ) - శేషాచలగురు కరుణ । ధరణిఁబోలకం నరసింహాఖ్యుఁడు - స్థిరమెఱింగి యిలఁ జీ యనిరోసిన॥ మాయ॥

క. పనిపూని నీవు కాయం,
బును నమ్మకు నీటిమీఁది • బుగ్గయె సుమ్మీ,
తనువుండు నంతలోనే,
గనుఁగొని నిను నీవుముక్తిఁ • గాంచుము మనసా. ౨౬

వ. ఓమనసా, మనుజునకు శతవర్షంబు లాయువని చెప్పుదురు. అది నమ్ము టర్హంబుగాదు. జీవితం బింతకాలంబని యెఱుఁగం బడదు. బాల్యముననో, యౌవనంబుననో, వార్ధకముననో, యింటనో, కాటనో, యంబువులనో, ననలంబుననో, విషంబుననో, వృక్షంబుననో, యేవ్యాధినో, యెప్పుడో, యేక్షణంబుననో, తప్పక చావు సిద్ధించు. అట్లగుటచే నేరికిని బ్రదు కనిత్యంబుగాన సత్వరంబున మోక్షంబు సంపాదించుట యావశ్యకంబు. వినుము. 14

9. కీర్తన. కాఫిరాగము - అటతాళము.

అపుడేమి ముక్తిగనియేవు-నీ - విపుడే పరమాత్మఁ గనలేవు । విపరీతముగనిట్టి - చపలంబుతోనున్న - గఫవాత పైత్యములు - గప్పి మతి చెడిపోవు॥ నపు॥ దిట్టంబుగాఁ గరుణమాని-నీ - చుట్టు నాయుధములు పూని । బెట్టిదముగ బాధ-పెట్టి పాశములచేఁ -గట్టి యమకింకరులు - పట్టితీసుకపోవు॥ నపు॥ కోటివాంఛలు నీలోఁగ్రమ్మి -నీ-బోఁటి తనయుల నాత్మనమ్మి । మేటిజీవుఁడు తనువు - దాఁటిపోవకమున్నె - సూటిదెలియవు మేను - కాటిపాలై పోవు॥ నపు॥ దురితాంధకార భాస్కరుని-నీ-ధరను శేషాచలగురుని । పరిపూర్ణకృపచేత - నరసింహ దాసాత్మఁ- బరికించి వివరించు-భావం బెఱుఁగలేక॥ అపు॥

క. హరి యని గొల్వఁగ నేటికి,
హరుఁ డని భావింపనేల • యజుఁ డననేలా,

గురుఁడు త్రిమూర్త్యాత్మకుఁ డని,
యరయంగా గురుఁడె యఖిల • మగు నో మనసా. ౨౭

క. గురుమహిమఁ దెలియఁజాలక,
నరులూరక చెడుదురల్ప • నటనలచేతన్,
గురుఁడే యిహమును బరమును,
గురుఁడే రక్షకుఁడుజీవ • కోట్లకు మనసా. ౨౮

వ. ఓమనసా, గురుస్వరూప మఖిల భూతంబులయందు నాత్మయై యన్యంబేమియు లేక ప్రకాశించుటంజేసి, త్రిమూర్తులును గురుపదమే తమకు దిక్కనిగొల్తురు. కావున, గురుఁడే సమస్తలోక రక్షకుండని సేవించి భజించుమని పల్కిన బుద్ధిం గొనియాడి మనంబు ఘనంబుగా గురునింగూర్చి యిట్లని కీర్తించె. 15

## ౧౦. కీర్తన. ముఖారిరాగము – అటతాళము.

శరణుగురువర దురితహారనీ – చరణములు నెఱనమ్మియున్న – వాఁడను– సరసముతోడను॥ శర॥ కర్మ జన్మంబులకు భయపడి – ఘనముగాఁ దమసన్నిధికినేఁ – జేరితి – మోక్షముఁగోరితి॥ శర॥ జగతిలో జన్మించి నందుకు–సార్థకము మిముఁగనుటకంటెఁ– గలుగునా– భవములు దొలఁగునా॥ శర॥ శిష్టజనులకుఁ గాకమీపద – సేవనము దుర్జనులకందఱి– కబ్బునా–సద్గతిగొబ్బున॥ శర॥ మేలుగా శేషాచలార్య – పోలకం – నరసింహ కవిని – దాసుగా – నేలుఁడి వాసిగా॥ శరణు॥

వ. అనియిట్లు **గురు**నిం గొనియాడుచున్న మనంబు నవలోకించి బుద్ధి యిట్లనియె. 16

క. పరఁగ **గు** వర్ణముమాయే,
యరయ రు వర్ణంబుదాని • నడఁచునదియె పో,
**గు**రుఁడే పరదైవతమగు**గు**ఁ,
బరమెందును లేదు వెదకి • పట్టిన మనసా. ౨౯

క. **గు**రుఁడే పరమాత్ముండని,
పరమాత్ముఁడె **గు**రుఁడఁటంచు • భావించి నిజం,
బరసిన భక్తుఁడె భక్తుఁడు,
పర**గు**రు భేదకుఁడుగాఁడు • భక్తుఁడు మనసా. 30

వ. ఓమనసా, భక్తుఁడనఁగా గురుభక్తివహించినవాఁడు. గురుఁడనఁబరస్వరూపుఁడు. గురుప్రభావ మెంతనవచ్చును. గు కారము మాయయను నజ్ఞానాంధకారము. రు కారము సుజ్ఞానమగు వెలుఁగై యజ్ఞానాంధమును విడఁగొట్టునది. కావున సమస్తభువనంబుల 'గురు' శబ్దమునకు మించినదిలేదు. కాన, గురుపరంబులకు భేదంబు సేయక, గురుఁడే పరాత్పరుండని ధ్యానింపుమనిన, మనంబు గురునింగూర్చి యిట్లని స్తుతించె. 17

**11.** కీర్తన. పున్నాగరాగము – అటతాళము.

పరమాత్మ పరమేశ భవనాశసర్వేశ – కరుణాబ్ధి చంద్ర నా – గతిదెల్పవయ్యా । గురువరేణ్యా – గురువరేణ్యా – వరభక్తగణ్యా గురువరేణ్యా॥ కామాంధముననేను గావించుతప్పిదము – లేమున్న మన్నింపనీదెభారంబు॥ గురు॥ ఈజననమరణంబు లిఁకనేనుబడఁజాల – నీజన్మతోడన – నీ్నడేర్చుమయ్యా॥ గురు॥ సరసంబుగాశేషా – చల శ్రీసద్గురుదేవ – నరసింహాఖ్యునిపల్కు లాలింపుమయ్యా॥ గురు॥

వ. అనియిట్లు గురునిం బ్రకటింపుచున్న మనంబు వీక్షించి బుద్ధి యిట్లనియె. 18

క. గురుచరణంబుల భక్తిం,
డరసి భజింపంగఁ గరత • లామలక మగుఁ,
బరమగు మోక్షము సద్గురు,
మఱుఁగెఱిఁగిన బయలు ముక్తి • మార్గము మనసా. ౩౧

క. హరుఁడైన ధాతయైనను,
హరియైన సురేంద్రుఁడైన • నమరులునైనన్,
ధరజనము లెవ్వరైనను,
సరివత్తురె గురునకెల్ల • జగముల మనసా. ౩౨

వ. ఓమనసా, లోకంబునఁ బుణ్యాత్ములగు మానవులకుఁ దగిన పదవులిచ్చి, వారివారి పుణ్యములు నశించినతోడనే యందుండనీక, మగుడి మర్త్యంబునం బడఁద్రోయునట్టి బ్రహ్మాదులపై భ్రమను విడిచి, జ్ఞానోపదేశ మొసంగి జన్మరహితంబు గావించునట్టి గురుఁడే దేవదేవుండని ప్రస్తుతింపు, మనిన మనంబు గురునింగూర్చి యిట్లని వినుతించె. 19

**12.** కీర్తన. యమునాకళ్యాణిరాగము - అటతాళము.

గురునాథ వినుమునామనవి-నేఁ-బరికింపఁజాల మీ మహనీయ పదవి॥ గురు॥ మఱిభుక్తాసక్తిమీ - మఱుఁగు, జేరఁగలేదు - నిరతంబు మీసేవ - నేఁగోరియుంటి-నా-నిశ్చయమంటి॥ గురు॥ ననుఁదిట్టి కొట్టిన విడను-మీ - ఘనమైనకరుణ కేఁ గాచియున్నాను। ధనకనకవస్తువాహనములిమ్మనలేదు - అనఘాత్మసుగతికై యాశ్రయించితిని - మి - మ్మాశ్రయించితిని॥ గురు॥ వరశేషాచల దేశికేంద్రా - యో-పరిపూర్ణ కారుణ్యపరమయోగీంద్రా - సరసంబుగానిపుడు-నరసింహాఖ్యునిఁబ్రీతి-నిర వొంద రక్షింప నీకనీవేనంటి - నిం-కెవరులేరంటి॥ గురు॥

వ. అనియిట్లు గురునిస్మరించు మనంబు నుద్దేశించి బుద్ధి యిట్లనియె. 20

క. ఘనుఁడు నిజగురుఁడె మాయా,
బ్ధినిఁ గడపును లుబ్ధుఁడెట్లు • దేర్చును బ్రజలన్,
వనధి దఱియ నోడయె గా,
కనువుగ శుని వాల మవలఁ • గడపునె మనసా. 33

వ. ఓమనసా, జనులకుఁ బరహితము దెల్పనేరక జననమరణంబులను మాయం బడఁద్రోయువాఁడే లుబ్ధుఁడనంబడు. ప్రపంచమున నెరికిందెలియరాక మహామర్మమైయున్న దేవునింజూపించి మాయా సముద్రమును దాఁటించినవాఁడే నిజగురుండు. దేవునిదర్శించి భవాబ్ధిం దరించినవాఁడే నిజమైన శిష్యుఁడు. మఱి యాగుర్తుదెల్పక గురుండుగాఁడు. అది తెలియక శిష్యుండుగాఁడు. కావున, నా భగవంతుని గురుముఖంబున నెఱింగి సందేహనివర్తివిగమ్ము. సంశయమున్న నదియే పునర్జన్మహేతువనిన మనంబు నిజగురునింగాంచి నమస్కరించి, యతి వినయంబున నిట్లనియె. 21

**13.** కీర్తన. కమాసురాగము - అటతాళము.

పరఁగ దైవము బ్రహ్మయో - యల - పాకశాసనుఁడో యిలన్ - పరమశివుఁడో విష్ణువో - యది - బాగుగా నెఱిఁగింపుమా - గురువరా - గురువరా॥ హరిగణేశులుగారు - అజుఁడా - యమరనాథులుగారు పో - హరుఁడుగాఁ దేహోవగాఁ - డిఁక - అల్లగాఁడు తలంపఁగా - శిష్యుఁడా - శిష్యుఁడా॥ జనులకును బ్రత్యక్షము

గ – నీ–జగతిఁగన్పడు చుండునా – యిన సుధాకర పంచభూతము – లేనికాదా దైవమునా – గురువరా – గురువరా॥ ప్రాణులకు నాధార ముగ – నీ – పంచభూతము లాయెను – క్షోణివెలుఁగులు – సూర్య చంద్రులు – నాడనంతయు దబ్బరే – శిష్యుఁడా – శిష్యుఁడా॥ వరుస గావీరందఱును – దై–వములుగాకే యున్నను – గురుతరంబుగఁ బ్రజ లువారలఁ – గొల్వనేమిక హేతువో – గురువరా – గురువరా॥ ప్రజలు అజ్ఞానాంధమున – సం–బద్ధులమరఁగ నగుటను – నిజము తెలియక యట్టిదబ్బర – నియతులంబడుటాయెను – శిష్యుఁడా – శిష్యుఁడా॥ వారలందఱబద్ధమైనను – వేఱెదైవం బెవ్వఁడో – కూరిమితో నది వినఁగనాకును – గోరికయ్యెను జెప్పుమా – గురువరా – గురువరా॥ పట్టుగా నజుఁ డాదిజగములు – పుట్టుటకు మున్నుండిన – బట్టబయలే బ్రహ్మమంతకుఁ – బరములేదిఁక నెందున – శిష్యుఁడా – శిష్యుఁడా॥ ధరణిలో నా కట్టిగోప్యము – దాఁపకయ దయసేయుమా – పరఁగ శేషాచల గురూత్తమ – పరమపురుష పరాత్పరా – గురువరా – గురువరా॥ పరమపదమిదెగాంచి మాయా – భ్రమలు సర్వముఁ బాయుమా – స్థిరతరంబుగఁ బోలకం – నరసింహకవివర శిష్యుఁడా॥

వ. అనియిట్లు గురునిఁ బ్రశంసించి తగు నుత్తరంబులంబడసి యానందించు మనంబునకు బుద్ధి యిట్లనియె. 22

క. గురుఁడఖిల లోకపావనుఁ,
డరయఁగ నతఁ డెందుమెలఁగు • నాయాస్థలముల్,
పరమ పవిత్రములగు నరు,
లరువునఁ గన నతనిఁబుణ్యు • లగుదురు మనసా. ౩౮

క. గురుదర్శనమే పుణ్యము,
గురుపాద జలంబె కర్మ • కోట్లహరించుఁ,
గురుమంత్ర జపమె సద్గతి,
గురుసేవయె జన్మసిద్ధిఁ • గూర్చును మనసా. ౩౯

వ. ఓమనసా, గురుస్వరూపమునకు దారుపాషాణ లోహాది ప్రతిమలును, గురుపాదతీర్థమునకుఁ గాశ్యాది సమస్తతీర్థంబులును, గురుప్రసాదంబున కఖిల దివ్యప్రసాదంబులును, గురునిలయంబునకు సకల మహాపుణ్యస్థలంబులును, గురుమంత్రంబునకు నిఖిల మంత్రం

ములును, గురుసేవక బహుళసేవలును సమంబులుగావు. కావున గురునకు స్థానాంగ భావాత్మ శుశ్రూషలాచరింపుచుఁ గర్మకార్యములవలనఁ గలుగు ఫలంబులు చక్కఁగా నెఱుంగు, మనిన మనంబు గురుస్వామి కిట్లనియె. 23

14. కీర్తన. ఖరహరప్రియరాగము – ఆదితాళము.
తంగంపాట మెట్టు.

ఘనదానవ్రతతీర్థ – క్రతు ధర్మములచేతఁ – గలుగు ఫలమును బట్టుగా – గురువరా – వినిపింపుఁడిది గట్టిగా॥ ఘన॥ ౧॥ ప్రాపింపనది పుణ్య – ఫలమౌనుస్వర్గాది – పదవులనొందించును – శిష్యుఁడా – యాపిదప భవమిచ్చును॥ ఘన॥ ౨॥ ఏపారహింసాది–పాపంబు లొనరించు – నాపాపిగతిమెట్టిదో – గురువరా – యాపగిదివివరింపుమా॥ ఘన॥ ౩॥ దురితాత్ముఁడైనట్టి – నరుఁడంత్యకాలాన – నరకానశ్రమలొందును – శిష్యుఁడా – తిరిగి యిలజన్మించును॥ ఘన॥ ౪॥ స్థిరమేదొ సెలవిమ్ము – శేషాచలార్య–యా – నరకస్వర్గముగానిది – గురువరా–మరల జన్మము లేనిది॥ ఘన॥ ౫॥ కరమొప్పననునీవు – గనుటెనరసింహాఖ్య – స్థిరమైన పదమెంచుమా–శిష్యుఁడా – మఱిమోక్షమదెగాంచుమా॥ ఘన॥ ౬॥

వ. అనియిట్లు గురునిచేఁ గర్మఫలంబు లెఱింగి నిశ్చయించు మనంబునకు బుద్ధి యిట్లనియె. 24

క. గురుఁడే బ్రహ్మయు విష్ణువు,
గురుఁడే శశిరవులు శివుఁడు ♦ గోత్రారిసురల్,
గురుఁడే సర్వాకారుఁడు,
గురుఁడే ప్రభుఁడంచునమ్మి ♦ కొల్వుము మనసా. 3౬

వ. ఓ మనసా, తనకు జ్ఞానోపదేశమొసంగిన గురుఁడు చుట్టమైనను, హితుండైనను, దమ్ముఁడైనను, దనయుఁడైనను, జండాలుఁడైనను, నతఁడే జగత్ప్రభుండని భక్తుండు సేవింపవలయు. అట్లుగాక గురునియెడ నలక్ష్యంబుసేసిన యతండు మోక్షంబునకు దూరస్థుం డగు. కావున, గురుఁడుండు నాశ్రమంబునకు శకటగజాశ్వంబు లెక్కిపోక, యందుఁ బర్యంకంబున వసింపక, యితరములగు వేడుక లెవ్వియుఁజేయక, స్వేచ్ఛగా విహరింపక, యాజ్ఞారూపములగు మాటలాడక, వ్రతాదినియమంబులఁ బూనక, మద్యపాన హింసాది

దుష్క్రియలొనర్పక, హాసనిష్ఠీవనాదులు వెలిపుచ్చక, యెన్నఁడున
గురున కప్రియముగా నటింపక, మనసుతా మెలఁగుచు, గురునాజ్ఞ
శిరసావహించి కార్యంబు లాచరించునట్టి వానికి మోక్షంబు కరతల
ఫలకంబగు, ననిన మనంబట్లే నిశ్చయించి గురుస్వామి కిట్లనియె. ౨౫

**15.** కీర్తన. హిందూస్థాని కాఫీరాగము - అటతాళము.

అరయ సంసారంబనంగను - నరియదేదో గురువరా - తిర
ముగా సంసారమనిన - దేహమేర శిష్యుఁడా॥ అ॥ ౧॥ హింస యీసం
సార జలనిధి - నెట్లో దాఁటుట గురువరా - హంసననిశము విడక జీవుం
డంటి మెలఁగిన శిష్యుఁడా॥ అ॥ ౨॥ జీవుఁడనఁగా నెవ్వఁడరయఁగ -
దేవుఁడెవ్వఁడు గురువరా - జీవుఁడే సుజ్ఞానమందిన - దేవుఁడగురా
శిష్యుఁడా॥ అ॥ ౩॥ జీవ పరమాత్మలకు భేదము - చెప్పుటేమో గురువ
రా-భావమెఱిఁగిన బింబప్రతిబిం-బములగతియగు శిష్యుఁడా॥ అ॥ ౪॥
దేవుఁడే స్థలమందు నుండునో - తేటపఱచుము గురువరా - దేవుఁ
డెల్ల శరీరములలోఁ దేజరిల్లును శిష్యుఁడా॥ అ॥ ౫॥ ఒక్కదైవం బెల్ల
తనువుల - నుండుటెట్లో గురువరా - పెక్కుజలభాండముల రవిగని-
పించునట్లే శిష్యుఁడా॥ అ॥ ౬॥ సరవిసద్గతియేదొ శేషా - చలసదాచల
గురువరా-స్థిరముగను తే ముక్తియగు నర-సింహదాస సుధీవరా॥అ॥ ౭॥

వ. అనియిట్లు జీవదైవమర్మంబులు గురుని వలనం దెలియం
బడి హర్షించుమనంబునకు బుద్ధి యిట్లనియె. 26

క. గురుఁడరయ నిర్గుణుండగు,
సరసుల రక్షింపజగతి ♦ సగుణుండగుఁ బో
గురుఁడన్నిఁటికి స్వతంత్రుఁడు,
పరికింపనతని మహిమలు ♦ వశమే మనసా. ౩౭

వ. ఓ మనసా, గురుఁడు సమస్తపుణ్యములకు స్థానమైనవాఁ
డు. అఖిలదురితంబుల హరించువాఁడు. భక్తుల యభీష్టము లిచ్చు
వాఁడు. దాసుల హృదయంబులఁ జిక్కువాఁడు. దుష్టస్వభావుల కం
దనివాఁడు. తన్నుఁ గొల్చువారిం బ్రేమించువాఁడు. వివిధ దుఃఖంబు
లఁ దొలఁగించువాఁడు. స్థిరమగు పరసుఖానంద మొసంగువాఁడు
దరిలేనిభవాబ్ధిం దరింపఁ జేయువాఁడు. సమస్తము నిండినవాఁడు. స్వ
తంత్రశక్తిగలవాఁడు. కావున గురునకు వంచనలేక తనుమనోధనంబు

లర్పించి, స్వతంత్రంబు మాని పరమార్థంబు గ్రహింపు, మనిన ముసం బత్యాదరంబున గురున కిట్లనియె. 72

16. కీర్తన. కాంభోజిరాగము – అటతాళము.

బ్రహ్మవిద్యన దాని – భావమదెట్టిదో – దేశికేంద్రా – అల్ల – బ్రహ్మంబుఁగాంచిన దే–బ్రహ్మవిద్యయగును – భక్తవర్యా॥ బ్రహ్మ॥ ౧॥ బ్రహ్మంబు సేవింప – ఫలమేమి గలదయ్య – దేశికేంద్రా – ఆత్మ – బ్రహ్మంబుఁ గన జన్మబంధంబులెడఁబాయు భక్తవర్యా॥ బ్రహ్మ॥ ౨॥ జన్మవాయకున్న – సంకటమేమయ్య – దేశికేంద్రా – చాలా – జన్మ మెత్తుటెగొప్ప – సంకట మగునయ్య – భక్తవర్యా॥ బ్రహ్మ॥ 3॥ జన్మ వాసిబొందు – సౌఖ్యమదేమయ్య – దేశికేంద్రా – మేటి – చిన్మయా త్మని పదముఁ – జెందుటెసౌఖ్యము – భక్తవర్యా॥ బ్రహ్మ॥ ౪॥ చిన్మయాత్మఁ గలసి – జీవుఁడేమగు నయ్యా – దేశికేంద్రా – తిరిగి – జన్మంబునకు రాని – సరణియదియేగద – భక్తవర్యా॥ బ్రహ్మ॥ ౫॥ అరయ బంధమెద్ది – యగునో శ్రీశేషాచల – దేశికేంద్రా–ధాత్రిఁ– బరికింప జన్మమె – బంధంబు నరసింహ – దాసవర్యా॥ బ్రహ్మ॥ ౬॥

వ. అనియిట్లు గురునిచే జ్ఞానసూత్రంబులు విని పరమానం దంబుఁ జెంది మనంబునకు బుద్ధి యిట్లనియె. 28

క. పరహితముఁ దెల్పుగురుఁడే,
గురుఁడని తలిదండ్రి తాత ♦ కులదైవంబున్,
దొరయును జుట్టము సఖుఁడును,
మఱియతఁడే నంచునమ్ము ♦ మఖిలము మనసా. 3౭

క. గురుఁడెచ్చోటికి నేగిన,
మఱలను జనుదెంచు దాఁక ♦ మఱియాదిక్కే,
గుఱిఁజేసి మ్రొక్కుచుండుము,
మఱవకు మతఁడిచ్చుముక్తి ♦ మానక మనసా. 3౮

వ. ఓ మనసా, తనకు ముక్తిఁజూపు గురుండు వచ్చుచుండఁ గాఁ గూర్చుండి లేవకుండుటయు, నమస్కరింప కుండుటయు, గురున కంటె ముందు భుజించుటయు, నిద్రించుటయు, గురుశయ్యాయందుఁ బరుండుటయుఁ, బాదుకాసనములఁ ద్రొక్కుటయు, గురుని కనుగ్ర హంబు గలుగునెడ వెనుక దీయుటయు, ననుగ్రహింపకున్న వేగిరిం

చుటయు, బోధించుతఱి లేచిపోవుటయు, బోధింపకున్న నొక్కి-యడుగుటయు మొదలైన పనులు శిష్యున కర్హంబుగాదు. కావున గురుని నరుండని తలంపక, యిష్టదైవముగా భావించి సేవింపుచు, షోడశోపచారంబులఁ బూజించి నమస్కరింపుచు, వినయ వివేకంబులఁ బ్రవర్తింపుచు, నత్యంతశ్రద్ధతో నీకుంగల సందేహంబు లడిగి తెలిసికొమ్మనిన మనం బపారంబగు భక్తితో గురునకిట్లనియె. 29

**17.** కీర్తన. నాదనామక్రియరాగము – ఏకతాళము.

వివరింపు శేషాచలార్యా – నాదు – విన్నపంబును – సాధువర్యా॥ వి॥ భువిలోన దహనేందు – రవివెల్గులను మించి – ప్రవిమలంబై వెల్గు – పరిపూర్ణ కళయేదొ॥ వివ॥ తెలియుమిది నరసింహదాసా – నీకుఁ – దెల్పెదను నిర్మలాభ్యాసా – వెలుఁగు లన్నింటికిని – వెలుఁగునై పరమాత్మ – వెలిఁగించు దేహాది – విశ్వరూపములెల్ల ॥ తెలియు॥ ౧॥ తలఁప శోణిత మాంస – తనువులను బరమాత్మ – మెలఁగుచుండియు మాయఁ – గలియకేగతినుండు॥ వివ॥ అనిలంబమేధ్యమున – నంటియంటనిభాతిఁ – దనువులంటియునున్నఁ – దగులదాత్మకునేది॥ తెలియు॥ ౨॥ తనువుండిజ్ఞాని యిల – జనులయట్లేవినుచుఁ-గనుచుఁ జేయుచునున్నఁ – గర్మిగా కెట్లొప్పు॥ వివ॥ హంసతోఁగూడి దే – హంబుగాకయె పరమ – హంసమైనను మేని – హింస లేక్రియనంటు॥ తెలియు॥ ౩॥ అనువొంద మనముండి – యమనస్కమోగాక – మనములే కమనస్క – మగునొభావింప॥ వివ॥ మనము లేకయుఁగాదు – మనమాత్మనేమఱక – ననయమఖిలము సల్పునతఁడె యమనస్కుఁడు॥ తెలియు॥ ౪॥

వ. అని యిట్లు పరమ తత్త్వరహస్యంబు లాకర్ణించి వినోదించు మనంబునకు బుద్ధి యిట్లనియె. 30

క. గురుఁడే పరదైవంబని,
గుఱినిల్పియు నెల్లయెడలఁ ♦ గుటిలము లేకా,
గురుమూర్తిని సేవించినఁ,
బరమబ్బును ఖలునకైనఁ ♦ బట్టుగ మనసా. ౪౦

క. ధరశ్రీ కృష్ణోద్ధవ నృగు,
వరభీష్మా ద్యంబరీష ♦ బలిజన కాదుల్,

గురు సంసేవన మునఁగద,
సురముని వరులెల్లఁ గనిరి ♦ సుగతిని మనసా. ౪౧

వ. ఓ మనసా, భ్రమరకీటక న్యాయంబున, నరుండు గురు స్మరణంబునం జేసి గురుస్వరూపుం డగుటచే, గురుమహిమ యిట్టి దని వర్ణింప హరిహర పురందర విధాతలకైన శక్యంబుగాదు. గురుం డఖిల శాపంబులఁ బాపి మోక్ష మొసంగఁజాలు. గురు శాపం బెల్లలోకంబుల వారికిం దీర్పరాదు. మఱియు సమస్త దేశాధిపత్యము వహించిన చక్రవర్తియైనను దన్నుఁ దెలిపిన గురుని యెడ భృత్యుని పగిది నటించుచుఁ, బ్రభో, దేవ, స్వామి యని విన యంబునం బలుకవలయు. అందఱివలె గురునిఁ బేరిడి పిలువందగదు. కాన, గురు సాన్నిధ్యంబున గర్వంబు నొందక, విరసంబుఁ బూనక యప్రియంబులు వలుకక, మృష లాడక, యెదిరించి వాదింపక నిష్కాపట్యంబున నిలిచి జన్మనాశంబుల విధంబుఁ దెలియు మనిన మనంబు సద్గురున కిట్లనియె 31

18. కీర్తన. ముఖారిరాగము - అటతాళము.

జన్మమెందుకుఁ గల్గెనో మరణంబేల - సంభవించునో గురు వరా - జన్మకర్మచేఁ గర్మ దీఱఁజావగుమళ్లి - జన్మకై శిష్యవరా॥ జన్మ॥ ౧॥ చచ్చినవారలకు నెన్నఁగమఱల - జన్మలున్నవె గురువరా - చచ్చినవారెగా జన్మంబులొందుట - జగతిలో శిష్యవరా॥ జన్మ॥ ౨॥ చావనివారెవ్వరో లోకమందుఁ - జావకుందురె - గురువరా - కేవ లాత్మజ్ఞులౌ నశరీరులకులేదు - చావెపుడు శిష్యవరా॥ జన్మ॥ 3॥ కేవ లాత్మజ్ఞులైన మేనులువిడుట - చావుగాదే గురువరా - చావుగల్గిన దనుట నశరీరులకు లేసి - స్వప్నంబు శిష్యవరా॥ జన్మ॥ ౪॥ స్వశరీరు లకు మాత్రము - చచ్చుటలెల్ల - స్వప్నమేగద గురువరా - స్వశరీ రులెఱుక నెఱు స్వప్నంబువాయకె - చనియెదరు శిష్యవరా॥ జన్మ॥ ౫॥ కలను విడువక గిట్టినవారికి బంధ - కరమేమున్నది గురువరా - కల వాయకున్న నాకలలోనె జన్మములు-గాంచెదరు శిష్యవరా॥జన్మ॥ ౬॥ కలఁబాసి చనువారికి జన్మములిలలోఁ - గలుగకున్నే గురువరా - కలను బాసినమీఁద జన్మమేదియింకఁ-గలయేది శిష్యవరా॥ జన్మ॥ ౭॥ కలఁబాయుటేరీతినో - దెల్పుము శేషా - చలదేశికేంద్రవరా - చెలఁగి

యచలము గన్న-కల శూన్యమగు నార-సింహాఖ్యశిష్యవరా॥జన్మ॥ ౮॥

వ. అని యిట్లు గురునిచే భవనాశహేతువు లెఱింగి, జన్మభీతిచే గురువాక్యావలోకనం బొనర్చు మనంబునకు బుద్ధి యిట్లనియె. 32

క. హరికిని హరునకు నజునకు,
గురుఁడెవ్వఁడు లోకములకుఁ ♦ గులములకెల్లన్,
గురుఁడెవఁడు గురులకెల్లను,
గురుఁడై భాసిల్లువాఁడు ♦ గురుఁడే మనసా. ౮౨

క. గురుఁడుండు నాశ్రమంబే,
వరకాశీగయ ప్రయాగ ♦ భద్రాచలమం,
చరయుచు సమస్తవేల్పులు,
గురుఁడే యనియెల్లప్రొద్దుఁ ♦ గొల్వుము మనసా. ౮౩

వ. ఓ మనసా, సద్గురుని వలన జ్ఞానోపదిష్టుండై, జ్ఞానతత్త్వముఁ బట్టఁజాలక, గురుని యందలక్ష్యము చేసి, గురునిఁగాని, గురుమంత్రంబునుగాని, మఱచి, గురునింద చెవులతో విన్నను, దాను జేసినను, గురునకుఁ గనుపించక దొంగత్రోవల మెలంగినను, గురునితో విరోధించినను, నట్టి విరుద్ధంబున వేఱొకగురు నాశ్రయించినను, గురునాజ్ఞలేనిదే తానుగురువై శిష్యులఁగూర్చిబోధించినను నట్టిగురుద్రోహి నంతకుపీట యమకింకరులు భయంకరంబగు కఱకుగొడ్డండ్ల నఱకక మానరు. ఆపాపి తరణిచంద్రాదులుండు వఱకు శమన పురంబున నివసించు. వాని మొగంబుఁ జూచినవారు రౌరవాది నరకంబులకుఁ బాత్రులగుదురు. కావున, సద్గురునియందు భయభక్తిశ్రద్ధలు గలిగి యెల్లపుడు గురునాజ్ఞమీఱక నటించుచు గురుమహిమాతిశయం బెఱుంగవలయు. అట్టివాఁడే భక్తుఁ డనంబడుఁ, గావున. 33

## 19. కీర్తన. బేగడరాగము – అటతాళము.

గురుని మహిమను – దెలియవలెనన్నా – పరమాత్మభావము– మఱుఁగుగని మదినుంచవలెనన్నా – దుర్గుణములెల్లఁ – దొఱఁగిసద్గుణమందవలెనన్నా – చంచలములడఁచి – స్థిరముగా మదినిల్పవలెనన్నా– ధరణిజన్మము లెత్తుటెన్నో – నిరుకుదెలియగ రానివాయెను – నరక స్వర్గము లాదిగర్భ – నరకములఁ బడకుండఁజేయు॥ గురుని॥ ౧॥ పంచభూతము లెంచవలెనన్నా – జ్ఞానేంద్రియాదుల – నెంచివిషయ

ము తెలియఁగవలెనన్నా - నధిదైవతములఁ ద - లంచిచక్రము లరయ వలెనన్నా - భావించిచూడఁ బ్ర-పంచమంతయు మాయవినుమన్నా- పంచవింశతి తత్త్వములచేఁ - బ్రబలుచున్నదె కాయమిదియు స - ముంచితంబుగ దీని వేరును-ద్రుంచిమాయ జయించునట్టి॥ గురుని॥ ౨॥ చదువులన్నిమాన వలెనన్నా - జన్మంబుఁబాపు - చదువు నొక్కటె చదువవలెనన్నా - వేషంబులెల్ల - నుదరపోషణ కొఱకుఁగనుమ న్నా - సద్గురునిసేవ వదలకెప్పుడు సల్పవలెనన్నా - సదయుఁడౌ శేషాచలార్యుల - పదములెప్పుడు - హృదయమందునఁ - జెదరకుం డఁగ నిల్పితగ నర - సింహదాసు భజించుసదమల॥ గురుని॥ 3॥

క. గురుబోధఁ బొందుటకు నిల,
సరసులకేగాక దుష్ట ♦ జనముల కగునే,
పరిమళగంధము తావిని,
ఖరశుని సూకరము తెలియఁగ గలవే మనసా.    ౪౪

వ. ఓ మనసా, మధుపం బెందుండియోవచ్చి తామరలోని తేనియం గ్రోలినట్లు, సద్గురుఁడే దేశమందున్నను వెదకిపట్టి సుజనుండా గురురహస్యంబు గ్రహించు. మండూకమాతమ్మిపైఁ గూర్చుండియు నందలి మధువెఱుఁగని చాడ్పున, సద్గురుఁడు తమచెంతనుండినను దుర్జనులు గురుమహిమఁదెలియఁజాల రనిపల్కి మఱియు నిట్లనియె.

## 20. కీర్తన. శహనారాగము - ఆదితాళము.

గురునిఁ గానలేనివాఁడె - శుద్ధజనుఁడు మఢ్డివాఁడె - పరము గన్నయతఁడె చూడభవ్యచిత్త బ్రహ్మవేత్త॥ గు॥ ౧॥ మనసుకుదురు లేనివాఁడె - శునక మెన్న చెనఁటిదున్న - మనసునిల్పనేని దైవ-మతఁ డెజగతిలోన సుగతి॥ గు॥ ౨॥ నీతిలేక తిరుగువాఁడె - కోఁతిచూడలాతి వాఁడె - జ్యోతినిఁగనుఁగొన్నవాఁడె - సూరిజనుఁడు భూరిఘనుఁడు॥ గు॥3॥ మంచిదెలియ లేనివాఁడె-మాయగాఁడు దుండగీఁడు - మించినిజ ముగాంచు నతఁడె- మేటియైనసూటిజ్ఞాని॥ గు॥ ౪॥ కూరిమి శేషాచలా ర్యుఁ - గొల్వలేనియతఁడెకుమతి - నారసింహదాసుమాట - నమ్మి తెలియువాఁడె సుమతి॥ గు॥ ౫॥

క. తెల్లంబుగ గురుభావము,
నుల్లంబునఁగన్నముక్తి ♦ నొందుదు రిలపైఁ,

గల్లనిజంబు లెఱుంగని,
కల్లరులకు మోక్షమేల ♦ గల్గును మనసా. ౪౫

వ. ఓ మనసా, లోకమున మానవులు ధనధాన్య భూము లార్జించుటకును, రమణీయదేహంబు లమర్చుటకును, గాంతలతో భోగించుటకును, బిడ్డల లాలించుటకును, బొరుగిండ్లు దిరుగుటకును, బగులదూషించుటకును, బుట్టుముచ్చటలఁ బ్రొద్దుపుచ్చుటకును, లేనిపోనికలహంబు లాడుటకును, నల్పుల సేవించుటకును, సమర్థులగుదురు, గాని సద్భావంబున గురునింజేరి, జ్ఞానంబు వహింప నెన్నఁటికి సమర్థులుగా నేరరు. వినుము, 35

**21.** తోహరా.

అన్నిపనులు సేయుటకును దీఱును-నవనిలోన మనుజులకు-
నెన్నఁడుఁ దీఱదు జడులకు జ్ఞానం - బెఱిఁగి సుగతిఁ గాంచుటకు॥ ౧॥
తీఱకె పుట్టుట తీఱకె గిట్టుట-తీఱకె శ్రమ లన్నియును-
తీఱినపిమ్మటఁ - బుట్టుగిట్టులను - త్రిప్పలు లే వెవ్వియును॥ ౨॥
చచ్చినవారలె పుణ్యులఁటందురు - జగతిని గొందఱ దెన్నఁ-
జచ్చియుఁ జావక ఫలమే మున్నది - సద్గతిగన లేకున్న॥ 3॥
ఎవరిలోక మిఁక వారిదె యందఱు - నేకలోకమం దున్నఁ-
దవిలియందఱొక లోకమొందియును-దథ్యమెఱుంగుట సున్న॥ ౪॥
కుజనులు గోరరు శేషాచలస-ద్గురు కటాక్షమును వేగ-
సుజనులె నరసింహాఖ్యుని వాక్యము-సూక్తిఁ దెలియుదురు బాగ॥ ౫॥

క. మఱిభుక్తి నిద్రభయరతు,
లరయఁగఁ బశునరుల కొకటె ♦ యగుటను మోక్షం,
బెఱిఁగిన నరుఁడే నరుఁడది,
యెఱుంగని నరుఁడు నరవరుఁ ♦ డెట్లగు మనసా. ౪౬

వ. ఓ మనసా, విశ్వంబున నెనుబదినాల్గు లక్షల జీవరాసులలో మానవజన్మంబు శ్రేష్ఠంబు. అందుఁ బురుషుండై పుట్టుట యుత్తమంబు. అందుఁ బరమపురుషార్థ పరుండగుట మిగుల యోగ్యంబు. పశుపక్ష్యాది సమస్తజంతువులకు ధర్మార్థకామంబు లాచరింపఁదగుఁ గాని, వానియందు మానవునివలెఁ దెలివి లేమిం జేసి, యవి నాలవధర్మంబైన మోక్షం బవలంబింపఁ జాలవు. మనుజుండు

ఘనస్వార్థకామంబు లొనర్చుచు, గురుని వలనఁ దన్నుఁదా నెఱింగి సుగతిం జెంద సమర్థుఁడగు. అట్లగుటం జేసి నరుండు ముక్తిం గానకున్న సర్వజీవులకంటె నధముండనంబడు. కావున, 36

**22.** కీర్తన. నాదనామక్రియరాగము - ఆదితాళము.

నరుఁడై నందుకుఁ బరమాత్మునిమది - నంటిన నరుఁడని యెంచవలెరా - బరమార్థము గనలేని జడునినర - పశువని మదిభావింపవలెరా॥ నరు॥ ౧॥ మాటిమాటి నాటెంటిదాఁటి ము - మ్మూలకోనలోఁ జేరవలెరా - నూటియెఱిఁగి యానాటకధారుని - ధాటిగమది సేవింప వలెరా॥ నరు॥ ౨॥ బూటకమగు పెక్కు మాయజాలమునఁ - బోఁటలు గడపకయుండవలెరా - మాటిమాటికిని సోహంబనియెడి - మర్మమెఱిఁగి భజియింప వలెరా॥ నరు॥ 3॥ జాతినీతి మతశాస్త్రములాదిగ - సర్వము మాయగఁ జూడవలెరా - కోఁతిగుణంబులు మానియపరం - జ్యోతి రూపమున నిల్వవలెరా॥ నరు॥ ౪॥ చాలుఁజాలు నిఁక భవనాశంబుల - సంకటముల నడఁగింప వలెరా - కాలునివలలోఁ జిక్కకతనలో - గాలిమనంబులఁ గలఁప వలెరా॥ నరు॥ ౫॥ పోకల శేషాచల సద్గురుకృపఁ - బొందినటించుచు నుండవలెరా - జోకతో నరసింహాఖ్యుని వాక్యము - నూటిగఁ బరిశీలింప వలెరా॥ నరు॥ ౬॥

క. విచ్చిచనుమాయ జాలముఁ,
జొచ్చియు విడలేక యదియె ♦ సురపదవిగఁ బో,
నిచ్చఁదలంచి హతాత్ముగఁ,
జచ్చియు జన్మములఁ బడుట ♦ సౌఖ్యమె మనసా. ౪౭

వ. ఓ మనసా, మనుజుండు జన్మమెత్తినది మొదలు పరమార్థచింతలేక, దారాసుతధనంబు లనెడు నాశాపాశంబులం గట్టువడి, పిసిని కాయలోని పురువుచందంబున వెడలు మార్గంబులేక, స్వస్వానుభవ కర్మగతుండై పలుమాఱు నరకస్వర్గంబులం బడుచు, నానావిధ యోనులంబుట్టుచు, గిట్టుచు, బహుగర్భనరకంబు లనుభవింపుచుఁ దనజీవితంబున మితిలేని మోహంబునం దగిలి, కుటుంబపోషణకై పగటికాలమున ధనధాన్యంబులార్జించుచు, నంగనాసంగమ స్వప్నసుషుప్తుల రాత్రికాలంబుఁ బుచ్చుచుఁ దానొక యుగంబు బ్రతుకువానివలెఁ బుత్రమిత్రకళత్రాదులం బ్రేమింపుచుఁ దానంత

లో మట్టుమాయముగాఁ జచ్చు. ఆహా! ముందు తానెందుండి వచ్చెనో మగుడి యెటకేగెనో, తనవారేమైరో తానేమయ్యెనో, యీ మాయం దెలియనేరకగదా ప్రపంచజనంబులు భవాబ్ధిం దరింపలేకుందురని చెప్పి, మఱియు నిట్లనియె. 37

**23.** కీర్తన. యదుకుల కాంభోజిరాగము – అటతాళము.

స్థిరమైన పరమార్థ – చింతయే భవరోగ – హరమని తెలియవే ఓ మనసా – పరికింపఁగా నితర – భ్రాంతులన్నియు జన్మ – బంధంబునకు హేతువే మనసా॥ స్థిర॥ ౧॥ తల్లిదండ్రిభార్య తనయులందున భ్రాంతిఁ – దగిలితపింపకే ఓ మనసా – వెళ్లిపోవునాఁడు ఎవరికెవ్వారుగలరు – వెంటనెవ్వరురారు ఓ మనసా॥ స్థిర॥ ౨॥ తానుజేసిన కర్మే తనకుఁదోడౌమళ్లీ – తనువుగల్గించునే ఓ మనసా – దానిఁబాయనెవరి తరము జ్ఞానముచేతఁ – దప్పించుకోజన్మమో మనసా॥స్థిర॥3॥ అరుదార శేషాచ – లార్యుని సద్గుణ – మఱవకెప్పుడుఁ దలఁచవే మనసా – ధరయందు నరసింహదాసు వాక్యమునమ్మి – తరియించుగతి గానవే మనసా॥ స్థిర॥ ౪॥

క. వరజపతప వ్రతక్రతువుల,
వరదానాధ్యయనశీల ♦ బహుతీర్థములన్,
దొరకదు మోక్షంబెంతయుఁ,
బరమాత్మునిఁగానలేని ♦ ప్రజలకు మనసా. ౪౮

క. ప్రజ్ఞానము బ్రహ్మంబను,
సుజ్ఞానము గనుటకంటె ♦ క్షోణీస్థలిలో,
విజ్ఞానమొకటి గల్గునె,
యజ్ఞానఁపుఁబనులుగాక ♦ యన్నియు మనసా. ౪౯

వ. ఓ మనసా, వాయసాదులు నదీతటాకంబుల నిర్మలజలంబులఁగ్రోలక యిండ్లకడఁ గుండలయందు ముఱిఁగిన నీళ్లనుబానంబు సేయుపోల్కిఁ బ్రపంచజనంబులు నిజగురుంజేరి మోక్షగతింగాంచుట మాని, గ్రుడ్డివాఁ డంధుని నూఁతగొనినచందంబున, నీచులగు కర్మగురుల సేవించి కర్మతంత్రులై జన్మంబులొడిఁగట్టుకొందురు. కన్నులున్నవాఁడంధునకు మార్గంబుఁజూపుకైవడి జ్ఞానగురుం డజ్ఞానాంధు

లను సుజ్ఞానంబను త్రోవఁజూపి ముక్తులంజేయుఁగాక, యంధుఁ డంధునకుఁ దెరువుచూపలేనట్లు కర్మగురుం డజ్ఞానాంధుల కర్మ జన్మంబులంబాపి సుగతింజెందింపనేరఁడు. కావున, సర్వమతశాస్త్ర సరణంబులన్నియు నిజగురునిఁగానని మార్గంబులే. వినుము. 38

**24.** కీర్తన. యదుకుల కాంభోజిరాగము – అటతాళము.

స్థిరమైనజన్మసం – సిద్ధిఁబొందఁగవశమె – పరముగానక యేరి కిఁ – దఱుచైన యిలమాయఁ – దగిలివేమఱు జనన – మరణాబ్ధిలో మునిఁగి – మగ్నంబగుటేగాక॥ స్థిర॥ ౧॥ దండివనములు గుడిగో – పుర తటాకములన్న – దానసత్రము లుంచిన–మెండుగ నిల నశ్వమేధ రాజ సూయ – పౌండరీకసోమ – బహుయజ్ఞముల నైన॥ స్థిర॥ ౨॥ ఎఱుక నూలి నూట – యెనిమిది తిరుపతు – లెలమితో సేవించిన – ధరఁ గల్గు సర్వతీ – ర్థములందుఁగ్రుంకిన – మతి – దానవ్రతహోమ – సరణులొనరించిన॥ స్థిర॥ 3॥ హరిరుద్రాదులఁ బ్రీతి – నర్చించివారిచే వరములెల్లను గాంచిన – అరుదార శేషాచ – లార్య సత్కృపఁ గన్న – నరసింహాఖ్యుని హితసు – స్థిరవాక్యంబును వినక॥ స్థిర॥ ౪॥

క. అధికం బేదో తెలియక,
యధికుఁడ నే నన్నవాఁడె – యధముండగుఁ బో,
యధికుల కధికుఁడు జగముల,
కధికుఁడు భగవంతుఁడొకఁడె – గాంచఁగ మనసా. ౨౦

వ. ఓ మనసా, చతుస్సముద్ర ముద్రితమైన భూవలయం బంతయు నేకఛత్రమునఁ బాలించుచు గయుఁడాది షోడశమహారా జులకును, హరిశ్చంద్రుఁడాది షట్చక్రవర్తులకును మించినవాఁడై, యన్యరాజులచేఁ గప్పంబులుగొనుచు, వారిచే సదా సేవింపఁబడి నను నధికుండుగానేరఁడు. పదునాల్గు లోకంబులకును నాయా లోకాధిపతులకును, సమస్త జంతుజాలంబులకును, బ్రహ్మండగు పరాత్పరు సేవించి, నిఖిలమాయల జయించినవాఁ డఖిలమున కధి కుం డనంబడు. కావున. 33

**25.** తో హ రా.

కల్లమనస – యీ మూలముదెలియని – కడగండ్లను బడనేల – యుల్లముల్లోఘన మేదో యెంచుమిఁక – మత్తమగతియదె చాల॥ ౧॥

కష్టసుఖంబుల నష్టలాభములఁ - గాంచుమయొక్కటి గాను -
స్పష్టంబుగమది శుద్ధిమైనఁబర - సౌఖ్యము కదియిరవౌను॥ ౨॥
నిందాస్తుతులను జూడుముసమముగ - నేకాలంబున నీవు-
పొందకు నేనను భావంబిలలో - బుధవర్తన లవిగావు॥ 3॥
దుష్టజనంబుల సంగతిఁగూడిన - తోడ సుగుణములు దొలఁగు-
శిష్టులచెంతను జేరినటించిన-శ్రేష్ఠత్వంబును గలుగు॥ ౪॥
అరయఁగ శేషా చలసద్గురుదయ - కధికం బెద్దియు లేదు-
ధరలోపలనర సింహదాసుహిత - మరయకుంట సరిగాదు॥ ౫॥

క. మాటలె మంత్రంబులుకలి,
నాటకమునఁ జెల్లెక్రియలు ♦ నరుఁడేగురుఁడౌర్.
బాటించి చూడ మానవ,
కోటింజెలువొందునన్ని ♦ గుణములుమనసా. ౫౧

వ. ఓ మనసా, నరులందు ముత్తెఱంగులగు. ఎట్లనిన: పరసతీ పరధనాపేక్షలులేక, యహింసాపరుఁడై, తనకు లభించినదానితోఁ దృప్తినొందుచు, సూనృత భూతదయాది సత్కార్యంబు లాచరింపుచు దైవభక్తిగలిగి శాంత శమదమాది గుణములతోఁ బ్రవర్తించుటే మనుజత్వం బనంబడు. పరసతులంగవయుచుఁ దస్కర హింసానృత మద్యపానాది దుష్కర్మంబు లొనర్చుచుఁ, దైవభక్తి లేక, కోప దురహంకారములచే నటించుటే రాక్షసత్వం బనంబడు. నిర్మల చిత్తుండై గురుకటాక్షంబునఁ దన్నుఁదానెఱింగి, మనుజ దనుజత్వం బులంబాసి జీవన్ముక్తిఁ గాంచుటే దేవత్వం బనంబడు. కావున. 40

**26.** కీర్తన. శంకరాభరణ రాగము - ఆదితాళము.

దేవత్వంబును జెందెడిమహిమ దెలియుమయ్యా - మర్త్య - భావదనుజత్వంబుల వేగఁ బాయుమయ్యా॥ దే॥౧॥ పరహితంబుఁ గనుఁ టే దేవభావమయ్యా- భక్త - వరుల కెల్ల దేన యశముఁవచ్చెనయ్యా॥ దే॥ ౨॥మునులు దేనివలన ఖ్యాతిఁబొందిరయ్యా-యింక -ఘనులు దేన నైరిసురలు గాంచుమయ్యా॥ దే॥ 3॥ ధరణి శేషాచల సద్గురునిఁ దలఁపుమయ్యా-వేగ-నరసింహదాసుని భావమరయుమయ్యా॥ దే॥ ౪॥

క. ఏవిధ భావము లేటికి,
దేవుని దర్శింపకున్న ♦ దివిజులకైనన్,

జీవన్ముక్తియుఁ గలుగదు,
గావుననాదైవమలరఁ ♦ గాంచుముమనసా. ౹౹౨

వ. ఓ మనసా, లోకంబున దేవుఁడనుమాట సమస్తజనంబుల కుం దెలియును. అతఁడెందుఁగలఁడో, యెటువంటి వాఁడో యదియెవ్వ రెఱుంగరు. మఱియు నతండు గల్పించిన ప్రపంచమును బ్రత్యక్షముగాఁ జూచుచుండ నతనిఁ గానకపోవుటెంత యవివేకము. భగవం తుఁడొకచోటనుండి యొకచోటలేనివాఁడుగాఁడు. సర్వమయుండు. బ్రహ్మాదులకైనఁ దమంతటఁ దామా దేవుని సేవింపరాదు, వానిగుర్తె ఱింగిన వానిచే దైవమను గుర్తుఁదెలిసి, జననమరణ ప్రవాహమును దాఁటుటే పుట్టినందునకు ఫలము, కావున. 41

## 27. కీర్తన. ఆనందభైరవి రాగము – ఏకతాళము.

దేవుఁడుండు విధముఁదెలియరా – జీవాత్మయితర – భావములను ఫలము లేదురా – దేవుఁడుండు విధమునీవు– భావమందు నెఱింగినపుడె–పావనమగు ముక్తిఁబడయ – వచ్చును–మది హెచ్చును – భ్రమ విచ్చును – సుఖమిచ్చును–అ॥ దేవు॥ ౧॥ అంతరంగ దేహగుహలను–లోవెలినిఁగలిగి–సంతతము మెలంగుచుండును–వింతపలుకు పలుకుచుండు– వినర నిఖిలజీవులందు – నంతరాత్మయగుచుఁదా–నఖండమునై – ఖండమునై –పిండము బ్రహ్మాండమునై॥ దేవు॥ ౨॥ కలఁతలన్నిపాయఁద్రోయరా–పరమాత్మమదిని – నిలిపి చెదరనీకు చూడరా – చెలువుగా శేషాచలార్య–వలననారసింహదాసు – నలరహృదయమందుఁ గన్న–యట్టిది– బహుగుట్టిది – రానట్టిది – పోనట్టిది – యా॥ దేవు॥ 3॥

క. దినకరుఁడెల్ల విషయముల,
కును నొకఁడై తోఁచు భాతి ♦ గురుఁడుపరాత్ముం,
డనఁబరఁగు దైవ మొక్కఁడె,
యనుమొంద సమస్తజగము ♦ లందున మనసా. ౹౹3

వ. ఓ మనసా, జగంబునఁగొంద ఱజుఁడు దైవమనియుఁ, గొందఱు విష్ణువనియుఁ, గొందఱు శివుఁడనియుఁ, గొందఱింద్రుఁడనియుఁ, గొందఱు పంచభూతములనియుఁ, గొందఱు నవగ్రహములనియుఁ, గొందఱు శక్తులనియుఁ, గొంద ఱెహోవ యనియుఁ, గొంద ఱల్ల

యనియుఁ, గొందఱు కాశీవిశ్వేశుఁ డనియుఁ, గొందఱు తిరుపతి వేంకటేశ్వరుఁడనియుఁ, గొందఱు జగన్నాథుఁడనియుఁ, గొందఱు భద్రాచలరాములనియుఁ, గొందఱు శ్రీరంగనాయకులనియుఁ, గొందఱెల్ల మందకో టేశ్వరుఁడనియుఁ, గొందఱు కంచివరదరాజులనియు నిట్లనేక విధంబులఁ బరిగణించుచుందురు. ఒక్కండుగాక పెక్కండ్రుదైవంబు లుందురా? నిక్కంబెఱుంగని యట్టిభ్రమికుల పల్కులు నీవెన్నఁడు నమ్మకుమని చెప్పి, మఱియు నిట్లనియె. 42

## 28. కీర్తన. శంకరాభరణరాగము – అటతాళము.

ఒకఁడేదైవమురా–యన్యంబేమి– యిఁక లేదుగనరా–ప్రకటింపఁగా నెందు – నొక టేగగనముభంగి – నకలంకముగఁదానే–సకలదేశములందు॥ నొకఁడే॥౧॥ నరసురతరులు–మృగపశుపక్షు–లిరవౌరూపములు–అరయఁగనకంబొకటే–యఖిలాభరణములైన – కరణిసర్వము తానై–కనుపించు జగమెల్ల॥నొకఁడే॥౨॥పాటింపరాదు – ఆతనితోడ–సాటియెది లేదు – ధాటిగమనుజులందుఁ – దంతువట్టుల జీవ–కోటులందుననుండి–నాటకమాడించు॥ నొకఁడే॥ ౩॥ ధరఁజెన్నపురిని – శేషాచల సద్గురుఁడై సమ్మతిని–మఱుఁగు తెఱుగులు లేక – నరసింహాఖ్యునిమదికి – సరసంబుగానెందు – సాక్షాత్కరించిన॥ నొకఁడే॥ ౪॥

క. రాముఁడు దశరథసుతుఁడని,
భూమింజనులందు రదియు ♦ బూటకమాత్మా,
రాముఁడు జన్మము రూపము,
నామములేనట్టివాఁడు ♦ నమ్ముము మనసా. ౫౪

వ. ఓ మనసా, యాత్మారాముం డఖిల భూతాంతర్యామి. అతఁడులేని శరీరములు వ్యర్థములు. అతనివలననే ప్రపంచము నడుచుచున్నది. దశరథునకు నతనిసుతుండగు రామునకును సమస్త లోకంబులకును ముందేయుండువాఁడు, నిఖిలము చెడినను నుండువాఁడు. ఆ దశరథపుత్రునివంటి రాము లీజగంబున నెందఱు పుట్టిగిట్టిరో లెక్కింపశక్యమా? ఆత్మారామునకు జననమరణంబులు లేవు. జననమరణంబులు గలవాఁడు దేవుండెట్లగు? ననినమనంబట్లే దృఢంబు నొంది, సమస్తభూతమయుండైన యాత్మారాము నిట్లని స్తుతించె. 43

**29.** కీర్తన. హిందూస్థాని కాఫిరాగము – జుల్వాతాళము.

రామనీవుదశరథమహా – రాజసుతుఁడవే – భూమి భువనములకు పతి – పురుషుఁడౌనహో॥ రామ॥ ౧॥ ఎలమినీవె సర్వమును ర–మించు నచేత – నిలను నీకురామనామ–మలరెఁ గాకను॥రామ॥ ౨॥ జనన మర ణములును లేని – శాశ్వితుండవు – ఒనరసతిసుతాళిలేనియొంటి వాఁ డవు – ఉర్వినొక్కచోట నీకు – నునికిగలుగదు–సర్వమయుఁడ వకా యుఁడవు – సాక్షిపరుఁడవు॥ రామ॥ ౩॥ ధరణినీవె శేషాచల–గురుఁడ వనుచును–మఱిమఱి నరసింహదాసు–మదిఁదలంచెను॥ రామ॥ ౪॥

వ. అని యాత్మారాము నిజస్థితింగొనియాడు మనంబునకు బుద్ధి యిట్లనియె. 44

క. భూమిమొదలైన భూతము,
లేమహిమఁజేసి వెల్గు • నెల్లెడ నాత్మా,
రాముని మహిమను దెలియఁగ,
సామాన్యమెబ్రహ్మకైన • సత్యము మనసా. ౫౫

వ. ఓ మనసా, యాత్మారాముని వలననే చరాచరంబులు గల్గుచున్నవి. అతనివలననే నశించుచున్నవి. అతఁడే చతుర్దశభువన ములకుఁ బ్రభువు. అతనియాజ్ఞచేతనే భూమినిల్చియున్నది. కాలము నడుచుచున్నది. నిరాధారంబగు గగనంబున సూర్యచంద్రులు చరిం చుచున్నారు. వానగురియుచున్నది. గాలివీచుచున్నది. అగ్ని వెలుఁ గుచున్నది. నీరుగలిగియున్నది. జలధులు మీఱకున్నవి. సస్యాదులు ఫలించుచున్నవి. జీవులుబ్రతుకుచున్నవి. ఆహా ! అతఁడెందు కీప్ర పంచముఁ గల్పించెనో, యేలహరించునో యదియతనికే తెలియు. ఒరులకెఱుంగరాదనిన మనంబాత్మారాముని ప్రభావంబిట్లనివర్ణించె.

**30.** కీర్తన. జంఝూటి రాగము – ఆదితాళము.

రామరామనీమహిమ యిట్టిదన – రాకున్నది యేమందునో – నామనంబునకిదియద్భుతంబునై – యలరుచున్న దేమందునో॥రామ॥౧॥ సూర్యచంద్రులను – బంచభూతములఁ – జుక్కలనెట్లొనరించితో – కా ర్యంబుగగిరి సాగరంబులను – గల్పితమెటుగావించితో॥ రామ॥౨॥వివిధ ములగు బీజంబులలతలను–వృక్షము లెట్లేర్పఱచితో – ప్రవిమలముగ నీ – ప్రాణికోటులను– బదపడియేగతిఁజేసితో॥ రా॥ ౩॥ నీకేదగుఁగా కీ

ప్రపంచమును-నేర్పరింపఁగాశక్యమా- పాకారికి శివ కేశవనిర్జర - పద్మ భవాదులకైనను॥ రా॥ ౪॥ రూఢిమీఱ శేషాచలసద్గురు - రూపంబే క్రియఁదాల్చితో - గూఢంబుగ నరసింహదాసుమదిఁ - గోరినపర మెట్లిచ్చితో॥ రామ॥ ౫॥

వ. అని యిట్లు రామతత్త్వమహిమ నభివర్ణించు మనంబునకు బుద్ధి యిట్లనియె. 26

క. ఇలలోన రామమంత్రము,
దలఁచుటసులభంబు గనిన ♦ ధన్యం డగుఁబో,
యల సప్తకోటిమంత్రం,
బులు సరియే రామమంత్ర ♦ మునకునుమనసా. ౫౫

వ. ఓ మనసా, సమస్తభువనంబులు దైవాధీనంబగు, ఆదైవము మంత్రాధీనంబగు, ఆమంత్రము భక్తజనాధీనంబగు, ఆభక్తులకు దైవంబు వశుండగు, కావున నట్టి మంత్రరహస్యం బెఱింగిన ధన్యులే ధన్యులని పల్కి మఱియు నిట్లనియె. 27

## 31. కీర్తన. నాదనామక్రియ రాగము - ఆదితాళము.

రామమంత్రము - దుర్జనులకంద - రానిమంత్రము... రామమంత్రమతి రహస్యార్థమది-కామితార్థములు - గలుగఁగ జేయు॥ రామ॥ ౧॥ మఱుగు లేనిది-యెన్నఁటికదియుఁ - దఱుఁగఁబోనిది... పరమేష్ఠియుశ్రీ హరిహరగౌరీ-సురముని శ్రేష్ఠులు- స్మరియించునది॥ రామ॥ ౨॥ మందుడైనను - ననసానకాల - మందునైనను... డెందమందుఁ జింతించిన యమభటు-లందుఁజొరఁగ-భయ - మందగఁజేయు॥ రామ॥ ౩॥ బాధ లేనిది-సాధనలచేత-బోధ గానిది... సాధుమార్గులగు సత్పురుషులచే - బోధరూపమునఁ-బొందఁదగినది॥ రామ॥ ౪॥ స్థిరమై యున్నది - శేషాచల స- ద్గురుఁడై యున్నది... చిరతరముగ నరసింహదాసు నిలఁ దఱియించుటకు-దారిఁజూపిన॥ రామ॥ ౫॥

క. భూములు మణిహాటకధన,
భూమిపతులు నాదిదివ్య ♦ భోగములెల్లన్,
రామ సుచింతామణి కెన,
యే మఱియది గలుగఁగొఱఁత ♦ యేమిఁక మనసా. ౫౬

వ. ఓ మనసా, రామమంత్రరహస్యసంధానంబుచే, సుమహేశ్వరాది దేవతలు సుస్థిరులైరి. వాల్మీకాదిమహర్షులు కడతేఱిరి. జనకుఁడాది చక్రవర్తులుపావనులైరి. బలి విభీషణ ప్రహ్లాదాదులు సుగతింగనిరి. రామదాసాదిసద్భక్తులనేకులు ముక్తులైరి. కాన, రామమంత్ర ప్రభావం బింతంత యనిచెప్పుట కెంతవారికిని శక్యంబుగాదు. అట్టి రామమంత్రానురతిం జెందక, యన్య ధర్మంబుల వర్తించుట కల్పవృక్షంబువిడిచి గచ్చపొదనాశ్రయించిన చందంబగు నని చెప్పి పదియు నిట్లనియె. 48

## 32. కీర్తన. ఖమాచిరాగము - అటతాళము.

ఎంచిభజియింపంగజిహ్వకు - ఎంతమధురము రామమంత్రము -
పంచదారకుఁబనసతొనలకు - మించురుచిశ్రీరామమంత్రము॥ఎంచి॥ ౧॥
అఖిలభువనములందుఁ దానై -యలరుచున్నది రామమంత్రము - నిఖిలపాపంబులకు సాక్షిగ - నిలిచియున్నది రామమంత్రము॥ ఎంచి॥ ౨॥
అమితపామరుఁడైనఁ దలఁచిన-నమలుఁడగుఁబో రామమంత్రము - నిమిషమాత్రముఁగాన సద్గతి-నిచ్చుఁగనుఁగొన రామమంత్రము॥ ఎంచి॥ 3॥
పరఁగవశ్యోచ్చాటనాదుల-బాఱఁదోలును రామమంత్రము - అరయమాయామహిమ లన్నిఁటి - కందరానిది రామమంత్రము॥ ఎంచి॥ ౪॥
ధరణిశ్రీశేషాచలాహ్వయ-గురుఁడొసంగిన రామమంత్రము - నిరతమును నరసింహకవిమది-నిలిచియుండిన రామమంత్రము॥ ఎంచి॥ ౫॥

క. ఆఱుపదవులకు నావల,
మేరుశిఖాగ్రమునఁ జెలఁగు ♦ మేడకుఁబోనిం,
పారఁగ నాత్మారామునిం,
దారవి శశిగతుల మెలఁగు ♦ నతఁడే మనసా. ౫౭

వ. ఓ మనసా, రామ యను శబ్దంబువాక్కున జపించుట చేల త్యాంబనంబడు. ఎట్లనిన, దీపమనినోట నన్నమాత్రమున వెల్తురుగలుగదు. అన్నమన్నఁగాకలిచెడదు. జలమన్నఁదప్పిదీఱదు. ఔషధంబన్న వ్యాధిమానదు. ధనమన లేమివిడదు. కాశియనఁదీర్థమబ్బదు. ఇవియెల్లవాచ్యార్థంబులగుటచే నాయాక్రియలు సంపాదింపక ఫలంబు లేనట్లు శ్రీరామ యను వాచ్యార్థంబువిడిచి, లక్ష్యార్థంబున రామ

తత్త్వంబను క్రియ నుపలక్షించిన మోక్షంబు కరతలామలక మగుట సత్యంబు. కావున, 49

**33.** కీర్తన. జంఝూటిరాగము – అటతాళము.

శ్రీరామతత్త్వంబు–సేవించు మనసా – సారస్యముగనన్య–సంకల్పములుమాని–ద్వారములు తొమ్మిదినిగలపురి – ధీరుఁడగుశోకమంత్రితోడను – భారకుండై జగములను–బరి–పాలనము గావించుచున్న॥ శ్రీరామ॥ ౧॥ మించుకోటలుఏడు – మిన్నందు చుండు – పంచవింశతి మేటి–భటులుకావలియుందు – రంచితంబుగ నెంచమాయా ప్ర–పంచతిమిరమడంచు వెలుతురు–నించునిరుదీపములు గలయా–పంచరంగుల మేడలోఁగల॥ శ్రీరామ॥ ౨॥ నవసూత్రాలయసుషు–మ్నామణి పీఠమున–నివసించుప్రకృతి యనియెడిసీతా సతితోడ – శివుఁడునాది త్రిమూర్తులునునవ–సిద్ధులునుదిక్పతులు వేల్పులు – వివిధఋషిగణములునుగొల్వఁగ – విశ్వభరితంబగుచునున్న॥ శ్రీరామ॥ 3॥ ఇలయందున శేషా–చలగుఁడై వెలసి – గలయంగ సుజనసం–ఘముల రక్షించుచుఁ – జెలువుమీఱఁగఁబోలకం–నర–సింహదాసునిహృదయమున ని–శ్చలతనొప్పుచు సర్వమునకును – సాక్షియై వెలుఁగొందుచున్న॥ శ్రీరామ॥ ౪॥

క. పరమేశు నభవు నవ్యయుఁ,
బరమాత్ము నరూపు నీశు ♦ భగవంతుఁ బరా,
త్పరునాత్మారాముని సు,
స్థిరముగఁగొనియాడి పూజ ♦ సేయుము మనసా. ౫౦

వ. అనిబుద్ధివచించిన, నిర్వికల్పనిరంజన నిరాకారుండగుపరాత్పరుండు ధ్యానార్చనలకశక్యంబగుకతంబున, మనంబున కెద్దియుఁదోఁచక, కొంతవడిపరమేశ్వరు నవలోకింపుచు మనంబిట్లని విన్నవించె. 50

**34.** కీర్తన. శుద్ధకాంభోజి రాగము – జంపెతాళము.

పరమేశనిన్నెటులఁ – బ్రార్థింపవలయునో – వరుసగాఁ బూజలెటు–వలెఁజేయవలెనో–చరణంబు లెందని–శరణు సేయుదునేను–శిరమెందనినిన్నుఁ – జేరిపూజింతుర॥ పర॥ ౧॥ నీవేఫలపుష్పములు – నీరన్నములుపత్రి–భావింపదీపధూ –పములెల్లనీవే–నీవుగానిది యొకటి – యిలలోనఁగల్గదం – దేవస్తువనియిందు – నీకునర్పింతుర॥ పర॥ ౨॥ శ్రీకరంబుగ

నిన్నుఁ-జింతసేయుదమంటె - యాకార రహితమై - యలరుచున్నావు-
ఆకారశూన్యుండ - వరయ లేదని యంటె-ఏకమైజగమెల్లనీవె యున్నా
వు॥ పర॥ ౩॥ పరమాత్మ నీమహిమఁ - బరఁగ నేమనవచ్చు - ధరలోన
దాసజన-తతులఁబాలింపఁ - అరుదార శేషాచ లాఖ్యసద్గురుఁడవై -
నరసింహదాసు స - త్వర నేలినావు॥ పర॥ ౪॥

వ. అనియిట్లు మనంబు శ్రీరామతత్త్వంబుఁ బ్రకటింపుచు
మఱియు నిట్లనియె. 51

క. శ్రీరామరామ నాయెడ,
నేరం బిదియేమి గల్గె ♦ నింతటికష్టం,
బేరీతి సైతు నిప్పుడు,
కారుణ్యము తోడనన్నుఁ ♦ గావుమురామా. ౫౯

వ. అని శరీర వేదన సహింపనోపక మనం బిట్లనితలంచె. పూర్వ
భవకర్మాంకురమునఁ బంచభూతవికారం బగు నీకాయంబుగలిగె.
ఈదేహంబు సమస్తదుఃఖంబులకు మూలంబును, బహువిధరోగం
బులకు మార్గంబును, ననేక భయోత్పాతంబుల కాలయంబును నగు.
ఆహా! ఏమనవచ్చు! ఇంకఁబూర్వజన్మ కర్మఫలం బనుభవింపక తీఱ
దనియెంచి, తనకాధారమైన యాత్మారాము నిట్లు ప్రార్థించె. 52

**35.** కీర్తన. నాదనామక్రియ రాగము - ఆదితాళము.

తప్పు లేమిచేసితినో - కాళ్లలో-నొప్పులు గల్గెను రామా-చెప్ప
శక్యమునుగాని బాధ-యీ-నొప్పులు మాన్పుము రామా॥ తప్పు॥ ౧॥
పండుకొనుటకును - బ్రక్కగుదుర దతి- భారమాయె శ్రీరామా-నిండెను
నొకమాసంబు కంటికిని-నిద్ర నెఱుఁగ శ్రీరామా॥ తప్పు॥ ౨॥ నెల
యయ్యెనుబర్యంకములోఁగాల్ - నేలమోపి శ్రీరామా-జలమలబాధలు
దీర్చుకొనుటకును - శక్యముగాదేరామా॥ తప్పు॥ ౩॥ నిన్నుఁదలంచిన-
నిఖిలరోగములు - నిర్మూలంబగు రామా - పన్నగ నాశ్రమఁబాపకున్న
నీ - పాదమాన శ్రీరామా॥ తప్పు॥ ౪॥ సరసులఁబ్రోవఁగ శేషాచలస-
ద్గురుఁడవైన శ్రీరామా - ధర మొరలిడునర-సింహ దాసునిఁకఁ-దప్పక
యేలుమురామా॥ తప్పు॥ ౫॥

వ. అని యిట్లనేకభంగుల నాత్మారాము వేఁడుకొనుచున్న
మనంబునకు బుద్ధి యిట్లనియె. 53

క. కర్మమున నొందరుదుర్గతి,
కర్మమున నెసద్గతియును ♦ గల్గుభవంబుల్,
కర్మఫల మనుభవింపక,
ధర్మజ్ఞులకైనఁ గడవఁ ♦ దరమే మనసా. ౬౦

వ. ఓ మనసా, నరుండు కర్మఫలంబు గుడుచుట లేదనిమింటి కెగసిపోయినను, భూమిలోఁదూఱినను, జలధిలోఁజొచ్చినను, దిశల కేగినను, నరణ్యంబునడాఁగినను విడుచునదిగాదు. అట్టికర్మంబుఁ దొల్లింటివారుగాని, యిప్పటివారుగాని, యికఁబుట్టువారుగాని దాఁటుటకు శక్తులుగారు. కర్మకుమించిన దొకటిలేదు. పదునాల్గుజగంబుల వారును గర్మకులోనై పరితపించుచున్నారు. కర్మమే జనులకు ముఖ్య దేవతగా నున్నదనిపల్కి, మఱియు నిట్లనియె. 54

## 36. కీర్తన. ఫేల్ రాగము – అటతాళము.

అనుభవింపకతీఱ – దలపూర్వకర్మంబు–లతఁడెంత వాఁడైనను॥ అను॥ ౧॥ వనజగర్భుఁడుతొల్లి – తనశిరము శూలిచే–తనునుత్తరింపఁబడఁడా॥ అను॥ ౨॥ హరుఁడు లేమినిఁ జిక్కి–యవనిజంగము రీతి – యాచించిజీవింపఁడా॥ అను॥ 3॥ సురరాజు పెక్కండ్లు – సూక్ష్మరూపము నఁదా – మరనాళమునదాఁగఁడా॥ అను॥ ౪॥ ఇనచంద్రులొక్కొక్క – యెడరాహుకేతులచే – నిరవొందఁబట్టువడరా॥ అను॥ ౫॥ చండాంశుజుఁడుహరి–శ్చంద్రుఁడంగననమ్మి–చండాలుసేవింపఁడా॥ అను॥ ౬॥ శ్రీరామచంద్రుండు – సీతను గోల్పోయి–ఘోరదుఃఖము లొందఁడా॥ అను॥౭॥ఘనుఁడైన నలుఁడుకాం – తనుబాసివికృతా– కారుఁడై నృపుఁగొల్వఁడా॥అను॥ ౮ ॥ బలియావామనుచేత–బద్ధుఁడై పాతాళ – పదమునకుఁ ద్రోయఁబడఁడా॥ అను॥ ౯ ॥ బలుదాతయగునృగుం – డిలనునూరవెల్లి – భవ మొంది వగఁజెందఁడా॥ అను॥ ౧౦॥ సతితోడఁగానలను–శ్రమలొంది పాండవులు – క్షితివిరటుకడదాఁగరా॥ అను॥ ౧౧॥ భువనేశుఁడైన శ్రీకృష్ణదేవుం డల్ల–బోయచేతను గూలఁడా॥ అను॥ ౧౨॥ భువిపరీక్షిన్మహారాజు–మునిశాపమున – భుజగంబుచేఁజావఁడా॥ అను॥ ౧౩॥ హరిభక్తి రతుఁడైన – యట్టి కుచేలుండు – అతిదారిద్ర్యతఁగాంచఁడా॥అను॥ ౧౪॥ కర మొప్పు సారంగ – ధరుఁడు కాల్సేతులను-

ఖండింపఁబడఁగలేదా॥ అను॥ ౧౫॥ ధర శేషాచలగురుని - దయ గన్న-నరసింహ - దాసువాక్యమునమ్ముమ॥ అను॥ ౧౬॥

క. ఇలసుఖదుఃఖము లనియెడి,
ఫలములఁబొందెదరు సకల ♦ ప్రజలును జీవుల్,
విలసితజన్మ రహితమను,
ఫలమునుగైకొనక యున్న ♦ ఫలమే మనసా. ౬౧

వ. ఓ మనసా, ప్రపంచజనంబులు చూతరంభాది నానావిధ ఫలంబులంగొనితిందురు. కాని, పరమార్థంబను ఫలంబుఁగొనఁజాలరు. మఱి యాఫలం బనుభవించిన వారికి, వేఱుఫలంబులు రుచించునా? అట్టిది గనుకనే సప్తమహర్షులాదిగా నాఫలంబారగించి జరామర ణావస్థలం బాసి చిరకాల జీవులైరి. కావున నాఫలంబందఱి కందుట దుస్తరంబది యెట్టిదనిన. 55

## 37. కీర్తన. మధ్యమావతిరాగము - ఆదితాళము.

పండు-బహుమధురము లొల్కుచు నుండు - సుజ్ఞానులుగొన్న పండు-పరమార్థంబదియై యుండు-కొండలతుదను-గుండలిమధ్యన - ఖండరూపమై-నిండి ఫలించిన॥ పండు॥ ౧॥ చెట్టెంచి చూడ-మొదలు లేకుండు-మఱి దానికినాల్గు - పట్టైనశాఖలు-అనువై యుండు - చుట్టును గావలి-శూరులుందురఁట - పట్టులేకపైఁ బ్రబలుచునుండు॥ పండు॥ ౨॥ జననాదిమరణంబులవిడఁజేయు-ఆఫలమునుదిన్న ఘనమైనపాపంబు లనెడఁబాపు - హానన మొనర్చును సజ్ఞానము-స-జ్జననుత మగు-సు-జ్ఞాన మొసంగు॥ పండు॥ 3॥ మఱిపేరులేనిది పెద్దఫలంబు - ఏఫలములు-దా ని-సరిరావు-కను మమతృసారంబు-ధర శేషాచల - గురుకటాక్షమున- నరసింహాఖ్యుం-డరుదుగఁబడసిన॥ పండు॥ ౪॥

ఆ-వె. నూతినడుమ నొక్క ♦ నాతి నాతికి మీఁద,
గోతికోతిమీఁదఁ ♦ భూత మొకటి,
భూతమునకు మీఁద ♦ జ్యోతిగలదొక టా,
జ్యోతిగనుటె మోక్ష ♦ రీతిమనస. ౬౨

వ. ఓ మనసా, యాజ్యోతి వెలుంగున బ్రహ్మవిష్ణు మహేశ్వరు లు నటించుచు, సృష్టిస్థితిలయంబులుగావింతురు. నరసురమును లాది

ధీరులు తమ తమపను లాచరింతురు. పశుపక్షిమృగ క్రిమికీటకాది సమస్త జంతుజాలంబులు దిటవులై వర్తించు. సూర్యచంద్రాగ్ని నక్షత్రంబు లతులములై ప్రకాశించు. దేవమర్త్యలోకంబులు చెల్వమై గనుపించు. త్రిపురచరులగు జీవు లా వెలుంగున మెలంగుచున్నను, నజ్ఞానంబను తమంబునములింగి యా వెలుంగును గానకుందురని చెప్పి మఱియు నిట్లనియె. 56

**38.** శౌ హ రా.

ఇదివినుమయ్యా తత్త్వరహస్యం - బెంతో చోద్యముపూని-
వదలకనిల్పి నిజార్థం బెఱిఁగిన-వారికి మోక్షముదీని॥ ౧॥
పదములీకతోఁకయును లేనియొక - పక్షిజగంబులనేలఁ-
బదపడిదానినిఁ బట్టనెంచియొక - బాలుఁడుపోంచెనుజాల॥ ౨॥
చెదరి చరించెడి సింహము లేఁడిటి - చీమయొకటిదిగమ్రింగె-
అదిగని పాఱెడివ్యాఘ్రము లాఱిఁటి-హరిణమొకటితగమ్రింగె॥ ౩॥
మఱియదివిని చనుకరులనెనిమిదిఁటి - మశకంబొక్కటిమ్రింగె-
కరకరిఁబరువిడు ఘనులనుమూటిని - కప్పయొకటి దిగమ్రింగె॥ ౪॥
ఎంచపంచవింశతిభటులదిపరి - కించితమకుఁబ్రభువైన-
మించినమానసరాజును జేరిరి - భీతిఁజెందిమదిలోన॥ ౫॥
వచ్చెడుపోయెడు వానినిలయమును - జొచ్చినాశ మైరంతఁ-
జెచ్చెర శేషాచలగురుకృప నర - సింహదాసుగనెనింత॥ ఇది॥ ౬॥

క. సరసిజనేత్రలఁబొందుట,
సరిగాదది యల్పసుఖము ♦ చర్చింపంగా,
సరిలేని పరమసౌఖ్యము,
గురుతరముగముక్తికాంతఁ ♦ గూడుము మనసా, ౬౩

వ. ఓ మనసా, పరసతులపొందు నరకంబును మిగులదూష్యంబును, శరీరభంగమాదిగాఁగల యనేకసంకటంబులకు మూలంబునునగుచున్నది. మోక్షనాయకిపొందు పాపహరంబును జిరకీర్తియుఁ బావనమునగు జన్మరహితంబును గలిగించుచున్నది. కావున నజ్ఞానవిపినానలంబగు గురుచరణంబు గుఱిచేసి, మూఁడింటివిడిచి, యాఱింటిఁగడచ్చి, యేడింటిఁబాసి, యెన్మిదినిదాఁటి, నిర్మలస్థానంబుఁ జేరువారికా కాంతను సేవించుటకును, రమించుటకును సాధ్యంబగును, గాని యితరులకు

శక్యంబుగాదనిన, మనంబాశ్చర్యంబునొందుచు, నచంచల వృత్తితో సమ్ముక్త్యాంగనసౌధంబు ముంగిటంజేరి శాంతంబున నిట్లనియె. 57

## 39. ఏలపాట. ధన్యాసిరాగము - చాపుతాళము.

మేడమీఁదిచిన్నదాన - జోడులేక యున్నదాన - మేడనెక్కు జాడఁజెప్పవే-ఓముక్తికాంతా - నేడునిన్నుఁ-గూడవచ్చెదనే॥ ఓముక్తి కాంతా-ఓచిన్నదానా॥ ౧॥ నన్నుఁజేరనలవిగాదు - పన్నుగ నా బ్రహ్మకైన-నన్నుఁగూడునాథుఁడెవఁడోయి - ఓరోరిజీవా- నిన్నునీవెఱిఁగి రావోయి॥ ఓజీవబ్రహ్మ - ఓచిన్నవాఁడా॥ ౨॥ ధరశేషాచల గురుని కరుణ-సరియైనట్టిమార్గంబరసి-త్వరితముగను వచ్చినవాఁడనే-ఓముక్తి కాంతా-సరసముతోనిన్నుఁగూడెదనే॥ఓముక్తికాంతా-ఓచిన్నదానా॥ ౩॥ ఏడేడులోకములఁగడచి-జోడుత్రోవలకూడికదెలిసి - మూఁడుపేటలుదాఁటిరావోయి - ఓరోరిజీవా - మూఁడువిడిచినవాఁడవై తేను॥ ఓజీవ బ్రహ్మ - ఓచిన్నవాఁడా॥౪॥ నిన్నుఁగవయఁగోరినేను - మన్నుమిన్నుదిరిగితిని-నిన్నుఁజూచినన్ను మఱచితి-ఓముక్తికాంతా - యున్నదేదో లేనిదేమిటో॥ఓముక్తి॥ ౫॥ నేనేయున్నదాన నెందు-నీవేలేనివాఁడవిందు-పూనినన్నుఁబొందిస్థిరమొందు - ఓరోరిజీవా-నేనెనీవై నిల్తువుధరయందు॥ ఓజీవబ్రహ్మ - ఓచిన్నవాఁడా॥ ౬॥ అన్ని దెల్పు నెఱుకనీవె - యరయనరసింహాఖ్యుఁడనేనే - నిన్నుఁగలసినీరూపంబైతి - ఓముక్తికాంతా-ఎన్ననన్యంబెద్దయుఁగానైతి॥ ఓముక్తికాంతా - ఓచిన్నదానా॥ ౭॥

వ. అనియిట్లు ముక్తికాంతంగలసి పరమానందంబునం జొక్కి మనంబునకు బుద్ధి యిట్లనియె. 58

క. పరుసంబు లంటియినుమును,
మఱిహేమంబై చెలంగు ♦ మాడ్కిఁదలంపఁ,
ధరనెంత మూఢుఁడైనను,
బరమంటినభవ్యజన్ము ♦ వడయును మనసా. ౬౪

వ. ఓ మనసా, పరబ్రహ్మామృత రసపానతృప్తుండై, శాశ్వతానందపరసుఖంబుఁజెందిన ధన్యుండు సత్యలోక వైకుంఠ కైలాసస్వర్గాధిపతుల నైశ్వర్యంబు లల్పంబులుగానెంచు. ఇంకభూలోకపతు లాది సౌఖ్యంబు లెంతమాత్రంబగు? నరసుర భోగంబులస్థిరంబగు. పరసుఖం

బున కేసుఖంబులు సమంబులు కావు. కావునఁ, బరతత్త్వమునకు మించినదొకటిలేదు. వినుము. 59

**40.** కీర్తన. హిందూస్థాని కాపీరాగము – అటతాళము.

పరమంబైపరమే – భవహరమైనపదమే – ధరణిఁబామరులకె – వ్వరికినందనిదే॥ పర॥ ౧॥ జరనుమృత్యువునడఁపఁ జాలునమృతమే – గరిమఁగోరికలిచ్చు – కల్పవృక్షంబే॥ పర॥ ౨॥ దండిరుగ్మతలెల్లఁ – దఱుమునౌషధమే – మెండుదారిద్ర్యములు – చెండుపరుసంబే॥ పర॥ 3॥ కర్మకాననమెల్లఁ – గాల్చునసలంబే–నిర్మలత్వమునొసఁగు–నిరతిశయం బే॥ పర॥ ౪॥ నేటుగజగమెల్ల – నిండియున్నదే – కోటిద్రవ్యములిచ్చి– కొనఁబోవరాదే॥ పర॥ ౫॥ ధరణిశేషాచల స–ద్గురుకటాక్షంబే – నర సింహాఖ్యుఁడు మదిని – మఱవనిహితమే॥ పర॥ ౬॥

క. తనుఁదా నెఱుఁగకమనుజుఁడు,
తనవారని భ్రమయుఁదనువె ♦ తానని యెంచున్,
దనయంతఁ దానె కరివీఁ,
పునమృత్తిక వేసికొన్న ♦ పోల్కినిమనసా. ౬౫

వ. ఓ మనసా, శరీరముతో స్వర్గమునకేగుటే యెక్కువ యని కొందఱందురు. తనువు వెంటఁగొని పోయినను జావుతప్పదు. చచ్చినతోడనే జన్మమునకు రాకతీఱదు. దేహముతో నెందున్నను, జావుపుట్టువులకు హేతువగుఁగాని, యది జన్మరహితమగు మోక్షం బుగాదు. సుజనుండు గురుకృపఁ దన్నుఁదానెఱింగి, శరీరంబు తాఁ గానని తెలిసికొనిగదా జీవన్ముక్తుండగు. ఎవఁడేని తన్నుదాఁ నెఱుం గునంతకు నజ్ఞానియగుచు మోక్షార్హుండు గాకుండు. తను వను మాయ నావరించుటే యజ్ఞానం బనంబడుఁగావున, 60

**41.** కీర్తన. ఇంగ్లీషువర్ణమెట్టు (రాగము) – ఏకతాళము.

దేహము నేనని యెంచకుజీవ – త్రిప్పటలొందెదవు– దేహిని నేనని తెలిసిననీవే – దేవుఁడవయ్యెదవు॥ దే॥ ౧॥ సతిసుతులును నా వారని భ్రమసిన – సంకటమందెదవు–సతతంబుననిను నీవుగాంచిన – సద్గతిఁగని యెదవు॥ దే॥ ౨॥ కర్మమార్గములఁ జొచ్చినభవలయ – గతులనుబొందె దవు–నిర్మలతత్త్వ జ్ఞానముగాంచిన–నిత్యుఁడవయ్యెదవు॥ దే॥ 3॥ అస్థిర లోకమునమ్మిచరించిన – నారడిఁబడియెదవు – సుస్థిర మగుపరతత్త్వం

బందిన-సుఖమును జెందెదవు॥౪॥ధర శేషాచల గురునిస్మరించిన-ధన్యుఁడ వయ్యెదవు-నరసింహాఖ్యుని వాక్యమువినిన-నాత్మదరించెదవు॥ దే॥ ౫॥

క. మానాభిమానముల నెడఁ,
బూనకు పూనినను మోక్ష ♦ మునకవి యడ్డౌ,
మానవు లివిమానకగద,
జ్ఞానము గనలేక చెడుట ♦ గాదేమనసా. ౬౬

వ. ఓ మనసా, యభిమానమేపంది. అహమేకుక్క, తిరస్కారమేయేనుఁగు. మొదటిదియగు పందినింజంపి, కుక్కనుంగూల్చి, యేనుఁగుందునిమి, కాముని౦గెంటి, క్రోధునింద్రుంచి, లోభు నిందఱిమి, మోహునడంచి, మదు నుత్తరించి, మత్సరుందెగటార్చి, మూఁడగడ్డలందాఁటి, యేఁడుకోటలుగడచి, త్రిపురంబులమీఱి, పంచవింశతి భటులజయించి, విజ్ఞాననగరంబునకుఁ బ్రభువై సహస్రారమను గద్దియనెక్కినం గదా సద్గతి నెక్కినవాఁడగుఁగాక. 61

## 42. తో హ రా.

జ్ఞానోదయమే చందముగల్గును - గల్లయంను భ్రమఁగొన్న -
మానవులకుఁదలపోసిచూడఁగను - మఱి యిహపరములుసున్న॥ ౧॥
దిష్టములను దేహాభిమానమును - దీసి వేయఁగాలేక-
ముష్టిప్రజ్ఞలను జేసిననేమగు - మోసముఁబొందుటెగాక॥ ౨॥
త్రాగుఁబోతులకు జూదగాండ్రకును - ధరహింసాపరులకును-
బాగుగఁబరస్త్రీ రతులకుజ్ఞానము - పట్టువడునెయెంతయును॥ 3॥
ధనమదాంధులకు బుధదూషకులకుఁ - దంత్రవాదులకునెల్ల-
ఘనతరమగు పరమార్థవిచారము - గలిగి తరించుటకల్ల॥ ౪॥
కుటిలాత్ములునిల - శేషాచలస - ద్గురుకృపకర్హులుగారు-
పటుతరముగ నరసింహదాసు స - ద్భావముఁదెలియఁగఁ బోరు॥ ౫॥

క. అనవిని సంతోషంబున,
మనమిట్టుల ననియెఁబ్రీతి ♦ మనుజునకును నే,
పనిసేయు టొప్పునే యే,
పనులొనరింపంగరాదో ♦ పల్కుముబుద్ధీ. ౬౭

క. నానా భూతసమానా,
మానితవిజ్ఞానమాన ♦ మంత్రాధీనా,
మానావమాన హీనా,
మౌనీంద్ర స్తుతవిధాన ♦ మాయాన్యూనా. ౬౮

మాలిని. సతిసుతహిత శూన్యా ♦ సజ్జనానీక మాన్యా,
జితభవలయ కర్మా ♦ శిష్టనిష్ఠైక ధర్మా,
గతకలుష వికారా ♦ కామ షట్కాదిదూరా,
మతకులహత కార్యా ♦ మర్మ భేదాంతధుర్యా. ౬౯

క. మంగళము సర్వమయునకు,
మంగళ మనఘునకు మేటి ♦ మహితాత్మునకుఁ,
మంగళ మక్షరునకు జయ,
మంగళ మద్వయున కమల ♦ మంగళము సదా. ౭౦

**43.** మంళహారతి – హిందుస్థాని కాఫీరాగము – జుల్వాతాళము.

మంగళమిదేనీకుభక్త – మాన్యమంగళం। రంగుగానుసర్వభువన – రక్షమంగళం॥ మంగళం॥ ౧॥ సత్యరూపమాయారహిత – జయసుమంగళం। నిత్యపరంజ్యోతిరూప – నీకుమంగళం॥ మంగళం॥ ౨॥ కర్మవిగత గౌరీనుత – యఖండమంగళం। ధర్మనిలయ నిర్మలాత్మ – తత్త్వమంగళం॥ ౩॥ కామమోహనాశనిర్వి – కారమంగళం। ధీమనోవికారదూర – దివ్యమంగళం॥ మంగళం॥ ౪॥ ధరణిలో శేషాచలార్య – దండిమంగళం। వరనరసింహాఖ్యవినుత – వరుసమంగళం॥ మంగళం॥ ౫॥

గద్య.

ఇది శ్రీమాన్ పోకల – శేషాచల దేశికానుగ్రహాశ్రిత,
కర్పూరగోత్రాన్విత, పోలకం – లక్ష్మీనృసింహార్యసుత,
సజ్జనహిత, నరసింహనామ రచిత బుద్ధ్యుపదేశిని
యను మానసబోధ సుజ్ఞానతత్త్వకీర్తనల
గ్రంథంబునందుఁ బ్రథమాశ్వాసము,
స మా ప్త ము.





శ్రీ సద్గురవేనమః.

# బుద్ధ్యుపదేశిని

యను

# మానసబోధ సుజ్ఞాన తత్త్వ కీర్తనలు.

## ద్వితీయాశ్వాసము.

క. స్థిరరూప గురుపరాత్పర,
పరమానందప్రకార ♦ భక్తవిచారా,
దురి తారణ్యకుఠారా,
కరుణాకర సారజన్మ ♦ కర్మనివారా. ౧

వ. అవధరింపు మాబుద్ధి మనంబున కిట్లనియె. ఓమనసా, నీ వడిగినయర్థం బెఱింగింతు నాకర్ణింపుము. నరునకు సద్ధర్మవృత్తిగలిగి సర్వకాల సర్వావస్థలను భగవచ్చింతనయే చేయఁదగినది. కొన్ని చేయఁదగనిపనులుంగలవు. మనుజులై పుట్టి మిక్కిలి తెలివి తేఁటలు గల్గి, పరమాత్మ సమస్తభూతమయుం డని తెలియక, యితరజంతువు లన్నియుఁ దమవంటివేయని యెంచక, ప్రత్యక్ష వ్యాఘ్రతుల్యులై, జీవఘాతుకులగుదురు. కొందఱు శక్తులకుఁ గొన్నిప్రాణుల బలి యిత్తురు. నృపాలురుకొందఱు, మాంసాపేక్షచే వేఁటనెపంబునఁబక్షి మృగాదులంగొట్టి భక్షింతురు. కొందఱు బిలంబుల నిరోధించి మూషికాదులంజంపి తిందురు. కొందఱు వలలూఁతలాది సాధనంబుల జలచరంబులంబట్టి భుజింతురు. కొందఱిండ్లకడ మేషకుక్కుట పశు సూకరాదులంగోసి మెసవుదురు. ఇట్లు వానిం జంపి తిని తమ శరీరముల వృద్ధిపఱచినఁ దాము చావక నిలిచియుందురా? జీవహింస

కంటె మించినపాపం బొందుగల్గునా? అట్టి హింసకులు యమలోకంబున యమభటులచే ఖండింపఁబడకుందురా? మగుడి పశుపక్ష్యాది జన్మంబు లెత్తకుందురా? తొలుత, వానిం గోసినచందంబున వారిచేఁ దాము తెగకుందురా? ఇంక వారి తిప్ప లింతంతయని చెప్పశక్యమా? "అహింసాపరమోధర్మ" యన్న శ్రుత్యర్థానుసారముగా నటించువాఁడే మానవుండనంబడు. అట్లులేనివాఁడు ప్రత్యక్షరాక్షసుండనంబడు. జీవహింసాది దుష్కృత్యములు సల్పుటచే శూద్రాదులకు హీనతవచ్చుటయు, నహింసాపరులగుటచే బ్రాహ్మణాదులు గౌరవమువహించుటయు జగంబునఁ బ్రసిద్ధంబు. కావున నహింసయే సమస్తధర్మంబులకు ముఖ్యధర్మంబుగఁ జెప్పటంజేసి క్రతువులందైనను, శత్రుల నెపంబుననైనను జీవహింస సర్వమాత్మమయంబుగావునఁ జేయందగదు. అట్లు చేయుట ధర్మవిరుద్ధంబును, నరకాస్పదంబును నగు. ఇంకను జేయఁదగని కార్యంబులఁ గొన్నింటిం జెప్పెద, వినుము. 1

క. విడువక బంగినిఁద్రావినఁ,
గడుమదిస్థిర హానటంచు ♦ ఖలు లనియెద రె,
ప్పుడుకైపు వస్తువులుమదిఁ,
జెడఁగొట్టును గాకస్థిరము ♦ సేయునెమనసా. ౨

**1. కీర్తన. ఖమాచిరాగము – ఝల్పాతాళము.**

చేయరానిది–చేయరాదది–చేయుకలుషములనుదామె – చెందవలెనది॥చేయ॥౧॥ బంగిత్రాగుట – బహుగవాఁగుట– సంగమును గృశించుటక్షయ–నమరగల్గుట॥చేయ॥౨॥ కల్లుగ్రోలుట–ఘనతదగ్గుట – ఒల్లుమఱచిపడుటడబ్బు – కొల్లవోఘ్రుట॥చేయ॥౩॥ పరసతిపరత – పాపమొందుట–పరువుసెడుటవ్రేల్లువడుట – బ్రతుకువాయుట॥ చేయ॥ ౪॥ దొంగిలించుట–దూష్యమొందుట – లొంగిచిక్కువడుటప్రాణ – భంగమొందుట॥ చేయ॥ ౫॥ కల్లలాడుట–నెల్లవారిట – నుల్లమందు నమ్మకుంట – యుల్లరివడుట॥చేయ॥౬॥హత్యసేయుట – నంత్యమందుట – ప్రత్యహంబు యమునివీట–బాధలొందుట॥ చేయ॥ ౭॥ గురునిఁజేరుట – పరము గాంచుట–ధరణిలోన నారసింహ–దాసుహితమఁట॥ చేయ॥ ౮॥

సీ. అనిన యాగంబెట్టు ♦ లాచరించుట ధర్మ
మనిన మదికిబుద్ధి ♦ యనియె నిట్లు,
దేహంబు యజ్ఞమం ♦ దిరముగా సమకట్టి
క్రతుకర్తజీవునిఁ ♦ గానొనర్చి,
మఱి గురుభక్తినా ♦ మఖయూపమును నాటి
నిశ్చయాధ్వర వేది ♦ నేర్పరించి,
కుంభకంబను యజ్ఞ ♦ కుండంబు గావించి
పూరక రేచక ♦ స్ఫురణఁదాల్చి,
తే-గీ. విమల విజ్ఞానవహ్నిని ♦ వృద్ధిఁజేసి,
యహమ నెడు యజ్ఞపశువును ♦ నందు వేల్చి,
మొనసితచ్ఛేషమును దిని ♦ ముక్తులగుదు,
రార్యులధ్వర క్రమమిది ♦ యంద్రుమనస. 3

వ. ఓ మనసా, యిదియంతరయజ్ఞంబనంబడు, క్రతుకాలంబున నన్నదానంబుచే ననేకజనంబుల సంతుష్టినొందించినను జీవహింస తోఁ గూడినది బాహ్యయజ్ఞం బనంబడు. మనుజుం డాత్మపిపీలికాది సమస్తభూత మయ మని తెలిసి, నిఖిలజంతుజాలంబులయెడ దయాళుండై, జ్ఞానయుక్తంబగు నంతరాధ్వర మొనర్పందగుఁగాని, యవివేకియై భూతదయ లేక, జీవఘాతంబొనర్చి, యజ్ఞానసహితంబగు బాహ్యక్రతువెన్నఁడు నాచరింపందగదు. హింసగావించినవాఁ డఖిలహింసలకుఁ బాత్రుండగుటసత్యంబు. కావున, 2

## 2. తో హ రా.

ఒప్పగుపనులొనరించువానినే - గొప్పవాఁడనందగును-
దప్పునడతలను నడిచెడువాఁడిఁక - గొప్పవాఁడెట్లగును॥౧॥
దుష్టజనంబుల సేఁతలరయఁగా-దుష్కృతంబులేవైన-
శిష్టులెన్నఁడును జేయరట్టిదు - శ్చేష్టితములు కలనైన॥ ౨॥
అట్టిదురాచారుల సంగతినిల-నాలోచింపకుమెపుడు-
గట్టిగ సజ్జనవృత్తినిఁజేకొని - గాంచుము సద్గతినిపుడు॥ 3॥
మనుజజన్మమైనందుకు ధరలో - మంచిచెడ్డలనుదెలిసి-
నొనరనటించినవాఁడేమనుజుం-డొప్పగసుజనులఁగలసి॥ ౪॥

అరయఁగ శేషాచల సద్గురుకృప - నందక సుగుణమురాదు -
తిరముగ నరసింహాఖ్యునిభావముఁ - దెలసిన వక్రతలేదు॥ ౫॥

క. కర్మములుచేసి చేసిన,
కర్మములను జన్మ లెత్తి • గాంచుచు ఫలముల్,
కర్మగతియంచుఁ దెలియక,
కర్మంబులు సల్పువారె • కర్ములు మనసా. ౪

వ. ఓమనసా, కర్మ సత్కర్మదుష్కర్మ జ్ఞానకర్మయని త్రివిధం బులగు. ఎట్లనిన: లోకంబున దేవాలయ గోపురకూపతటాకంబు లేర్ప రించుట, గోభూహిరణ్యాన్నాగ్రహారాది దానంబులొనర్చుట, సోమ రాజసూయ పౌండరీ కాశ్వమేథాద్యధ్వరంబు లాచరించుట, జననీజన కార్థి గురుబుధజనంబులం బోషించుట, పరదారల మాతృభావంబు సేయుట, సత్యంబువల్కుట, శాంతంబుఁబూనుట, తీర్థయాత్రలుస ల్పుట, భూతదయగల్గుట, బుధులతో స్నేహించుట, దైవభక్తి వహించుట, ధర్మముదప్పకుండుట, సత్కథలువినుట, చదువుట మొ దలుగాఁగలవి సత్కర్మలనంబడును. మఱియుఁ దలిదండ్రుల బాధించు ట, జ్ఞాతిద్రోహమొనర్చుట, జీవహింసగావించుట, పరసతులఁగవ యుట, పరులదూషించుట, పరధనము తస్కరించుట, పరులతోఁగల హించుట, కుపితుండగుట, కోపముఁబెంచుట, దైవభక్తిలేకుండు ట, దబ్బరలాడుట, పెద్దలతోమచ్చరించుట, మద్యపానమొనర్చుట, వేఁటాడుట, జూదమాడుట, పరులబలధనతేజంబుల కోర్వకుండుట, వేదశాస్త్రంబులదూఱుట, సత్పత్నివిడుచుట, నరపశ్వాదులవిషం బుపెట్టిచంపుట, గృహంబులు దగులఁబెట్టుట, మొదలగునవి దుష్క ర్మంబులనంబడు, దారాసుతధనవాంఛితంబులు దబ్బరలని తెలిసి, సత్వరంబున సద్గురుం జేరి, యమ్మహాత్ముకరుణచేఁ దన్నుఁదా నెఱింగి, దేహేంద్రియాతీతుండై, తానే తానై వెలుంగుచు, సుకర్మదుష్కర్మం బులను విత్తనంబుల జ్ఞానాగ్నింబడవేల్చి, జన్మరహితంబుగాంచుట జ్ఞానకర్మంబనంబడు. ఇనుపగాజుకంటె నిత్తడిగాజులుమేలను సా మ్యంబుగలదు. ఇత్తడికంటె హేమంబుహెచ్చగు. అట్లాకదానికంటె నొకటిఘనంబగు. వినుము.

**3.** తోహరా.

ఇలలోదుష్కర్మంబులువదలక - యెసఁగెడువారలకంటె-
వలనొప్పఁగ సత్కర్మలుచేసెడి - వారేయోగ్యులుకంటె॥ ౧॥
తగసత్కర్మలు సల్పుచుభువిలోఁ - దనరెడిపుణ్యులకంటె-
భగవన్నామము నోటజపించెడి - ప్రాజ్ఞులుత్తములు కంటె॥ ౨॥
నిరతముభగవ న్నామముసేయుచు - నెగడెడివారలకంటె-
సరగుననా భగవంతునిఁగాంచిన - సరసులుశ్రేష్ఠులుకంటె॥ 3॥
ఘనతరముగనా దైవంబునుమదిఁ - గనుఁగొనువారలకంటెఁ-
దనరఁబరాత్మను గలసినవారే - దండివారలిలఁగంటె॥ ౪॥
వరశేషాచల గురుకృపగలిగిన - వారేయధికులుకంటె-
నరసింహాఖ్యుని వాక్యము నెంచిన - నగుదురుఘను లిదివింటె॥ ౫॥

క. వాలాయము నిజమెఱుఁగని,
పాలసులకుఁగాకతుచ్ఛ ♦ పదవులవాంఛల్,
ఏలీలను గోరుదురే,
యేలోక సుఖంబులార్య ♦ లెన్నఁగమనసా. ౫

వ. ఓ మనసా, సత్కర్మలకుఁ బుణ్యలోకంబులును, దుష్కర్మలకు యమలోకంబును సిద్ధించును. ఈరెండు తెగలవారికి భవనాశంబులు విడనేరవు. ఎట్లనిన: బ్రహ్మలోకాది పదవులకుఁ బోఁజాలినంత పుణ్యాత్ములా యాపదవులంబొంది. వారివారి పుణ్యములు నశించినతోడ నిమ్మహి మనుజులై పుట్టుదురు. పదవులకుఁ గొఱఁతైన పుణ్యు లీజగమందేజనించి వారివారి పుణ్యములకొలఁది నిహసుఖంబులందుదురు. యమలోకశిక్షకుఁ జాలినపాపు లాయమలోకబాధలంబొంది, మగుడి మర్త్యంబునఁ బశుపక్షిమృగ క్రిమికీటకాది జన్మంబులెత్తుదురు. యమదండనకుఁ జాలని పాపు లీలోకంబున నరులైపుట్టి, వృశ్చికోరగ మృగచోర రాజదండన రోగాదిబాధలం బడుచుందురని పల్కి మఱియు నిట్లనియె. 4

**4.** కీర్తన. నాదనామక్రియరాగము - త్రిశ్రజాతి రూపకతాళము.

ఏలోకమందినను - నేమిసౌఖ్యముగలదు - మేలుకీడులు రెండు మనసా-యీలోకమందగురు - కీలెఱిఁగిపరమందు-వాలలాడుచునుండు మనసా॥ ఏలోక॥ ౧॥ అలసత్య లోకమున - కాశించెదరు కొంద -

అందుఁగలసుఖమేమిమనసా । నలినాసనుఁడురాగ - కలితుఁడై హరు నిచేఁ-దలకొట్టఁబడలేడె మనసా॥ ఏలోక॥ ౨॥ ఆరయఁగ వైకుంఠ మందఁదలఁతురుకొంద - అందునధికంబేమిమనసా - ద్వారపాలకులగు చుఁ-దనరుజయవిజయు లను - వారుజన్మలఁబడరెమనసా॥ ఏలోక॥ 3॥ అవనిఁగైలాసంబు - నంద నెంతురుకొంద-అందేమిసౌఖ్యంబు మనసా - శివుఁడునొకతలపుత్తెఁ - జేఁబట్టియర్థించి - జీవింపఁగావలసె మనసా ॥ ఏలోక॥౪॥ అరుదారస్వర్గంబు-నందఁజూతురుకొంద - అటవి శేషంబేమి మనసా - పరకాంతకై యాస - పడియమరనాయకుఁడు - బహుదుఃఖ ములఁబడఁడెమనసా॥ ఏలోక॥ ౫॥ ఆలోకపతులకే - యట్టియిడుమలు గల్గె-నందున్నఘనమేమిమనసా-తాలిమితో శేషాచ - లార్యకృప నర సింహ - దాసునిశ్చయమింత మనసా॥ ఏలోక॥ ౬॥

క. మఱితీవ్ర మోక్షవాంఛనఁ,
బొరిఁబొరి వివరింపమంద ♦ మోక్షేచ్ఛయనన్,
నిరుగతుల మనుజులందునఁ,
బరఁగును దద్విధము వినుము ♦ బాగుగమనసా. ౬

వ. ఓ మనసా, గృహముదరికొని మండునపు డింటనున్నవాఁ డెంతవడిగా వెలువడ వీక్షించు, గహనంబున మార్గంబు దప్పినవాఁ డెంత తీవ్రంబునఁ దెరువరయఁగోరు, వ్యాఘ్రంబుఁగదిసినవాఁ డెంత వేగంబునఁ బ్రాణంబు దక్కించుకొననెంచుఁ, బన్నగంబుపైఁ బడిన వాఁ డెంతశీఘ్రంబునం బాఱఁజూచుఁ, దస్కరులఁ గన్నవాఁ డెంత త్వరితంబున మఱుఁగువడఁదలంచు, నంతయవసరంబున ముక్తి సం పాదింపఁగోరునదియే తీవ్ర మోక్షేచ్ఛయనంబడు. మోక్షంబునకు ననువగు సాధనంబులఁ బడయకే మోక్షంబు గావలయునని తలంచు ట మంద మోక్షేచ్ఛయనంబడు. తాపత్రయములను వహ్ని శరీర మును గాల్చుచే గేహము దగులఁబడుట. తన్నుఁదానెఱుంగక మేను తాననుకొనుటయే యరణ్యంబునఁ ద్రోవదప్పుట, మనంబింద్రియం బుల వెంటఁదగులుటె పులివెంబడించుట. దుర్విషయంబులఁ బ్రప ర్తించుటే యురగంబుపొదువుట. కామాది షడ్వర్గంబను చోరులు పొంచి వివేకంబను ధనము దొంగిలింపఁజూచునదే తస్కరులు దఱు ముటయనంబడు. వినుము.

౫. తో హా రా.

ఒకనికినొకతటేనిన్నికష్టములు - నొగినొనఁగూడకయున్న -
నొకయెడనొకనికినొక్కొకబాధయు - నొదవియుండనగునెన్న॥ ౧॥
ఇన్నిసంకటములొకకాలంబున- నెనసినమనుజుఁడుగాని -
పన్నుగఁబాయఁడు జన్మబంధములు - బాగుగనిలభ్రమమాని॥ ౨॥
తలఁచిచూడఁగశ్రవణమనన నిధి-ధ్యాసలతో మదిచెలఁగి-
యలఁప్పఁగసద్గురూపదేశం - బందిపరత్వముగలిగి॥ ౩॥
సగుణనగుణకృపశాస్త్రదృష్టమున - సత్యమసత్యంబనుచు -
మఱినిశ్చయులైముక్తులుగావలె - మాయారహితులమనుచు॥ ౪॥
అరుదుగ శేషాచల గురుకృపఁగన - నలవియెచెనటులకెల్ల -
ధరణిలోన నరసింహదాసుహిత - మెఱిఁగినగెల్తురుకల్ల॥ ౫॥

క. అలపంచదార రుచిగను,
నిలఁజీవయు మెసవుకసవు ♦ నేనుఁగుపరమ,
ట్టులఁదగ నజ్ఞాన మదాం,
ధులుగానరుబుధులెఱుంగు ♦ దురుగను మనసా. ౭

వ. ఓ మనసా, మనుజుండు తననీడ గడచితిరుగ సమర్థుండైన
ను, మృత్యుదేవతను జయించినను, విధికృతంబుఁబాపుకొన నోపిన
ను, మదికిందెలియరాక కార్యంబు లాచరించినను, నిలాతలంబునఁగా
లూనక నభంబునఁ దిరుగఁజాలినను, గతాగతవర్తమానంబు లెఱింగి
చెప్పినను, మంత్రయంత్ర తంత్రమహిమలనేకములునేర్చినను, జలానల
కంటకంబులపైనడువఁగలిగినను, భూచక్రంబు కరతలంబునఁ జేర్పనోపి
నను, బరమార్థంబువహింపక సమర్థుండుగానేరఁడు. కావున,

6. కీర్తన. మోహనరాగము - అటతాళము.

పరతత్త్వజ్ఞులుగాకే జగమున-ముక్తి-పదముఁ బొందఁగరాదే
యుగమున-హరిహరబ్రహ్మేంద్ర -సురదిక్పాలదనుజ భుజంగకుల ము
ని-వరులునాదిగబ్రహ్మక్షత్రియవైశ్యశూద్రాంత్యజులయందున॥ బర॥ ౧॥
ఎన్నిసత్కర్మలొనరించిన-హెచ్చౌ-నింద్రాదిపదవులు గాంచిన - అన్ని
చదువులుచదవియును దా - నధికవిద్వాంసుండునైనను-నెన్నరాని కవీ
శ్వరుండై - యెన్నికృతులింపుగ రచించినఁ॥ బర॥ ౨॥ తల్లక్రిందైతప

ముసల్పిన – తనదు – తనువుబహుకాలంబు నిల్పిన–ఎల్లతటిశీతోష్ణగాడ్పు
ల– కెండవానలకోర్చిపవనము – పల్లవంబులు వేళ్లునీళ్లును–నుల్ల మొప్పభు
జింపుచుండిన॥ బర॥ ౩॥ కడుముద్రాసనయోగరీతులఁ – బట్టి – కష్టించి
నను బెక్కుసీతుల – నెడపకను జన్నీళ్ల బుడబుడ–నీరుకాగి విధంబుమునిఁ
గిన–మడుఁగుదరిబక మట్లుగుడగుడ–లాడుగుమంత్రములన్ జపించిన॥
బర॥ ౪॥ మరిలోకంబులనన్ని గెల్చిన–జన్మ – పరిబంధంబులు గెల్వవచ్చు
నా – సరసముగ శేషాచలార్యుల – పరమకారుణ్యంబు గలుగక–స్థిరము
సెందఁగఁదరమె – ధర–నరసింహదాసువచించు కై వడి॥ బర॥ ౫॥

వ. అనిన, భాగవతు లెట్టివా రనియడిగిన మనంబునకు బుద్ధి యిట్లనియె. 6

క. పరమార్థమెఱఁగి సర్వము,
పరమని యితరంబు మాని ♦ ప్రతిమార్చనలన్,
బెఱవేల్పులభ్రమ లుడిగిన,
వరభక్తులెజగతి భాగ ♦ వతులన మనసా. ౧

వ. ఓ మనసా, కొందఱుపామరులు పరమరహస్యంబగు వైష్ణవ ధర్మం బెఱుంగక – దేహమేతామనియెంచి, లోకడంబముగాఁ బ్రతిమార్చనలొనర్చుచుఁ, దులసిపేరులు వేసియుఁ, బట్టెనామంబులు వెట్టియుఁ, బట్టువస్త్రంబులుగట్టియు, వన్నెలచేమించి తాముసర్వము దెలిసిన వారివలెభాగవతులమని తిరుగుచుఁ దమ్మాశ్రయించువారలకు, "శ్లో॥ మాసపుష్పంద్రవం పీత్వాపాశానశ్యంనసంశయః." అనియును, "శ్లో॥ ఆదిధారపరబ్రహ్మ, మధ్యధారరమాపతిః. అంత్యధారమహాదేవ, మూత్రపానంతుముక్తిదం." అనియు, "శ్లో॥ మద్యం మాంసంచమత్స్యంచ, ముద్రామైధునమేవచ, మకారపంచకంచైవ, మహాపాతకనాశనం." అనియును, నేహ్యవస్తువులచే నేర్పఱచఁబడిన యిష్టాపూర్తులచేతను, దీర్ఘవల్లచేతను, ఘటపవిత్రంబగు ననియును, శాస్త్రనిషిద్ధంబులగు నిత్యాదిదుర్బోధలుచేయుచుఁ, 'దాఁజెడ్డకోఁతి వనమంతచెఱచె' నను సామ్యంబునఁ దాము చెడుటయేగాక, యితరులను దురాచారంబులం ద్రోసిచెడఁగొట్టుదురు. ఇట్టిదుష్కృయుల వలన రౌరవాది నరకంబులకుఁ బాత్రులగుదురుగాక, సద్గతికెక్కుడురే యనిపల్కి మఱియు నిట్లనియె. 7

## 7. తో హ రా.

భక్తిజ్ఞానవైరాగ్య తత్త్వత - త్పరులెభాగవతులనఁగ-
భుక్త్యాసక్తులుప్రతిమార్చకులే - భోగవంతులిలననఁగ॥ ౧॥
భాగవతార్థముఁ దెలిసినవారే - పరమభాగవతులనఁగ-
నేగతిగాననియహంభావులే - భోగవంతులిలననఁగ॥ ౨॥
పాటింపఁగనిలడంబరహితులే - పరమభాగవతులనఁగ-
బూటకమాయలవేషధారులే - భోగవంతులిలననఁగ॥ 3॥
పరసతిరతిమధుమాంసవర్జితులె - పరమభాగవతులనఁగ-
భూరిఁబూరిదుష్టాచారవర్తనులె - భోగవంతులిలననఁగ॥ ౪॥
మఱిశేషాచలగురుకృపఁజెందిన - బరమభాగవతులనఁగ-
నరసింహాఖ్యునిహితమాలింపని - నరులెభోగవంతులుగ॥ ౫॥

క. కొండబిలంబుల నడవుల,
నుండంగా నధికమేమి ♦ యుండవెపక్షుల్,
మెండుగఁ బాదపబిలముల,
నుండవెగిరిగుహలమృగము ♦ లొప్పుగమనసా. ౭

వ. ఓ మనసా, యింటనున్న మోక్షములేదనియు, విపినంబుల నివసించి యాకులలములుదిని చలియెండల వానల కోర్చి దీర్ఘతపంబులు సల్పువారికే మోక్షమనియుఁ గొందఱందురు. గృహముననున్న ముక్తిలేక కాననున్నఁ గల్గునట్లైన వనమందుండు పక్షిమృగాదులకు మోక్షంబు గల్గవలయు. జడభరతుండు మోక్షకాముఁడై తన సమస్తరాజ్యమును వర్జించి తపసియై గహనంబున వసించి, మొదట జింకజన్మంబును, దదుపరి విప్రజన్మంబును బొందుట కేమి హేతువు ? ఇంటనున్నను గాటనున్నను, మనసే ప్రధానంబుగాని, గేహారణ్యంబులు ముక్తికి మూలంబులుగావు - మనసులేనివాఁ డెందున్నను బ్రయోజనంబులేదు. కావున, 8

## 8. కీర్తన. నాదనామక్రియ రాగము - ఏకతాళము.

తన్నుఁదా నెఱుఁగనిమాయలేర - స్వరమునుడంబ - మనినిజముఁ గనుఁగొనవేర । మెతుకుదినక మౌనియున్న-నుర్వి - మేఁకలచందం బాకులుదిన్న - క్షితిఁగందమూలములుదిన్న-పూని - మితముగలఫలక్షీరములుపుచ్చుకొన్న॥ దన్ను॥ ౧॥ కొండబిలములదూరియున్న - ఘోర

దండకారణ్యమునఁ దపసియై యున్న - మెండుజడలనుదాల్చుకొన్న - మేటి - దండకమండలధారియై యున్నఁ॥ దన్ను॥౨॥ తలనుబోడిగఁ జేసికొన్న-కాయ-వలువల్ కౌపీనకంబళ్లు వేసికొన్న - ఇలను దిగంబరియై యున్న - భూతి - నలఁది లింగమురుద్రాక్షులుదాల్చుకొన్నఁ॥ దన్ను॥ ౩॥ పట్టెతిరుమణి పెట్టుకొన్నఁ-బట్టు - పుట్టములు తొలసిసరములు గట్టుకొన్న-దట్టికృష్ణాజినములున్న - నిష్ఠఁ - బట్టిభూశయ్యనుబవళించుచున్న ॥ దన్ను॥ ౪॥ క్షితినీరంబులపైఁగూర్చున్న - తాను - సతతంబుగగన సంచారియై యున్న - నతి యాచారములుసల్పుచున్న - రోసి సతిసుతుల నెడఁబాసి - సన్న్యసినన్నఁ॥ దన్ను॥ ౫॥ వర శేషాచలగురునిఁగన్న - ధాత్రి - నరసింహాఖ్యునివాక్య - సరళినివిన్న - మరియేమాయలు నిల్వవన్న-నింకఁబరమాత్మగన లేని-భ్రమ లెందుకన్న॥ దన్ను॥ ౬॥

క. ఎప్పటి తమతమపనులే,

మెప్పగు మనుజులకు నెల్ల ♦ మేలుగఁ దోఁచున్,

గొప్పదియగు పరమార్థము,

నెప్పటికిని మెప్పుసేయ ♦ రిలలో మనసా. ౧౦

వ ఓమనసా, సానదీర్చిన ముకురం బంధునకు నిష్ప్రయోజనంబగు చందంబునఁ బరమార్థంబు ప్రపంచజనులకు నిష్క్రియగానుండు. సూరిజనంబులకు నిస్సారమగు మాయాకల్పనలన్నియులోకంబునఁ బ్రాముఖ్యంబులై యుండు. ఉప్పుకప్పురంబు లొకరీతినున్నను రుచులు భేదంబగునట్లు, జ్ఞానికి నజ్ఞానికి రూపంబు లొకటిగానున్నను, వారివారిభావంబులు వేఱుగానుండు. ఎట్లనిన, జ్ఞాని నిత్యత్వంబు నొంది, యనిత్యంబగు సమస్తమున భ్రమ నివర్తించియుండు అజ్ఞాని నిత్యత్వంబు ఘటింపనేరక యనిత్యంబగు మాయనేనమ్మి భ్రమించుచుండుఁగావున వారిరువుర కేకత్వం బెన్నఁడుఁ గలుగనేరదు. వినుము.

**9. కీర్తన. నాదనామక్రియ రాగము - ఆదితాళము.**

అజపమంత్రసంధానంబిలలో - నందినవారేజ్ఞానులు - గుజగుఃనోటనురామాశివయని - గొణఁగినవారేహీనులు॥ అ॥౧॥ సార్థకమగు గురుపాదతీర్థమును - సల్పినవారేజ్ఞానులు-తీర్థయాత్రలకుఁ దిప్పలువడచును - దిరిగెడివారేహీనులు॥ అ॥ ౨॥ ఉపదేశంబనుపదమునఁ జెలగుచు-నుండినవారేజ్ఞానులు-నుపవాసములని యెండుచువ్రతముల-ను

డడివారేహీనులు॥ అ॥ ౩॥ నిక్కముగాఁదమలోనఁబరాత్పరు - నెఱిఁగినవారేజ్ఞానులు - టక్కప్రతిమలనునిక్కముగాఁగని - మ్రొక్కెడివారేహీనులు॥ అ॥ ౪॥ చదివియుఁజదువకసారార్థంబును - మదిగనువారేజ్ఞానులు - చదువులలోమర్మంబుదెలియకయె - చదివెడివారేహీనులు॥ అ॥ ౫॥ కరమరుదుగనిలజన్మశూన్యమును-గాంచినవారేజ్ఞానులు - తలుచుగఁగర్మలు సల్పుచుభవములఁ దగిలెడివారేహీనులు॥ అ॥ ౬। చెలువుగ శేషాచలసద్గురుకృపఁ - జెందినవారేజ్ఞానులు - ఇలలోనరసింహాఖ్యుభావముఁ-దెలియనివారేహీనులు॥ అ॥ ౭॥

క. కీలెఱిఁగియు గుణహీనులు,
వాలాయము విడరుపూర్వ ♦ వర్తనలెపుడున్,
బాలుంద్రావెడి శ్వానము,
చాలంగ నమేధ్యమునకుఁ ♦ జనదేమనసా, ౧౧

క. ఖరమున కెంతటిసాధన,
గఱపిననది ఘోటకంబు ♦ గానివిధమునన్,
ధర నవివేకికి జ్ఞానము,
గఱపిననతఁ డెపుడుఁగాఁడు ♦ జ్ఞానిగమనసా. ౧౨

వ. ఓ మనసా, నదీతటాకంబు లూరులకు జలంబు లొసంగునట్లును, మేఘంబులు లోకహితంబుగాఁ గురియుపోల్కిని, బాదపంబు లన్యులకు ఫలంబులిచ్చురీతిని, బుధజనంబులు తమవలెనే యెల్లవారును సుగతులు గావలెనను పరోపకారబుద్ధిచే జగంబునఁ బరహితము చాటిచెప్పినను నది గ్రహింపఁజాలరు. పిడుదు లాలపొదువులక్షీరంబులు గ్రోలక రుధిరంబుద్రావుచందంబునఁ, గొందఱు కుటిలాత్ములు గురునిచే బోధింపంబడియు నందలి యాదార్థ్యంబరయలేక, విపరీతభావంబుల నొందుచుఁ, దమకు సహజంబు లగు భ్రమలం దగిలి వర్తింతురు. అట్టి దుష్టాత్ము లెన్ని యుగంబులకైనను దరింపనేరరు. మఱియు, నట్టి క్రూరు లెన్ని వినయ భయభక్తులొనర్చినను, నార్యుండు వారి మనంబులు చక్కఁగాఁ బరిశీలింపక, త్వరపడి జ్ఞానోపదేశం బీఁదగదు. అట్లిచ్చినఁ జవిటినేలంబెట్టిన విత్తనంబుల గతి నిష్ఫలంబగు నని చెప్పి, మఱియు నిట్లనియె.

**10.** కీర్తన. నాదనామక్రియరాగము – ఆదితాళము.

ఎన్ని చెప్పినను బుధులవాక్యములు – హీనులెఱుఁగలేరు – సన్ను
తింపనలబధిరునిముందట–శంఖమూఁదినట్లు॥ ఎ॥ ౧॥ గురుమూర్తియుఁ
దమచెంతనుండియును – గుర్తెఱుంగలేరు–నిరతిశయంబుగనంధునెదుట
ను–నినుఁడుదోఁచినట్లు॥ ఎ॥ ౨॥ అహము లేనిపరమార్గము దెలిపిన–నహ
మువిడువలేరు–మహినిఁబాలతోఁబొగ్గునుగడిగిన – మలినముపోనట్లు॥ఎ॥
౩॥ కొదువలేనిపరమందియువంకర – గుణములడఁచలేరు – ముదమున
క్షీరముద్రావవిషముపా – మునకువదలనట్లు॥ ఎ॥ ౪॥ నిక్కఁపుబోధలు
విన్ననుసహజఁపు – టక్కుఁబాయలేరు – కుక్కతోఁక యొకగొట్టముఁ
జేర్చినఁ – జక్కగరానట్లు॥ ఎ॥ ౫॥ పరహితోపదేశంబునొందియును –
భ్రమలుడుల్పలేరు–చెఱకుపాలునిడి పెంచిన వేమును – జేఁదుమాననట్లు॥
ఎ॥౬॥పరమాత్ముండగు శేషాచలస – ద్గురునిఁగొల్వలేరు – స్థిరతరంబు
గాధాత్రిలోనరర – సింహదాసునట్లు॥ ఎ॥ ౭॥

వ. అనిన విని కులంబెట్టిది? దానిచందంబు వివరింపు మని
పల్కినమనంబునకు బుద్ధియిట్లనియె. 11

క. కులమెంచ శుక్లశోణిత,
కులమే యందఱును వేఱు ♦ కులమేదియిలన్,
బలు దేహనటుఁ బరాత్ముని,
కులమెయ్యది యంద ఱతని ♦ కులమే మనసా. ౧౩

వ. ఓ మనసా, ప్రపంచజనంబులకు భేదరహితంబగు సుజ్ఞా
నంబు లేమింజేసి, బ్రాహ్మణులయన్నంబు క్షత్రియ వైశ్యశూద్రాది స
మస్తవర్ణంబులు దినవచ్చుననియు, క్షత్రియవైశ్య శూద్రాదులయన్నం
బు బ్రాహ్మణులు దినరాదనియు, క్షత్రియవైశ్యులయన్నంబు శూ
ద్రాదులు దినవచ్చుననియు, క్షత్రియవైశ్యులు శూద్రాదులయ
న్నంబుదినఁగూడదనియు భేదంబులు నియమించుకొని, నాజాతి యె
క్కువ, నీజాతితక్కువయని కలహించుచుందురు. పూర్వయుగంబుల
నిట్లు లేదు. పుష్కరద్వీపవాసులందఱును వర్ణభేదంబులు లేక నటిం
చినట్లు దెలియవచ్చుచున్నది. రాజులయన్నంబు బ్రాహ్మణులు దిన
రానియెడఁ బాండవులరణ్యముననుండఁగా దూర్వాసుండు శిష్యజ
నంబులతో వచ్చివారింటభుజించుటెట్లు? శూద్రులయన్నంబు రాజులు

దినరానిచో, భీముఁడు, నేనుశూద్రుండనని చెప్పినప్పుడు, విరటుండు తనయింటవంట సేయుట కతని నెట్లునియమించుకొనెను? శూద్రులు వండినయన్నంబు రాజులు భుజించుటయు, రాజులయిండ్లబ్రాహ్మణులుగుడుచుటయుఁగలుగుటచే, జాతిభేదంబు లపుడు లే వనియే తోఁచుచున్నది. కావున, 12

11. కీర్తన. కాఫీరాగము – ఆదితాళము.

గుణమేప్రధానంబు–కులమేమికులము–గుణములేకున్నను – కులమేమిఘనము–గణుతింప విదురుండు – గలుగఁడే దాసికిని జనియింపఁడే వ్యాస – మునిబెస్తసతికిన్ – దనుజకులజులుగారె – దలఁపఁబ్రహ్లాదుఁడును – నను వొంద బలివిభీ – షణులాదిగాఁగన్॥ గుణ॥ ౧॥ పరికింప ధృతరాష్ట్ర–పాండు నృపతులు విధవ – తరుణులందునను–నుత్పత్తిగా లేదా – పరనాథులకుఁబంచ – పాండవులు గలుగరే – కరముకుంతికి వారు– ఘనులనఁగఁబడరే॥ గుణ॥ ౨॥ తలఁప క్షీరాబ్ధిలో – పలవిషమునుదయించి–కులమేమిఘనమయ్యె – గుణములేకున్నన్ – అలమొరపరాళ్లలో – పలభిదురమును బొడమి – కులహీనమేమయ్యె – గుణమొనరియున్నన్॥ గుణ॥ 3॥ మునువసిష్ఠుఁడు వేశ్య – కును జిలుకకును శుకుఁడు–శునికిశౌనకుఁడు ఖర – మునకుగార్గుండున్ – అనువొందజింకకును–నాబుఋశ్యశృంగుఁడను – మునియు గవికినిగౌతముఁడు పుట్టలేదా॥ గుణ॥ ౪॥ ఇరవొందవీరెల్ల నెట్లుపుట్టిననేమి – పరమార్థమునఁగాదె – బ్రాహ్మణులునైరి – స్థిరముగ నీహితము – శేషాచలార్యకృప – నరసింహదాసుమది – నాటివివరించెన్॥ గుణ॥ ౫॥

వ. అని తెల్పిన మహిమయెట్టిది ? తద్వృత్తాంతం బానతిమ్మనిన మనంబునకు బుద్ధియిట్లనియె. 13

క. కరచరణము లేర్పడుచును,
స్థిరముగఁబలు వన్నెలగుచు • స్త్రీపురుషులునై,
ధరనుద్భవించు కంటెను,
గరమరుదుగ మహిమయొకటి • గలదేమనసా. ౧౪

వ. ఓ మనసా, బీజంబున భూజంబగు మహిమగలుగు చందంబున, శుక్లరక్తంబులవలనఁ దనువులగు మహిమచెలంగె. ఆ మహిమ యిట్టిదని తెలియుట దుస్తరంబు. స్త్రీ రజస్వలయైన పంచమ

దివసంబు మొదలు, సప్తమ నవమ యేకాదశ మాది బేసిదినంబుల, హరినాడి పాఱునపుడు పిండోత్పత్తియైన పురుషశిశువగు. షడష్టదశ మాది సరిదినంబుల శశినాడి నడుచునెడఁ జూలైన స్త్రీశిశువగు. నింగితత్త్వమున నినుంజాడిన నపుంసకుండగు. నభోతత్త్వంబున విధుం దుండిన మాచకమ్మయగు. సుషుమ్నానాడియం దర్కేందులాడినఁ జపలాంగవక్ర బధిరాంధమూక లాదిగానగుదురు. శుక్లంబధికరించిన నల్లగాను, శోణితంబధికమైన నెఱ్ఱగాను, రెండును సమంబైనఁజామన వర్ణంబుగాను నేర్పడుదురు. పురుషుని వీర్య స్ఖలనంబగునపుడు చెదరి బిందుద్వయమై పిండకోశంబునంబడిన జంటబిడ్డ లగుదురు. వాయు తత్త్వంబున గర్భంబునుదాల్చినమగువ మిగులఁబ్రసవవేదనంబొందు. వహ్నితత్త్వంబునఁ జూలైనసతికి గర్భంబునిలువక చెడిపోవు. వినుము.

## 12. తోహరా.

స్త్రీపురుషులునై ప్రపంచమందునఁ - జిత్రముగానీరీతి-
నేపారఁగఁగర్మానుసరణిగా - నిలనుదయింతురుప్రీతి॥ ౧॥
కొందఱురాజులుకొందఱుమంత్రులు - కొందఱునౌకరులైరి-
కొందఱుధనికులు కొందఱర్థులును - గొందఱులేమిడులైరి॥ ౨॥
కొందఱుధరలోమాచకమ్మలును - గొందఱుషండులునైరి-
కొందఱువెఱ్ఱులుమూఁగలుబధిరులు - కుంటులంధులునునైరి॥ 3॥
ఇట్టి మాయాజన్మలకులోనై - యెసఁగుచునుందురుగాని-
పుట్టుగిట్టులెడఁబాయుమార్గమును - గట్టిగనెఱుఁగరుపూని॥ ౪॥
ఇల శేషాచలగురుకటాక్షమున - నెసఁగుచునిల్చినఁగాక-
ఫలమేమున్నది నరసింహాఖ్యుని - పల్కుదెలియఁగాలేక॥ ౫॥

వ. అనిన మనుజునకు భక్తిముక్తులు గల్గుక్రమం బెట్లనిన, మనంబునకు బుద్ధి యిట్లనియె. 15

క. భక్తితొలి పుణ్యవశమున,
ముక్తియు జ్ఞానోపదేశ ♦ ముననాఁకలిచే,
భుక్తియుఁ ద్రుపచేతజలా,
సక్తియుఁ గర్మమునఁగల్గు ♦ జన్మముమనసా. ౧౫

క. ముక్తికి మొదలిటిదరయఁగ,
భక్తియె భక్తికినిఁజాలు ♦ పనులేవియిలన్,

భక్తి పవిత్రముగావున,
భక్తినిమది నూనవలయుఁ ♦ బ్రాజ్ఞుఁడుమనసా. ౧౬

వ. ఓ మనసా, భక్తియనునది బాహ్యభక్తి, యనన్యభక్తి, యేకాంత భక్తియని మూఁడువిధంబులు. శ్రవణకీర్తన స్మరణ పాదసేవార్చన వందన దాస్య సఖ్యాత్మనివేదనంబు లను నవవిధంబులు గలది బాహ్యభక్తియనంబడు. భగవంతుఁడు జగన్మయుఁడనియు, జగము భగవన్మయమనియు, భగవంతునకంటె నన్యములేదని సుస్థిరత వహించుట యనన్యభక్తి యనంబడు. పెదవులఁగదల్పక పరమాత్మయం దారోహణావరోహణంబుల మనంబుఁగూర్చి తదేకనిష్ఠం జెందుట యేకాంతభక్తి యనంబడు. ఇట్టి భక్తింబూనక నరుం డఱువదినాల్గు విద్యలునేర్చుట, దండిపండితుండగుట, సమస్తభాషలఁ గఱచుట, కృతులిచ్చుట, మహిమలుసేయుట. నౌకరులుండుట, భూమి పండించుట, రాజ్యమేలుట మొదలైన సమస్తవృత్తులును బొట్టకూటికేఁగాని మోక్షంబునకుఁగావు. రాతియందుండు కప్పకుఁ దృప్తిగలుగదే? పశుపక్షి క్రిమికీటకాదులే యత్నంబులుచేసి జీవించు? కావున, నీవింకఁ గడుపుకూటికి వగవక జన్మరాహిత్యంబగు ముక్తిం గనుటకు యత్నింపుము. 16

## 13. కీర్తన. జంఝూటిరాగము – అటతాళము.

కోటివిద్యలైనఁబొట్ట – కూటికెగదరా– మేటిపరమార్థంబుఁ–బాటింపవేరా॥కోటి॥ ౧॥ తనువునమ్మఁబోకువట్టి – తంత్రజాలమురా – మనమునందునాత్మ – గనుటేమోక్షమురా॥ కోటి॥ ౨॥ జీవరూప మీవు మూఢ – చిత్తునివేరా – భావమందునఁదెలియ – నీవేదైవమురా॥ కోటి॥ 3॥ పాదుదెలియరాని పెక్కు – భ్రమతలేటికిరా – వాదభేదములేని–బోధఁగన్గొనరా॥ కోటి॥౪॥ ధరణిలోశేషాచలార్య – మఱవఁబోకుమురా – పరగనరసింహాఖ్యు భావంబువినరా॥ కోటి॥ ౫॥

క. విడవచ్చు సతిసుతాప్తుల,
విడవచ్చును జననిజనక ♦ విత్తగృహంబుల్,
విడవచ్చుఁ బ్రాణమైనను,
విడరా దెన్నఁడునుభక్తి ♦ విషయముమనసా. ౧౭

వ. ఓ మనసా, లోకంబున ధనమణి కనకాది సమస్త వస్తువులకంటెను బ్రాణంబెక్కువయనంబడు. అట్టి ప్రాణంబునకంటె జ్ఞానధనం బెక్కువయనంబడు, జ్ఞానధనం బన్నిటికిమించిన దగుటచేతనే బుధజనంబు లొరులకుఁ బ్రాణంబులైన నీ నేర్తురుగాని జ్ఞానవిత్తం బొసంగుట కెన్నఁడు సమ్మతింపరు. కాన నట్టి సర్వోత్తమంబగు జ్ఞానం బెట్టిదైనను స్వల్పంబుగాఁజూడక ఘనంబుగ నెంచి సేవించిన జన్మపావనం బగునని, మఱియు నిట్లనియె. 17

## 14. తో హ రా.

ధనముకంటెఁబ్రాణములెచ్చగుటనె - తస్కరులకుఁబొదివినను -
దనుజంపనలదనిధనంబొసంగు - జనుఁడటివినయంబుననుll ౧ll
మానుగనసువులకంటెజ్ఞానధన - మదిఘనమెట్లనవినుము -
ప్రాణమనిత్యముజ్ఞానధనముస్థిర - పదమగుకతమునఁగనుముll ౨ll
అట్టినిత్యమగుపదమదిగనుకనె - యార్యులందఱునుబూని -
పట్టుగఁదత్పదమందిరినిఖిలం - బస్థిరమంచునుమానిll 3ll
నమ్మముదృఢముగజ్ఞానతత్త్వమును - ననిశముశాశ్వతముగను -
నమ్మకుసతిసుతగృహవిత్తంబుల - నగలభూములాదిగనుll ౪ll
ఇలశేషాచలగురుకటాక్షమే - నిలుకడైనజ్ఞానంబు -
వెలయఁగనరసింహాఖ్యునివచనము - వినకుండుటెహీనంబుll ౫ll

క. నేననఁగా నే నెవ్వరొ,
తా నెవ్వరొగాన లేరు ♦ దబ్బరజనముల్,
నేనను భావముమానియుఁ,
దానను తన్నెఱుఁగఁదానె ♦ తానగు మనసా. ౧౮

వ. ఓ మనసా, కుంతీపుత్త్రుండగు కర్ణుండుతనవిధ మెఱుంగక తాను సూతకులజుండని తలంచినట్లులోకంబున మానవులు మాయం దగిలి, నేఁబ్రాహ్మణుఁడ, నేక్షత్రియుఁడ, నేవైశ్యుఁడ, నేశూద్రుఁడ, నేఁజండాలుఁడ, నేసతిని, నేఁబురుషుఁడ. నేఫలానావానిసుతుఁడ, నేశివుఁడ, నేరాముఁడ, నేఁగృష్ణుఁడ, నేఁభద్రుఁడ, నేఁగేశవుఁడనని చెప్పెడిపద్ధతుల నటించుచుఁ, దమ్మెఱుంగరు. అదియే కేవలమజ్ఞానమనంబడు. తమ్ముఁదా మెఱుంగక మఱపు తెఱపులచే, దేహతనూజహితబంధుకళత్రంబులం దాసక్తులై, దరిలేని సంసారసముద్రముఁ

మునింగి తేలుటయణవమలంబనంబడు. పరధనదారాపేక్షచేఁ బరులకుఁ గీడొనర్చుటయుఁ, దా సుఖవంతుండుగావలెనని తలంచుటయు మాయామలంబగు. పుణ్యాపాపంబులొనర్చి జననమరణాద్యవస్థలం బడుట కార్మికమలంబగు. ఈమలత్రయంబను మాయంబాయక, యేరికి జన్మరాహిత్యంబు గాంచరాదని పల్కి, మఱియు నిట్లనియె. 18

**15.** కీర్తన. ముఖారిరాగము – అటతాళము.

మాయగెల్వవశమా – యెవ్వరికైనఁ – గాయంబులివినిత్యమా– మాయగెల్వవశమా–మహి నెంతవారికి – న్యాయముగఁబరమాత్మనిల – నీ–కాయమునసేవింపకున్నను॥ మా॥ ౧॥ మాయమూయెఁగనుమా – త్రిమూర్తుల–కాయంబులనఘనమా – మాయమాయనుబుట్టె–మాయె సర్వమునాయె – మాయచేతనుదోఁచురూపులు – మాయగా భావింపనేరక॥ మా॥ ౨॥ కనుపించుచుండుమాయే – యదియంతలోఁ–గనిపించకున్నదాయెఁ – గనుకట్టుతలపోయఁ– గనుపించునీమాయ – గనఁగలేక దిగంబరులుసుర – మునులునాదిగ – మోసపోయిరి॥ మా॥ 3॥ కాలజ్ఞానవేదియై–నిర్గుణభావ–శీలుఁడై ధర వెలసినఁ–జాలఁబోకలశేషా – చలసద్గురు కృపఁగన్న – పోలకం నరసింహదాసుని – మేలువచనార్థంబు దెలియక॥ మాయ॥ ౪॥

వ. అనిన, యోగంబులెన్ని ? అవి యెట్లెట్లువర్తించు ననిన మనంబునకు బుద్ధి యిట్లనియె. 19

క. వినురాజ మంత్రలయహఠ,
ఘనయోగము లనఁగనాల్గు ♦ గతులగు నందు,
న్ననుపమము రాజయోగము,
కెనరావే యోగములును ♦ నెన్నఁగ మనసా. ౧౫

వ. ఓ మనసా, యోగంబు జ్ఞానయోగంబనియు, నభ్యాసయోగంబనియు రెండుతెఱంగులగు. అందుజ్ఞానయోగంబు పిపీలికమార్గంబనఁబడు. అదిసాంఖ్యతారకామనస్కంబు లన విలసిల్లు. అభ్యాసయోగంబు విహంగమార్గంబనఁబడు. అది మంత్రలయహఠయోగంబులన ముత్తెఱంగులంబ్రవర్తిల్లు. ఈముద్విధంబులయోగులకుం బంచముద్రాదిలక్ష్యంబులును, యమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహారధ్యానధారణ సమాధులుం బ్రాముఖ్యంబులై యుండు.

మఱియు వీరిలోఁగొందఱు జలంబులపైఁ బద్మాసనంబునఁ గూర్చుండుటయు, భూమిపైకి నుబికిలేచుటయు, నొకచోటఁగన్పించి వేఱొకచోటఁదోఁచుటయు, నభోగమనంబును, శాపానుగ్రహ సమర్థతయు, దూరశ్రవణ, దూరదృష్టియు, వాయుయోగ మనోయోగ పరకాయప్రవేశాది మహిమలంగలిగియుందురు. అందుచే, వీరు మాయకులే గాని, మహిమలనుమాయను వర్జించి బ్రహ్మస్వరూపులై మోక్షార్హు
లెన్నఁడును గానేరరు. కావున, 20

**16. కీర్తన. ముఖారిరాగము - అటతాళము.**

యోగాభ్యాసము లన్నిర్ఘూటరా - రాజ - యోగమొక్కటె ముక్తిబాటరా-బాగుగనలసాంఖ్య-తారకామనస్క-యోగంబులకు - రాజ-యోగ మాస్పదమిలను॥ యో॥ ౧॥ ధరనిష్టదైవముల పరముగాఁ-బరఁగు-వరబాహ్య మంత్రములు స్థిరముగా - నిరతంబుస్మరియించి-యిష్టసిద్ధినిఁగనుటె కరమొప్ప మంత్రయో - గంబనఁగ విలసిల్లు॥ యో॥ ౨॥ మానితముగషట్చక్రములను - హంసఁ - బూనియందందు నాపుచును-ప్రాణంబునందు న- పానమపానమునఁ - ప్రాణలయమొనరింపఁ-బడుటేలయ యోగంబు॥ యో॥ ౩॥ సకలేంద్రియములబంధించియు-హంస - సంచారమును నడ్డగించియుఁ-బ్రకటితంబుగఁ బ్రాణా-పానములనొకటియుం - దొకటికుంభించుటె - యుర్విహఠయోగంబు॥ యో॥ ౪॥ భాసిల్లు శ్రీ చెన్నపురమున-వెలయు - శేషాచలార్యునెమ్మనమున-వాసిగనరసింహ - దాసుసంసేవించి-భాసురంబుగఁ గన్న-పరమే సత్యంబెన్న॥ యో॥ ౫॥

వ. అనిన విని, ముద్రలవిఁగానెన్ని? అవిగాంచువిధం బెట్టిదనిన
మనంబునకు బుద్ధియిట్లనియె. 21

క. మఱిమధ్య లక్ష్యమన ఖే,
చరిభూచరి శాంభవియన ♦ షణ్ముఖియనఁగా,
ధరముద్రలైదు వానిని,
నరయఁగ నభ్యాసులకు ఘ ♦ నంబులు మనసా. ౨౦

2 వ. ఓ మనసా, అరగంటిచూపుచే నాదృక్కుముక్కుమధ్యఁ జేర్చి, యామీఁదనిటలంబుఁగాంచిన నదిమధ్యలక్ష్య ముద్రయనంబడు. అక్షులుమూసియైనను మూయకైనను, మనోదృష్టులు భ్రూ

మధ్యమున నిల్పి యూర్ధ్వముఖంబుగఁ జూచిన నదిఖేచరీ ముద్రయనంబడు. యుక్తమగు నార్యోక్తిని ఘ్రాణాగ్రమందు దృక్కునిచి చలింపని చిత్తంబున వీక్షించిననదిభూచరీ ముద్రయనంబడు. లోచనంబులు వికసింపంజేసి దృఙ్మనంబులఁ జిదాకాశమందుంచి చిదాత్మఁగలసి చిత్కళాదుల దర్శించిన నది శాంభవీముద్ర యనంబడు. ఘ్రాణకర్ణాక్షుల మూసి భ్రూమధ్యంబునఁజూపునిల్పి బాహ్యంబుమఱచి చూచిన నది షణ్ముఖీముద్ర యనంబడు. ఈముద్రాభ్యాసులకు యోగాసన, పద్మాసన, సిద్ధాసన, కుక్కుటాసన, కుర్మాసన, భద్రాసన, స్వస్తికాసన, సింహాసన, వీరాసన, మయూరాసనంబు లాది నభ్యసించుట ముఖ్యంబు. వినుము. 22

**17. కీర్తన. యదుకులకాంభోజిరాగము – అటతాళము.**

పంచముద్రలలోన–నెంచంగ షణ్ముఖియె – మంచి చోద్యము చూడఁగా–నంచితంబుగఁగర్ణ – నాసికాక్షులుమూసి – యాదృక్కు భ్రూమధ్య – మందు నిల్పిచూడఁ॥ బంచ॥ ౧॥ వింతగామృదంగ – వేణుఘంటాతాళ–వీణెతుమ్మెద ఝ్రమోంతలు – నెంతయును వరభేరి–నీరధులవలె ఘోష–లంతరంగమున – కానందముగ వినిపించు॥ పంచ॥ ౨॥ మెఱుపుఁదీఁగెలభాతి– మెఱుఁగుబుఱ్ఱలరీతి – మేఘతిమిరము లట్టులఁ–దరణిచంద్రులపోల్కిఁ – దారలట్టులఁ బుష్ప–తరుసాధవన పర్వతములచందముదోఁచు॥ పంచ॥ 3॥ జలధివీచులయట్లు – చలువ వలువలచొప్పు – వెలుఁగుదివ్వెలచాలుగాఁ – బలునీలములగతినిఁ – బండువెన్నెలయనువు–ప్రళయాగ్నివలెఁబెక్కు – భంగిరూపులుదోఁచు॥ పంచ॥ ౪॥ అరుదుగా శేషాచ – లార్య సత్కృపచేత – నట్టి వింతలనెల్లను–బరికించి యవియెల్ల – భ్రాంతిమూలంబనుచు–నెఱిఁగ నరసింహాఖ్యుఁ – డిపుడుపల్కిన రీతి॥ పంచ॥ ౫॥

వ. అనిన సాంఖ్యయోగంబననెద్ది? మఱి యీ విశ్వంబెట్లు త్పత్తియయ్యె? ఎఱిఁగింపుమనిన మనంబునకు బుద్ధియిట్లనియె. 23

క. పరికింపదేహ తత్త్వము,
తెరువెఱుఁగక సందియంబు ♦ దీఱదు తనువుల్,
బరిశోధించుట యదియే,
యరయంగా సాంఖ్యయోగ ♦ మనఁబడు మనసా. ౨౧

వ. ఓ మనసా, ప్రపంచసృష్టివిధమెట్టి దనఁగా: సృష్టికిమొట్ట మొదట లోకపరిపూర్ణబ్రహ్మముండె. ఆబ్రహ్మమందు, నిద్రనుండి వచ్చిన తెలివికైవడిఁ, ద్రిగుణరూపం బగు నొకమాయాశక్తిజనించె. ఆశక్తియం దీశానస్యముఖంబున శబ్దసహితంబుగా నాకసంబుపొడమె. ఆ నింగియందుఁ దత్పురుష ముఖంబను శబ్దస్పర్శయుతంబగు ననిలం బుదయించె. ఆగాలియం దఘోరముఖంబను శబ్దస్పర్శరూపాన్వితం బగు ననలంబొనరె. ఆయగ్నియందు వామదేవముఖంబను శబ్దస్పర్శ రూపరసమిళితంబగు నుదకంబుగల్గె. ఆజలమునందు సద్యోజాతము ఖంబను శబ్దస్పర్శరూపరసగంధ కలితంబగు పృథ్విపుట్టె. ఆధరయం దఖిలబీజంబు లుద్భవించె. ఆసస్యములచే సమస్తజీవయుక్తంబగు ప్రపంచంబుదోఁచె. ఇంక సాంఖ్యయోగ ప్రకారంబుఁజెప్పెద, వినుము.

**18.** కీర్తన. నాదనామక్రియరాగము - ఆదితాళము.

దేహంబు సంభవమైన - తెరువిట్టిదంచును వినర - మోహంబు లెల్లనుబాయు - మోక్షంబుచేరువఁగనర॥ దే॥ ౧॥ జ్ఞానంబుమనమును బుద్ధి-ఘనచిత్తాహంకారంబు-లానింగిచే నుదయించె - నగు-నంతరింద్రియములునివి॥ దే॥ ౨॥ వ్యానసమానోదాన - ప్రాణాపానంబులు తగనీ - యేనుంబవనముచేఁగల్గె - నిలపంచప్రాణములివియె॥ దే॥ ౩॥ చెవులుంజర్మంబునుగనులు - జిహ్వఘ్రాణము లీమైదు-భవమొందెఁబావకు వలన - మతిజ్ఞానేంద్రియములు నివియె॥ దే॥ ౪॥ రూపింపశబ్దస్పర్శ - రూపాదిరసగంధములు - నేపారజలమునఁబొడమె-నివిపంచతన్మాత్రలు నగు॥ దే॥ ౫॥ కరపాదయుగ్మమువాక్కు - గణుతింపగుద గుహ్యములు - ధరచేతఁబుట్టెనునివియే - తగఁబొకర్మేంద్రియములునగు॥ దే॥ ౬॥ అరుదార శేషాచలస - ద్గురుమూర్తి సత్కృపచేత-నరసింహదాసిలఁగన్న - వరసాంఖ్యయోగము మహిమ॥ దే॥ ౭॥

ద్విపద. ఘనమనమునకు సం ♦ కల్పంబు, బుద్ధి । కిని నిశ్చయము, చిత్త ♦ మునకుఁ జింతనము। గరిమహంకారము ♦ కభిమాన మెన్న। మరివిషయములగు ♦ మదికివిధుండు। తగబుద్ధికజుఁడు, చి ♦ త్తమునకు విష్ణు। వగు, నహంకారము ♦ కలరరుద్రుండు॥ చెలువుగ నధిపతుల్ ♦ చెవికిశబ్దంబు। గలయజిహ్వకురుచి, ♦ కనులకురూపు। త్వక్కుకుస్పర్శంబు, ♦ ముక్కుకుఁదావి । నిక్కము విషయముల్ ♦

దిక్కులుచెవ్రుల । కలచర్మముకనిలుఁ, ♦ డక్షులకర్కుఁ । డిలజిహ్వకు
వరుణుఁ ♦ డెన్ననాసికకు । నరుదారనశ్వినీ ♦ సురలధిపతులు। కర
ములకును బని, ♦ ఘనగుహ్యమునకు। వెలయనానంద, మం ♦ ఘ్రు
లకునుగమన । మెలమివాక్కుకుఁబల్కు ♦ లలరగుదంబు। కరయ
విసర్జన ♦ మగు విషయములు। వరపాణికింద్రుండు, ♦ వాక్కునకగ్ని।
ముదమొప్పఁగాశిశ్న ♦ మునకు విధాత । పదము కుపేంద్రుండు ♦
గుదముకు మృత్యు । దేవతయగునధి ♦ దేవతలిట్లు। భావింపఁదగు
సాంఖ్య ♦ పద్ధతిమనస॥ ౨౨

వ. ఓ మనసా, నభానిలాగ్ని జలభూభూత పంచార్ధార్థంబు లగు. జ్ఞానవ్యానాత్మరసపాయువు లితరభూతంబులం జెందని నిజాంశంబులై చెలంగు. తక్కినసఖండంబు లొక్కొక్కటి నాల్గు తెఱవులై యుపరినాల్గుభూతంబులం గలియుచున్నవి. వానివాని నిజాంశంబులతో నన్యభూత సంబంధాంశము లెఱింగింతు వినుము. జ్ఞానసమాన కర్ణ శబ్ద వక్త్రంబు లంబరాంశంబులగు మనోవ్యాన చర్మ స్పర్శకరంబు లనిలాంశంబులగు. బుద్ధ్యుదానాత్మరూపపదంబు లనలాంశంబులగు, చిత్తప్రాణజిహ్వారస శిశ్నంబు లుదకాంశంబు లగు, హంకారాపానఘ్రాణగంధ గుదంబు లిలాంశంబులగు, మఱియుఁ గామ క్రోధ లోభ మోహ మద మత్సరంబులు గగనోద్భవంబులగు. చలన గమనతీవ్ర భయలజ్జాహాసంబులు వాయు జనితంబులగు. క్షుత్తృష్ణానిద్రాలస్య సంగమధైర్యంబులు దహనోత్పన్నంబులగు. నిష్ఠీవన శుక్ల శ్లేష్మమూత్ర రుధిర మేధస్సు లప్పు సృజనంబులగు. మాంసచర్మనఖకేశ శల్యానాడు లవని సంభవంబులగు. ఇంకను నాగ కూర్మ కృకర దేవదత్త ధనంజయులను నుపవాయు పంచకంబు పవనసృష్టితంబులై
యొప్పు వినుము. 25

క. పరఁగషడూర్ములు వ్యసనము,
లరయఁగ ధాతువులు మదము ♦ లరివర్గంబుల్,
మఱికోశంబులు సప్త,
వరణగుణావస్థలంగ ♦ వర్గము మనసా. ౨౩

వ. ఓమనసా, దేహధారులకు క్షుత్తృష్ణలు ప్రాణధర్మంబు లగు. శోకమోహంబులు మనోధర్మంబులగు. జననమరణంబులు దేహ

ధర్మంబులగు. ఇవియే షడూర్మ్ములనంబడు. ద్రవ్యమార్జింపఁగోరుట, ధనవ్యయమునకువగపు, తస్కరించుట, జూదమాడుట, కల్లుద్రాగుట, వేఁటాడుట, వ్యభిచరించుట మొదలైనవి సప్తవ్యసనంబు లనంబడు. త్వఙ్మాంసరుధిరమేధో మజ్జాస్థిరేతంబులు సప్తధాతువు లనంబడు. కుల రూప ధన యౌవన విద్యా రాజ్య తపశ్శీలంబు లష్టమదంబులనంబడు. కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యంబు లరిషడ్వర్గంబనం బడు. సమిష్టితో నహంకారంబుగూడిన నన్నమయకోశంబును, ప్రాణములతో నహంకారంబు గూడినఁ బ్రాణమయకోశంబును, మనసు కర్మేంద్రియములతోఁ గూడిన మనోమయకోశంబును, బుద్ధిజ్ఞానేంద్రియములతో గూడిన విజ్ఞానమయ కోశంబును, చిత్తము జ్ఞాతతోఁ గూడిన నానందమయకోశంబునునగు. ఇవియే పంచకోశంబు లనం బడు. దుఃఖము, శరీరపరిగ్రహము, కర్మము, రాగము, అభిమానము, అవివేకము, అజ్ఞానము, అనునివి సప్తావరణంబులనంబడు రజస్సత్వ తమంబులు త్రిగుణంబు లనంబడు. జాగ్రత్ స్వప్నసుషుప్తు లవస్థాత్రయం బనంబడు. ఇన్నింటికి దేహం బావరణంబగుచుండు. ఆ దేహసంగతుం డగు జీవుం డజ్ఞానాంధంబున మునిఁగియుండు. అజ్ఞానము శరీరపరి గ్రహమువలనను, శరీరపరిగ్రహము కర్మమువలనను, గర్మము రాగ ద్వేషాదులవలనను, రాగద్వేషాదు లభిమానమువలనను నభిమానం బవివేకంబువలనను, నవివేకమజ్ఞానస్వప్నంబువలనను సంభవించె. అట్టి యజ్ఞానాంధంబు సుజ్ఞానంబను వెలుంగుంగాంచిన నశించు. అజ్ఞానం బడంగిన నవివేకము నూయు. అవివేకంబువాసిన నభిమానంబుగూలు. అభిమానంబుసెడిన రాగాదులు పొలియు. రాగాదులు విడినఁ గర్మం బులు నమయు. కర్మంబులుడిగిన శరీర పరిగ్రహంబుదొలఁగు. శరీర పరిగ్రహంబు మానని దుఃఖంబు హరించు. దుఃఖంబుదీఱిన జీవుండు శాశ్వతంబగు మోక్షంబు ఘటించు. వినుము, 26

క. ప్రమానుండఅవఁగ ననలము, సానుగ దధి దఱవఘృతము । సంభవమగున, ట్లే నిజముఁ గూర్చితెఱవక, మేనున జ్ఞానంబు వొడ ము ॥ మేలుగమనసా. ౨౮

వ. ఓ మనసా, మనజునకు విచారణచే జ్ఞానంబుగలుగుచున్నది. విచారణలేక యెంతటివారికిని జ్ఞానంబు గలుగనేరదు. ఈ దేహమందటి

స్తంభమువలెఁ గనుపించుచుండు. ఇంక నెఱుంగఁబడని శరీరములు మూఁడుగలవు. ఎవ్వియనిన: ఆకాశాది భూతంబు లైదింటిచే నైన యైదైదులిరువదియైదు తత్త్వంబులతోఁగూడి జీవుండు ముఖంబుననుండి, విశ్వాభిమానియై జాగ్రదవస్థయందు సమస్తకార్యంబు లాచరింపుచుండు. అదియే స్థూలాంగంబనంబడు. జ్ఞానేంద్రియప్రాణశబ్దాదులును మనోబుద్ధులుంగలసిన పదునేడు తత్త్వంబులతో నొప్పుచుఁ గంఠగతంబై తైజసనామంబున స్వప్నావస్థయందనేకకల్పనలం గాంచు. అదిసూక్ష్మదేహంబనంబడు. చిత్తము జ్ఞాతను జేరి హృదయంబుననిలిచి, ప్రాజ్ఞుండను పేర సుషుప్త్యవస్థయందెద్దియుం దెలియఁబడకుండు. అది కారణతనువనంబడు. జాగ్రత్స్వప్నసుషుప్తుల స్వయంభులై నిల్చిన వెలుఁగే మహాకారణ శరీరంబనఁబడు. అది హిరణ్యగర్భుం డను పేరంబరగు. ఆదివ్యశరీరంబు వడయునంతకు జీవుండు మోక్షార్హుండు గానేరఁడు. కాన,

## 19. శో హ రా.

జ్ఞానశరీరము వడయఁజాలక యోగజిబిజినొందుట మేలా —
మానుముచీ మనసాయీగతి — మాయలుచేసెద వేలా॥ ౧॥
తగజలమును విడిమృతముఁద్రావినను — దాహముదీఱునిభాతి —
జగతి నెట్టిమార్గములనటించిన — సద్గతిగల్గదుప్రీతి॥ ౨॥
కనినసతికెయాకాన్పువిషయ మెఱు — కగువంధ్యకు నే మెఱుక —
అనుభవజ్ఞునకుఁగాక యీ జ్ఞానం — బన్యులకదియే మెఱుక॥ ౩॥
భ్రమసియురులఁజిక్కంబునఁజిక్కిన — పక్షిరీతిగాఁ జెలఁగు —
భ్రమయను పెనుచిక్కంబునఁదగిలిన — భ్రమికులకేగతిగలుగు॥ ౪॥
అనవరతము శేషాచలసద్గురు — నాశ్రయించిన దెభక్తి —
ఘనతమిూఱనరసింహదాసుమదిఁ — గాంక్షించిన దేముక్తి॥ ౫॥

క. కనుపించు స్థూలదేహం, బునఁగల్గునుసప్తచక్ర • ములున విమఱియుఁగా, గనుఁగొనమర్మభ మెంతయు, ననుపమగురుకరుణ లేని • నరులకు మనసా. ౨౫॥

వ. ఓ మనసా, శరీరమర్మంబు లరసిచెప్పుట బ్రహ్మాదుల తరంబుగాదు. ఈతనువున డెబ్బదిరెండు వేల నాళ్లుగలవు. మరి, యందు, నిడానాడి వామనాసికంబునను, పింగళానాడి దక్షిణ భాగమందును, సుషుమ్న మధ్యభాగంబునను భాసిల్లు. హస్తినాడి జిహ్వాయందును

దక్షిణనేత్రమందును జెలంగు. శంఖినినాడినాభియందును,గాంధారీనాడి యెడమకంటియందును, బూషానాడి దక్షిణకర్ణమందును. యశస్వినీ నాడి యెడమచెవియందును, నలంబుసానాడి లింగమందును, గుహూ నాడి గుదమందును గలిగియుండును. ఈచెప్పిన నాడు లెల్లను ముఖ్య నాడు లనంబడు. అందు నిడా పింగళా సుషుమ్నలను నాడులు మూఁడును సమస్తనాడులకు శ్రేష్ఠంబులగు. అందుఁ బింగళ సూర్య నాడియగు. అదియే యమునయనంబడు.ఇడచంద్రనాడియగు. అదియే గంగ యనంబడు. సుషుమ్న యగ్నినాడియగు. అదియే సరస్వతి యనంబడు. ఇడా పింగళ సుషుమ్నలు గూడినస్థలమే భ్రూమధ్యమన నొప్పు. అదియే ముత్యేటి సంగమమనియుఁ ద్రికూటమనియుఁ జెప్పం బడు. ఘ్రాణ కర్ణరంధ్రంబులు భ్రూమధ్యము దిగువం గలిసియుండు. అట్టిచోటే శృంగాటకమనియుఁ జతుష్పథమనియువాడంబడు. ఇన్నిం టికిఁ గారణుండై పరమహంస స్వరూపుఁడగు పరమాత్మ మడాధార ములకుఁ దంత్రీవిధంబుయు, యిడాపింగళ ద్వారంబులఁ బవనాకృతి యగుచు, దివారాత్రులుగల దినమునకు నిరువదియొక్క వేయిన్నాఱు నూర్ల హంస లంతర్బాహ్యంబుల నడుచుచు స్వప్రకాశంబై, తా నగ్నిం గాలక, నీటమునుఁగక, రాతింబగులక, కత్తిందెగక, త్రాటంగట్టు వడక, దేననునాశము లేక, సమస్తముసకుఁ బరంబై వెలుంగు. కావున,

**20. కీర్తన. నాదనామక్రియరాగము – ఆదితాళము.**

పరముఁజెంద వే–మనసా–స్థిరముఁనొంద వే – అరుపుగ గుదమను – నాధారంబున–నిరునిరుదళములస్వరములునాల్గై – ధరణిసదనమై – హరి ద్రూపమై–స్ఫురణకుమిన్నగు – భూలోకంబున–నరుదారఁగ గణ–నాథు నకార్యార్ –హంసలునిరతము–నర్పణఁజేయుచు॥పర॥ ౧॥ సారగలింగ– స్వాధిష్ఠంబున–నాఱుదళంబుల – నాఱక్షరముల– వారినిలయమై – వన్నె ధవళమై – భూరితరంబగు–భువర్లోకమున – భారతీసతియుత–బ్రహ్మకునా ర్యేల్ –హంసలునిరతము – నర్పణఁజేయుచు॥ప॥౨॥మణినాభిశల – మణి పూరకమున – సదశదళము ల – క్షరములుపదియై – మణిశిఖికనుమై– యరుణవర్ణమై–సురుచిరంబునగు – సువర్లోకమున – విరివి రమాయుతు విష్ణునకార్యేల్ హంసలునిరతము–నర్పణఁజేయుచు॥ పరమ॥ 3॥ అరయ హృదయమున–ననాహతంబున – ని రాఱుదళము–లక్షరద్వాదశమైకరు

వలికిరవై - కాంతిధూమ్రమమై - మజిభాసురమగు-మహర్లోకమున-వర గోరీయుత - హారునకునార్వేల్ - హంసలునిరతము - సర్వుణంజేయుచు॥ పర॥ర॥ విరివిగగళమను-విశుద్ధమందున - నిరుదచ్చులను - సర్వషోడశమై - నెఱిజడలునికై -నీలవర్ణమై-సరసపథంబగు-జనర్లోకమునం-జిర మాయాయుత-జీవికిసహస్రహంసలునిరతము - సర్వుణంజేయుచు॥ పర॥ ౫॥ అలరంద్రిపుటియను-నాజ్ఞేయంబున- దళములరెంటను-ద్వయాక్షరంబై -పలుభూతములై - పరంజ్యోతియై-తలంపంగమణివోల్ - తపోలోకమున - నలత్రిశక్తిసహి - తాత్మకుసహస్ర-హంసలునిరతము - సర్వుణ సేయుచు॥ పర॥ ౬॥ బ్రహ్మరంధ్రమను - సహస్రారమున - సహస్రదళములు-సర్వవర్ణములు-సగుణాగుణముల-సత్యలోకమునసమస్తశక్తి-సహితుండు శేషా - చలసద్గురునకు-సహస్రహంసలు- సర్వుణసల్పంగ-నరసింహాఖ్యుండు॥ పరమ॥ ౭॥

వ. అనిన విని కుతూహలంబునం దారకయోగ విధం బెట్టిదో యెఱింగింపుమనిన మనంబునకు బుద్ధి యిట్లనియె. 29

క. తారకము పంచభూతా, ధారము బ్రహ్మాది జీవ తప నేందుల కా, ధారము దానిం గనుటయె, తారక యోగంబనంగం దనరును మనసా. ౨౬

వ. ఓ మనసా, కొందఱు సర్వాధారంబగు తారకబ్రహ్మ మెఱుంగక, పంచముద్రలందుంగాంచు చిత్కళలే తారకంబని చెప్పుదురు. అది విపరీతంబు, జాగరంబునముద్రలరయునపుడు చిత్కళలనేకంబులు గన్పించుటసత్యమే. ఐనను జూడకున్నప్పు డెద్దియుంగనుపించదు. నిద్రయందుంజూచునది తోంచునదిలేదుగాన, నదెట్లు తారకంబగు? కలనినురజాగారములకు నాధియై, సర్వకాల సర్వావస్థలంగలిగి, యెల్లప్పుడొక్కవిధంబున నున్నదే తారకంబనంబడు. కావున, ౩౦

## 21. కీర్తన. శుద్ధకాంభోజిరాగము - ఆదితాళము.

తారకమె తారకముచూడంగా - నీరేడుజగములకు-తారకమె తారకముచూడంగా॥ తా॥ ౧॥ తారకంబుగాత్రములకుం - దారకంబు సూత్రములకుం - దారకంబుమంత్రయంత్ర తంత్రములకును - దారకంబుధీరులకుం - దారకంబుశూరులకుం-దారకంబుచోద్యములకు-సారము లకుసారమైన॥ తా॥ ధాతవిష్ణుశంకరేంద్ర - తరణిచంద్రబుధుకదైత్య -

భూతబేంద్రగరుడసిద్ధ - పుంజనిర్జరా - భూతపంచకంబు నాది-భువన జాలమెల్లనిండి - జ్యోతిరూపమగుచు నొక్క - రీతిగాను వెల్గుచున్న॥ తా॥ 3॥ పొలుపుమీఱజీవకోట్ల - బొమ్మలుగను జేసిమాయ - నలరదెఱఁగఁ జాటుచేసి-యఖిలరూపులఁ - గలిగియిలకు నాటకంబు-గాఁగనిల్పి యెవ్వ రికినిఁ - దెలియరాక భూతకోట్లఁ - జెలఁగియాడఁ జేయుచున్న॥ తా॥ ౪॥ స్థిరముగాను శేషాచల స-ద్గురునికరుణఁ దారకంబెయరయఁగల్గుఁగాక నేరి-కడ్డు లేకయీ-ధరణిలోననారసింహ - దాసునకును హితవుగాను- నిరతమాత్మరతినిఁ జెంది - నిల్వకున్నఁగలదెముక్తి॥ తా॥ ౫॥

క. జననమరణాఘభయజర, లను మనుజత్వంబు విడుచు ♦ నాత్మకుసుఖదం, బునుగల్గుఁ దారకామృత, మునుసేవించిన సుర త్వ ♦ మొనరును మనసా. ౨౭

వ. ఓ మనసా, జనులకభీష్టంబు లిచ్చునెడనిలఁగల సమస్త వేల్పులును, గల్పవృక్షంబు, కామధేనువు, చింతామణి మొదలైనవి యెవ్వియుఁ దారకంబునకు సమంబులుగావు. తారకమంత్రంబుస్మరించు వారివంక యమకింకరులు రానోపరు. మద్యపానానృతజారచోరాది పాతకంబులం బాపనోపు, మాతాపితార్భక గురుబంధుస్త్రీ గోహత్యలాది మహాదోషంబులనైన మాపంజాలు. గుణత్రయ, తాపత్ర, యేషణత్రయ, వాసనాత్ర, యావస్థాత్ర, యారిషడ్వర్గసప్తవ్యసనాష్టమదంబులాదిగాఁగల మాయలంద్రోసి వేయనేర్చు. దానిచేఁ దెగకుండ నట్టిదురితంబు లెందునుంగలుగనేరవు. కాని, తారకామృతంబుసేవించుభక్తులకుఁ బాపంబుగలదనివచించు పాపులపాపంబు మాత్రమెప్పుడును హరింపంజాలదు. వినుము. ౩౧

## ౨౨. కీర్తన. భైరవిరాగము - రూపకతాళము.

జీవానీదోషంబులఁ జీరంగలదేతారక - భావంబదియేమారక సేవింపుము నీవెప్పుడు॥ జీవా॥ ౧॥ తను వేనేనంచును మది-దలఁచ టహితవే చూడఁగ - నిను నీవేవీక్షించిన - నిలువదు నీకీభ్రాంతియ జీవా॥ ౨॥ ఎన్నాళ్లిలజీవించిన - నున్న దెగదచావెప్పుడో - ఉన్నఁ ఫల మున్నదెతాఁ - దన్నెఱుఁగక॥ జీవా॥ 3॥ మాయావారాశింబడి - మగ త్వంబును జెందుట - న్యాయంబేదరిఁ జేరును-పాయంబిసుమంతెఱుఁగి

జీవా॥ ౮॥ తేకువ శేషాచలగురు - దేవునిమిదిఁగొనియాడుచు-శ్రీకరమ గుభక్తినినర - సింహఖ్యునివాక్యము విను॥ జీవా॥ ౫॥

వ. అనిన నాకర్ణించి మహాదానందంబునొందుచుఁ దారక మంత్రరస్యంబుఁ దెల్పు మని వేఁడిన మనంబునకు బుద్ధి యిట్లనియె.

క. పలుకఁగ రానిదినోటను, వెలయంగా నెట్టియెడల ♦ విడ రానిదిపో, తెలిసిన సులభంబగునది, యిలఁదారక మంత్రమనఁగ ♦ నెసఁగును మనసా. ౨౦

వ. ఓ మనసా, యీనవద్వార కాయాపురంబున హృదయాంతరంబను సరసునందొక యష్టదళపద్మంబు విలసిల్లు. అందొకహంస పరంజ్యోతి స్వరూపమై వెలుంగుచు, జరామరణ క్షుత్పిపాసలు లేక మారుతచలనంబున నొక్కొక్కయెడ నొక్కొక్కదళంబంటి చరించుచుండు. ఇంద్రుని దిశనంటినతఱిఁ బుణ్యవిచారంబును, నాగ్నేయదిశఁ దాఁకిన భుజించు తలంపును, యమదిశఁబొఱినఁ బాప చింతయు, నైరృతిదిశ కేగిన రతిచింతయు, వరుణదిశకరిగిన నిద్రించు చింతయు, గాడ్పుదెసనడిచిన గమనచింతయుఁ, గుబేరునిదిశఁజొచ్చిన ద్రవ్యమార్జించుచింతయు, నీశాన్యదిశకుంజనిన వైరాగ్యచింతయుఁ, గమలమధ్యంబున నిల్చిన మోక్షచింతయుఁ గల్గు. ఆ పరమహంస విశ్వమునందుండి యంతరమున కేగుటే పూరకంబనఁబడు. అది యట లయించుటే యంతరకుంభకంబగు. అంతరమునుండి బాహ్యమున కరుదెంచుట రేచకంబగు. అదియం దడంగుటే బాహ్యకుంభకంబగు. పూరకంబున సోకారంబును, రేచకంబున హంకారంబును గూర్చినఁ దారకమంత్ర రహస్యంబగు. దీనినే తిరుమంత్రమనియు, నజప మంత్రమనియుఁ, బ్రణవమంత్రమనియుఁ జెప్పుదురు. మఱియు నే కాక్షరి, త్ర్యక్షరి, చతురక్షరి, పంచాక్షరి, షడక్షరి, యష్టాక్షరి మొదలగు సప్తకోటిమహామంత్రంబులును, దారకమంత్రంబునకు సమంబులుగావు. అది మంత్రంబగు తారకమంత్రం బఖిలమంత్రం బులకు మూలమంత్రంబు. వినుము. 33

## 23. కీర్తన. మోహనరాగము-చాపుతాళము.

పెదవులుగదలకజిహ్వతోనాత్మ-జపించినఁదారకమంత్రమదిఁ - గదిపియులోవెలిఁగదలెడుగాలినిఁ - గలసినతారకమంత్రమది॥ పె॥ ౧॥

గుఱుతుగస_ప్తకోటిమంత్రములకును మూలంబగుమంత్రమది - గురు భక్తులు నెదమఱవకయనిశము - గోప్యముగాజపియించునది॥ పె॥ ఇతర మంత్రజ్ఞులకెల్లను - నెంతయునందఁగరానిదది - మతవర్ణాశ్రమశాస్త్ర వాదులకు - హితవును దెలియక యున్నదది॥ పె॥ ౩॥ చెలువుగ శేషాచల గురుకరుణను - జెందినవారికిసులభమది - తలపోయఁగ నరసింహదాసు మది-నిలిచితరింపఁగఁజేసినది॥ పె॥ ౪॥

క. ఊహా పోహ లవేలా, మోహాదుల చేతమాయ ♦ మునుఁగఁగనేలా, దేహంబగు గుడిలోపల, సోహంబను దైవమెంచి ♦ చూడుము మనసా.

వ. ఓ మనసా, విశ్వంబునఁ గొందఱు పామరులు గురుముఖంబున సోహం భావరహస్యంబరయనేరక, సోహమను పల్కుమాత్ర మెఱింగి, కర్మేంద్రియంబగు నోట సోహంసోహంబని మాటిమాటి కుచ్చరింతురు. మఱి యది కర్మకేమూలంబగుఁ, గాని జ్ఞానమునకు మూలంబుగానేరదు. సోహంబనుక్రియఁ దెలిసి, పెదవులను బంధించి జ్ఞానేంద్రియంబగు జిహ్వననుసంధానంబు గావించుటే జ్ఞానయుక్తంబగు. అన్యకృత్యంబులు వృధాయాసంబు లనిచెప్పి, మఱియు నిట్లనియె.

## 24. కీర్తన. మధ్యమావతిరాగము - అటతాళము.

సోహమేభావించవే - నీలోమనస - దేహభ్రాంతులడంచవే-సోహమేభావించుమింకొక - జోలిలేకయెమానసంబును - సోహముసంధానపఱచిన - సూత్రమదియే తారకంబగు॥ సో॥ ౧॥ వట్టి భ్రమలను జిక్కకే-ధనమెంతొగలదని- మిట్టిపాటుననిక్కకే-చుట్టునీటద్దములుదాఁపిన-చట్టమగుసౌధములలోపలఁ - బుట్టి పెరిఁగినరాజులైనను-గిట్టుటెఱుఁగవె వట్టిదంతయు॥ సో॥ ౨॥ భక్తిమార్గముఁదప్పకే - గురుమర్మమునెడి-యుక్తిఖలులకుఁ జెప్పకే-భక్తిచేతను మూఢులైనను-ముక్తిఁగందురుగాకజగమున-శక్తియుక్తులచేత మోక్షము - సాధ్యమునుగాదెంత వారికి॥ సో॥ ౩॥ మిట్టిపరులనుదిట్టకే - పరులెన్ని నిన్నుఁ-దిట్టినను మదిఁబెట్టకే-దిట్టముగ శేషాచలార్యులఁ - బట్టుగానెఱనమ్మిమదిలో- గట్టిగానరసింహదాసిల - గుట్టెఱింగినయట్టి భావము॥ సో॥ ౪॥

వ. అనినఁ బరమాత్మ జీవాత్మలవిషయంబు లెట్టి వనిన మనం
బునకు బుద్ధియిట్లనియె. 35

క. పరమాత్ముండన నొక్కఁడె, ధరజీవులు పెక్కులగుచుఁ ♦
దనరుఁబరాత్మన్, మఱియేజీవుఁడు గాంచునొ, సరగున నాజీవుఁడొం
దు ♦ సద్గతి మనసా. ౩౦

వ. ఓమనసా, యీ దేహంబున జీవాత్మపరమాత్మలన ద్వివిధమైయుండు. జీవాత్మసగుణుండగు. పరమాత్మ నిర్గుణుండగు. ఎట్లనిన: స్కాంతంబు చెంత నయస్సు చలించుమాడ్కిఁ బరమాత్మ సాన్నిధ్యంబున జీవుండు చలనుండై. త్రిగుణంబులొంది, దేహేంద్రియవ్యాపార సహితుండై శిశ్నోదరాది సుఖంబులఁ దృప్తుండగుచుఁ గలగాంచు, నిద్రించు, మేల్కను, ధనధాన్యంబులార్జించు, భుజించు, పానంబుసేయు, భూషణాంబరములధరించు, రతిసుఖంబులం జెందు, కష్టంబులొందు, సంతోషించు, నేడ్చు, చచ్చు, స్వర్గనరకంబులంబడు, నానావిధగర్భనరకంబులంజెందు, జననంబునొందు, భ్రమలంబొందు, బంధంబునంబడు, మోక్షంబుఁగాంచు. ఇవియెల్లను జీవగుణంబులగు. ఏటియం దోడ నడుచుచున్న, నదిపొంతవృక్షములరిగిన గతిఁ దోఁచు పోల్కిని, దివంబున మేఘంబేగుచున్నఁ జంద్రుండు నడిచినట్లుదోఁచు భాతిని, నల్లి బిల్లి దిరుగుచున్న గృహభూజ భూదిశలు దిరిగినట్లు దోఁచురీతిని, బుట్టుట పెరుగుట, వివిధకార్యంబులొనర్చుట, చచ్చుట మొదలైన సమస్తము జీవసంగతంబగు దేహంబునొందుచుండ, నఖిలమాత్మయే పొందునట్లు తోఁచుచుండుఁ, గాని పరమాత్మ కెద్దియుం గలుగనేరదు. వానిసందర్శనంబు గల్గినజీవుం డవికారుండగు. కావున,

## **25.** తో హ రా.

పరమాత్మను వీక్షింపుముతగజీ – వాదిభ్రాంతులును మాయు–
పరికింపఁగనిఁకజన్మబంధములు – బాగుగనిన్నెడఁబాయు॥ ౧॥
చెలువుగవిషయేంద్రియముల చేతను – జిక్కిభ్రమించెద వేల–
కలకాలంబీరీతిమాయఁబడి – గాసిల్లుట యదిమేలు॥ ౨॥
ఘనపరమాత్మనుజెందినఁబాలను – గలసిన జలములకరణి–
నెనయఁగనీవాపరమునఁ గలసిన – నిత్యుఁడవగుదువుధరణి॥ 3॥
అనలముగూర్చినఁ గాష్ఠములేకయె – యనలంబేయగురీతి–

ననువుగజ్ఞానమ్మున నిల్చినమది - నగునిర్మలముగుజ్యోతి॥ ౮॥
వరశేషాచలగురుసత్కరుణను - మఱవకమదిలోనుంచి-
ధరలోనరసింహాఖ్యుని వచనము - తప్పకవినుముగణించి॥ ౯॥

క. మేనను నీవ్వగమందున, దానను పరమాత్మగనినఁ దత్త్వజ్ఞుండౌ, కానినివాఁడే జడుఁడ, జ్ఞానము సమయించియాత్మఁ గాంచుము మనసా. ౩౧

వ. ఓ మనసా, యాత్మనిజం బరయులేని మూఢులు కొంద ఱది ప్రాణవాయువందురు. మఱికొంద ఱాత్మ యన్నమయమనియుఁ, గొందఱు ప్రాణమయమనియుఁ, గొందఱు మనోమయ మనియుఁ, గొందఱు విజ్ఞానమయ మనియుఁ, గొంద ఱానందమయ మనియు నానా విధంబులఁ జెప్పుచుందురు. గుదంబున నపానవాయువును, నాభి యందు సమానవాయువును, గంఠమున నుదానవాయువును, సర్వాంగ మున వ్యానవాయువును హృదయంబునఁ బ్రాణవాయువును వర్తించు. అందుఁ బ్రాణవాయువు రేయుంబవళ్లు యంత్రంబుగతి నీరుగుండెలోఁ డక్కుటక్కునఁ గొట్టుకొనుచుండు. అదియెట్లు లాత్మయనందగు? పంచ ప్రాణంబులకును, బంచకోశంబులకును త్రిగుణంబులకును, నవస్థాత్రయంబునకును, దేహేంద్రియాది సమస్తమునకును వేఱగు చున్నదియే యాత్మయనంబడు. లేనిదే యున్నట్లు గారడిమాయగాఁ దోఁచు, సూర్యచంద్ర నక్షత్రంబులును, బంచభూతంబులను, సాగర పర్వతంబులును, బీజలతా వృక్షంబులును, నరసుర పశుపక్ష్యాది సమస్తప్రపంచమును జూచుటవలనఁ బ్రయోజనం బించుకైన లేదు. ఇన్నింటిఁబ్రకాశింపఁజేయునాత్మఁ జూచుటయే ప్రయోజనంబు. కాన,

## 26. శ్రీరాగము - ఆదితాళము.

ఆత్మఁజూడుమా యీయాత్మభావంబుకంటె - నధికంబునేది యనరాదు - ఇలను॥ ఆ॥ ౧॥ ఆత్మయేమునులు - హరిహరవిధాత-లాత్మయేయింద్రుఁ - డమరాళిదైత్య - లాత్మయేమర్త్య - లర్కేందు దిక్కు-లాత్మయేజలధు - లఖిలప్రపంచ॥ మా॥ ౨॥ ఏమనఁగరాని - దెన్నంగనాత్మ - కామాదివర్గ - మేమింతలేక-నామంబురూపు-ననరాక యెప్పు-డేమఱుఁగులేక - యింపొందుచుండు॥ నా॥ ౩॥ జననంబుగాదు-దనరంగనాశ - మునుబొందదెప్పు-డనుపొందమూఢ-జనులకునుజూడఁ

గనరాదుమామ - లనుజెందఁబోదు గనవచ్చునంసు॥నా॥ ౬॥ సురిత్రం
ధతరణి-గురుమూర్తిసుమణి - వరకరుణఁగన్న-నరసింహదాసు-కిరవైన
స్త్రోత్ర - బరికించిచూడఁ-బరమార్థమెన్న - నరుదైనభావ॥ మా॥ ౭॥

క. వాదంబుల వర్జించియు, భేదంబులు మానియాత్మ ♦
భిన్నులుకాకా, వేదవిచారకుశలులై, వేదార్థముఁ దెలియువారె ♦
వేత్తలు మనసా. 32

వ. ఓ మనసా, గూఢంబులగు వేదశబ్దంబుల నిజార్థం బెఱుం
గక పెడయర్థంబులుసేసి భాషించు బేలల వచనంబులు చిల్క-
పల్కులవంటి వనంబడు. 'ప్రజ్ఞానంబ్రహ్మ' మని ఋగ్వేదంబును,
'అహంబ్రహ్మాస్మి' యని యజుర్వేదంబును, 'తత్త్వమసి' యని
సామవేదంబును, 'అయమాత్మాబ్రహ్మ' మని యథర్వణవేదంబును,
ఘోషింపుచుండ, నాయర్థంబు వివరింపంజాలక మూఢు లనేకవిధం
బుల భావింతురు తత్త్వవేత్త లట్టి నిజార్థంబు గ్రహించి సమస్తభూత
మూలంబగు నాత్మయె పరబ్రహ్మంబనియుఁ బరబ్రహ్మమే యాత్మ
యనియు నిరంతరము సేవింతురు. అట్టివారలే జ్ఞానసిద్ధులై లోకం
బునఁ బ్రసిద్ధికెక్కిరి. కావున, 38

## 27. కీర్తన. భైరవిరాగము - అటతాళము.

అలనాల్గువేదముల-యర్థంబువివరించి - యాత్మభావముగానరా
జీవాజీవ॥ అల॥ ౧॥ పరమార్థముదెలియఁ-బడనియజ్ఞానాంధ-మరయక
చేరనేలరా జీవాజీవ॥ అల॥ ౨॥ దేహంబునసున్న - దేహివీవేచూడ-
దేహమెన్నఁడుగావురా-జీవాజీవ॥ అల॥ ౩॥ బ్రతికేమిఫలమాత్మ - రతిని
జెందకయుస-ద్గతియెట్లుగల్గునీకు - జీవాజీవ॥ అల॥ ౪॥ ఘనమైనదుర్భ్రమ
మల-మునిఁగి తేలుచునిట్లు-కడగండ్లఁబడనేలరా-జీవాజీవ॥అల॥ ౫॥ ధర
శేషాచలస-ద్గురుకరుణనరసింహ-దాసుగాంచినభావము-జీవాజీవ॥ అ॥

క. వెలయఁగఁ దనువేలోకము, సలలితముగ నింద్రియములె ♦
శాస్త్రములగుఁబో, పలువిషయములె పురాణము, లలరఁగ వేద
ములెపల్కు ♦ లనఁబడు మనసా. 33

వ. ఓ మనసా, వేదంబులు కర్మకాండమనియు జ్ఞానకాండ
మనియు రెండువిధంబుల వివరించుటచే, నెవరైనను దొలుతఁ గర్మంబు

ననుసరించి, పిదప జ్ఞానంబు వహింపవలయు. ధర్మంబట్లుండ, వేదంబులు బ్రాహ్మణులే పఠింపవచ్చునుగాని, తదితరులు చదువరా దని కొందఱు నొక్కి వక్కాణింతురు. వేదంబు లజ్ఞానంబుఁబాపి సుజ్ఞానంబొసంగునవి, గావున సమస్త వర్ణంబులవారును నిస్సందేహముగాఁ బఠింపవచ్చును. మంచిపని యెవ్వరైనను జేయవచ్చును. చెడుపని యెవ్వరికిం జేయఁదగదు. "శ్లో. జన్మనా జాయతే శూద్రాః, కర్మణా జాయతే ద్విజాః, వేదపాఠంతు విప్రాణాం, బ్రహ్మజ్ఞానంతు బ్రాహ్మణః." అనియున్నది గనుక, నెవఁడయినను జన్మించినపుడు శూద్రుఁడనియు, నుపనయనాది సంస్కారంబులచే ద్విజుండనియు, వేదములు చదువుటవలన విప్రుండనియు, బ్రహ్మజ్ఞానంబు వహించిన బ్రాహ్మణుండనియుఁ బల్కువాక్యములే సత్యము. ఉత్తమగుణంబులు గలిగినఁ జండాలకన్నియయైనను బతివ్రతయనంబడు. జారలక్షణంబులుగల యగ్రకుల కాంతయైనను వ్యభిచారియనంబడు. గుణమే యన్నిఁటికిఁ బ్రధానంబు, గావున మనశ్శుద్ధియే బ్రహ్మత్వంబునకుఁ 39
గారణంబని చెప్పి మఱియు నిట్లనియె.

## 28. కీర్తన. శుద్ధకాంభోజిరాగము - జంపెతాళము.

మనసునిలుకడలేక-మహినగ్రకులుఁడైన-ఘనజననమరణాబ్ధిఁ - గడవంగవశమా-మొనసియంత్యజుఁడైన - మనసునిల్పిపరత్వ - మును జెందినను బాఱుఁ - డనవొప్పుఁగాక॥ మ॥ ౧॥ తనరయజ్ఞోపవీ - తము ధరించిననేమి - యనువొందస్నానసం-ధ్యలుసల్పనేమి - మనమలరఁగా నజప-మంత్రసంధానంబు-ననువుపఱచక బ్రాహ్మ-ణత్వమెట్లొనరు॥ మ॥ ౨॥ వేదశాస్త్రములెల్ల - విభజింపఁగానేమి - మోదమునఁబలుజన్న-ములుసేయనేమి-వాదభేదములేని - బోధచే బ్రహ్మంబు - పాదుకొలియక యున్న - బ్రాహ్మణుండగునా॥ మన॥ 3॥ అరుదార శేషాచ - లార్యసత్కృపగన్న-సరసులకు - తెలియునీ-సారార్థమెల్ల - ధరలోననరసింహ-దాసునిశ్చయమాత్మ-నరయనేరని మూఢ-నరులకేమెఱుక॥ మన॥ ౪॥

వ. అనిన లోకసంభవనాశంబులఁ జెడక నిల్చియుండు వస్తు వెద్ది? కాలంబెట్లెట్లునడుచు? ఆ తెఱంగెల్ల వివరింపు, మనిన మనం 40
బునకు బుద్ధి యిట్లనియె.

క. కాలా కాలములందున, వాలాయము గలిగినదియె ♦ పర
తత్త్వముగా, నాలోకింతురు బుధు లిలఁ, గాలక్రమ మాదివివిధ ♦
గతులను మనసా. ౩౮

వ. ఓ మనసా, కాలక్రమమనఁగా: అహర్నిశంబులు గలది యొకదిన మనంబడు. అది మనుజులకు దినప్రళయంబగు. అట్టిదినంబులు ముప్పదియైన శుక్లకృష్ణ పక్షద్వయంబుగల యొకమాసంబగు. అది పితృదేవతల కొకదివసంబగు. అట్టి మాసంబులు పదిరెండైన నొకహాయనంబగు. అది దేవతలకొక యహంబగు. అట్టిదిన మాసక్రమంబున దివిజవర్షంబులు ద్వాదశ సహస్రంబులయినఁ గృత త్రేతా ద్వాపర కలి చతుర్యుగంబులు నడుచు. అది మహాయుగం బనఁబడు. అవి డెబ్బదియొకటైన నొక మన్వంతరంబగు. అట్టి మన్వంతరంబులు చతుర్దశంబైన విరించి కదియొక పగలగు. అదియుఁ జతుర్యుగసహస్రమితంబగు. ఆదివంబు గడచినపు డజుండు సుప్తిం జెందు. పగలెంత కాలం బంత రాత్రికాలంబు నడుచు. అంత సకలప్రాణులు నశించి పంచభూతంబులు నిలుచు. ఆరేయిగడచిన విధాతమేల్కని జీవుల మగుడి సృజించు. బ్రహ్మకది యొకదినంబగు. అట్టి దినమాసక్రమంబున శతాబ్దంబులు నిండినఁ బితామహుండు చచ్చు. అప్పరమేష్ఠి జీవిత కాలం బెల్లను విష్ణునకొకమాసంబగు. అవి ద్వాదశంబైన నొక యేఁడగు. అట్టివత్సరంబులు నూటైన విష్ణువు నశించు, ఆవిష్ణు ప్రళయములోన బ్రహ్మలనేకులు పుట్టిగిట్టుదురు. ఆవిష్ణు జీవితకాలంబెల్లను రుద్రున కొకదినంబగు. అట్టి దినమాసక్రమంబున నూరేండ్లుగడచిన హరుఁడడంగు. అతని ప్రళయములోపల బహుమంది విష్ణులు జనించి లయింతురు. ఆరుద్రుని జీవితకాలమెల్లను మహేశ్వరునకొక యామం బగు. అవియెనిమిదియైన నొకదినంబగు. అట్టి దినమాస క్రమంబున హాయనంబులు నూటైన మహేశ్వరుండు మడియు. అతనిప్రళయము లోపలఁ బెక్కండ్రు రుద్రులు వొడమిహరింతురు. అమ్మహేశ్వరుని జీవిత కాలమెల్లను సదాశివునకు రెండు గడియలగు. ఆదియొక ముహూర్తంబనఁబడు. అవి ముప్పదియైననొకదినంబగు. అట్టి దినమాస క్రమంబున శతవర్షంబులైన సదాశివుఁడు నీల్గు. అతనిప్రళయము లోపలఁ బెక్కండ్రు మహేశ్వరు లుదయించి సమయుదురు. ఆసదా

శివుని జీవితకాలమెల్లను విరాట్పురుషున కొక్కక్షణంబగు. అవి మున్నూటరువదైన నొకదినంబగు. అట్టి దినమాసక్రమంబున వత్సర శతంబైన విరాట్పురుషుండు సెల్లు. అతని ప్రళయములోపల సదాశివు లనేకు లుద్భవించి గతింతురు. అట్టియెడ మృత్యువు సమస్తప్రాణులం బట్టి యొక్కపెట్టం బొలియించు. అపుడు సూర్యచంద్ర నక్షత్రంబులు మాయాశక్తి మాయచే మటుమాయంబగు. గిరివృక్ష బీజ లతాది రూపంబులెల్లను ప్రళయదావాగ్నిచే భస్మీభూతంబగు. అంత సప్తానిలంబులు ప్రబలి రౌద్రంబుగావించు. నవాభ్రంబులు చెలంగి శతదివ్య వర్షంబులు ఘోరంబుగా వర్షించు. అంత సప్తాంబుధు లేకార్ణవంబగు. అపుడు భూమి జలంబుల విరియు. ఆ సలిలంబుల బడబానలంబు పీల్చు. ఆ శిఖింగాడ్పు చల్లార్చు. ఆ మారుతంబంబరమున గ్రమ్గు. ఆ గగనంబు మాయంజెందు. ఆమాయ పరాత్మయందడంగు. ఆపరాత్మ బట్టబయలందు మృషయగు. అప్పు డితరంబు లేక బట్టబయలగు బ్రహ్మంబొక్కడే గలిగియుండు. వినుము. 41

## 29. తోహరా.

ఘనముగను స్ఫినడంగిన తెలివియుఁ - దనకై తానరుదెంచు-
ననమాయయు నరుదెంచిజగంబుల - నట్టిమరలఁగావించు॥ ౧॥
జగములుయుగకల్పంబులునిట్లే - సంభవంబులగుచుండుఁ-
దగఁజెడువిశ్వముమరలనుబుట్టును - దెగునుమాయ లేకుండు॥ ౨॥
మాయేగలుగును లేకుండును - మాయేమాయయనఁదగు-
మాయలెఱుఁగ కెపుడొకగతినున్నం - బరబయలేస్థిరంబగు॥ ౩॥
అట్టిపదంబును జెందినవారే - యార్యులందురిలలోన-
వట్టికల్పనలఁజిక్కిభ్రమించెడి - వారేమూఢులుగాన॥ ౪॥
పట్టుగ శేషాచలగురుకృపఁబర - బయలుగను టెఘలమింత-
గట్టిగనరసింహాఖ్యు భావము - గణుతింపఁగ లేరంత॥ ౫॥

వ. అనిన విని పరమోల్లాసంబునఁ జెలంగుచు నింకనమనస్కయోగ పద్ధతి వినవలఁతు సవిస్తరంబుగాఁ దెల్పుమనిన మనంబునకు బుద్ధి యిట్లనియె. 42

క. పరమాత్మఁ గన్నయంతనె, యరయంగా విడుముఁజిక్కు •

యావద్వృత్తుల్, మఱేఁగిన మనములయించినఁ, బరువడి నమనస్క మనఁగఁ ♦ బడునది మనసా. 3౫

వ. ఓ మనసా, యమనస్కయోగమనఁగా మనంబును లయింపఁజేసినది. అది సహజ సమయంబులని రెండు తెఱంగులగు. ఎట్లనిన, సమస్తము చేయుచుఁ, జూచుచు, వినుచుఁ, గుడుచుచు, ముడుచుచు, నిద్రించుచు, మేల్కనుచు, నిరంతరము పరమాత్మనంటి మెలంగుచు విగత మనస్కుండై యుండుట సహజామనస్కంబనఁబడు. దీనినే జ్ఞానామనస్కమందురు. తనకిష్టమగునప్పు డొకప్రదేశంబున నొంటిగాఁగూర్చుండి తనగురుఁడొసంగిన నియతయోగంబున మనంబుఁజేర్చి బాహ్యవృత్తిలేకుండుట సమయామనస్కమనఁబడు. దీనినే నియమామనస్కమందురు. ఇది తత్కాలంబున మనంబులేక యాయోగంబు చాలించినతోడనే మగుడి గల్గుటచే నది సహజామనస్కంబు గానేరదు. అగ్నియందిడిన కాష్టంబుమాడ్కిని, నుదకంబులఁగలసిన లవణంబు పోల్కి, సమస్త కుసుమంబులంటి బ్రతుకుమధుపంబు చంపకపుష్పంబంటి చచ్చునట్లును, వివిధ వృత్తులతోఁ జరించుమనం బప్పరమాత్మనంటిన వెంటనే నశించు. అదియే యమనస్కమనంబడు. కావున, 43

## 30. కీర్తన. శంకరాభరణరాగము – ఆదితాళము.

అమనస్కమును జెందరా–నిస్సంకల్ప–మదియొసద్భావంబురా – అమనస్కభావంబు–నందభ్రమలెల్ల–సమయు నిత్యానంద – సౌఖ్యము లోనఁగూడు॥ అ॥ దీపించుముకురమునను – ముఖబింబంబు – నేపారఁ జూచుచును–జూపుమనములరెంటిఁ – జూపులందునఁజేర్చి – ప్రాపింపనంద్వైక్య – పదమునొందిననదియే॥ అ॥ పరికింపశుక్తికముల – రౌప్యము లేని- తెరుగొప్పనాత్మపొదలఁ–బరమాత్మయందునం – ప్రాప్తమామన మాది – పరిసంకల్పితవిశ్వభ్రమలఁబోలిననదియే॥ అ॥ మరిపూలు సీరు కంటెఁ–గనుదోయిని–నిరవొందమాయుకంటె – సరవిసులభము శేషాచలగురునికరుణచే – నరసింహాఖ్యుని హృదిని–నాటినయామేటి॥ అ॥

వ. అనిన నాశ్రమంబులెన్ని ? అందు ముఖ్యాశ్రమంబెద్ది యనిన మనంబునకు బుద్ధి యిట్లనియె. 44

క. ధరలో గార్హస్థ్యమునకు, సరిగావే యాశ్రమములు

సంకటములు కా, కరయ సుఖస్థితిఁజేయవు, గురుకృప గలిగినన ముక్తి ♦ కొదువయె మనసా. ౩౬

వ. ఓ మనసా, బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సన్న్యాసావధూతంబులని యాశ్రమంబు లైదువిధంబులగు. అందు వివిధాశ్రమములవారును గృహస్థుచేఁ బోషింపఁబడుటవలన నేయాశ్రమంబులును గృహస్థాశ్రమమునకు సమంబులుగావని బుధజనంబులు వక్కాణింతురు. మనంబు స్థిరంబులేక యే యాశ్రమంబులు మోక్షంబీఁజాలవు. కావున, 45

**31.** కీర్తన. యదుకులకాంభోజిరాగము – ఆదితాళము.

గృహస్థుఁడైననే మాయెను-మఱి-గుణము గుదిరియున్న-సహముఁజెందకయె-యఖిలకార్యముల – నాచరించుచు నున్న॥ గృహ॥ ౧॥ కూహాకంబులనెల్ల మాని – స – ద్గురునిఁగొల్చుచున్న – నోహటించుకొని-సుఖదుఃఖంబుల- నొక్కటిగాఁగన్న॥ గృహ॥ ౨॥ ఆఱుచక్రముల కావలవెల్గు-హంసనుగనుఁగొన్న – మేరుశిఖరమను-సహస్రారమున – మెలఁగువతాఁగన్న॥ గృహ॥ ౩॥ పరిపూర్ణంబె శాశ్వతమని – పర – బయలుగాంచుచున్న-నెఱుక లేనిదని-యెఱిఁగియు మొదలే-యెఱుకవిడిచియున్న॥గృహ॥ ౪॥ కరమరుదుగ శ్రీ – శేషాచలగురు – కరుణగలిగియున్న-ధరలోనరసింహాఖ్యునివాక్యము-తప్పకవినుచున్న॥ గృహ॥ ౫॥

క. సతిసుతులు లేకయున్నను, నతులితముగఁ గలిగియున్న ♦ నాత్మరతిని సం, గతిమీఱి నున్నయతనికి, క్షితివక్రత గలదె జన్మ సిద్ధికి మనసా. ౩౭

వ. ఓ మనసా, జగంబున సుతులులేనివారికి గతులులేవని, కర్మవిదులు కొందఱందురు. హనుమద్భైరవ విఘ్నేశ్వర భీష్మాదులేరీతి సుగతులైరి ? బ్రహ్మవిదులు సతిసుత వర్ణాశ్రమ శాస్త్రధర్మంబు లనుసరించియున్నను, దత్సమస్తము మిథ్యగానెంచుచుఁ, బరంబే స్థిరంబుగాఁదెలిసి, పరత్వంబుఁజెంది గదా జన్మవిముక్తు లగుదురు ! సంసారికైనను, సన్న్యాసికైనను బ్రహ్మానుభవము లేక జన్మసిద్ధిగలుగ నేరదు. మఱి యొకవేళ బ్రహ్మానుభవము గలిగినను నిట్టి విపరీతభావంబులందగిలి మనంబు స్థిరంబులేకున్న మోక్షంబబ్బుట దుర్లభంబు. మనంబు నిశ్చయంబగున నేరికిని మోక్షంబు సులభంబు. కావున, 46

## 32. తో హ రా.

మంచిగతినియోచించుజీవని - ర్మలుఁడ వగుదుతప్పకను-
జించినపత్రంబెందునుండినను - జింత లేనిపోలికను॥ ౧॥
నిజమెఱుఁగనిపామరులవాక్యముల - నెప్పుడువినవలదిలను-
నిజమనుదానిని నీలోనీవే - నిశ్చయమునుగావలెను॥ ౨॥
విననివానికంటెనుబరహితమును - విన్నవాఁడెయధికుండు -
వినుటకంటెవినన ట్లేక్రియ నెఱ-పినవాఁడేశ్రేష్ఠుండు॥ ౩॥
వినకచేయకయుఁబశుప్రాయులై - విహరించుటయదిమేల-
వినవలెఁగనవలెఁబరమార్థంబును - వివరింపఁగవలెఁజాల॥ ౪॥
పలుమఱు శేషాచలసద్గురుకృప - వడయుటె భవహరమనుచుఁ-
దెలియంగావలెనరసింహాఖ్యుని - పలుకులునిజముగవినుచు॥ ౫॥

క. కన్యాసుత ధనగృహములు, గణ్యతతో నున్నఁదన్నుఁ ♦ గన్నయతఁడెపో, సన్యాసియగును నన్యుఁడు, సన్యాసియుఁగాఁడు విడిన ♦ సర్వము మనసా. ౩౮

వ. ఓమనసా, స్త్రీసంగమము లేనివాఁడే మహానుభావుండని కొంద అవివేకులందురు. అట్లయిన, షండునకు సతివాంఛ లేదుగావున, నతండును మహానుభావుండు గావచ్చును. ఇంద్రియములన్నియు వాని వాని స్వభావజన్యంబులగు పనులాచరించుచుండ నందొక్క గుహ్యేంద్రియవ్యాపారముమాన్పినఁ దక్కినయింద్రియంబు లేమగు? కపటవృత్తిచే బాహ్యమునకు మానినట్లు తోఁపించినను, సతిఁగాంచినప్పుడు నపుంసకునకుఁదక్క, బురుషునకు మనంబు చలింపకమానదు. అట్లు చలించుటచే నింద్రియముద్వారా చేయకున్నను మనంబా పనినిఁజేసినదేయగును. కావున,నింద్రియ మనోవ్యాపారంబులు దేనను మానవు. సుజ్ఞానమందిన నవి నిర్బంధకంబులగు. అపు డతఁడు మహానుభావుం డనం జెల్లుఁగాక, దక్కొరులు మహానుభావు లెట్లగుదురు? వినుము.

## 33. కీర్తన. కాంభోజిరాగము - అటతాళము.

సుజ్ఞానమువీక్షింపుము-సులభంబదితరయింపఁగ - నజ్ఞానప్రభావంబుల - నన్నింటినివర్జించియు॥సు॥ నేనేపనులొనరించెద-నిక్కంబనితలపోయకు - మేనాఁడునుమదిగల్గియు - నీవెద్దియుఁగావింపవు॥సు॥ అలయింద్రియములునేనని - యనఁబోకుమునీవెన్నఁడు - నిలనెద్దియుగావింకను -

నీ వేతగ(–బర మాత్మవు॥సు॥నినునీవునుభావింప(గ–నీ వేనీవై వెల్గుదు–తను విం(ద్రియములచర్యలు – తథ్యంబుగనీ కేటికి॥సు॥వర శేషాచల దేశిక–కరు ణనునీయిలయందున–నరసింహాఖ్యునకునుసు–స్థిర మైమదిలోనాటిన॥ సు॥

వ. అనిన జ్ఞాని సతిసుతాప్తుల ననుసరించి గృహకృత్యంబు లొనర్చుచు నందఱివలెనటించుచున్న, నతఁడెట్లు మాయలంబొరయ కుండు ననిన మనంబునకు బుద్ధి యిట్లనియె. 48

క. పరమాత్మ తత్త్వమేనని, యరయుచుమఱి దేహమాన ♦ సాదిగభ్రమలఁ, దొఱఁగిపరత్వముఁ జెందిన, నరునకునిల మాయ లేవి ♦ నాటవు మనసా. ౩౯

వ. ఓమనసా, కొయ్యయం దగ్నియుఁ, దిలలం దైలంబును, దుగ్ధంబుల సర్పియుఁ, బుష్పంబులఁ దావియుఁ గల్గుచందంబున, జ్ఞాని సంసారమందుండియుఁ, దారు తిలక్షీరకుసుమంబుల కనల తైలఘృత గంధంబులు వేఱగు విధంబున, జ్ఞాని తత్త్వసిద్ధిచే సమస్తమునకు వేఱగుచుండు. మఱియు గారడీఁడు తన మాయచే నెల్ల వినోదంబులఁ జేయుచు, నతఁడును జూచుజనంబులును నదియంతయు దబ్బరగాఁదెలి యునట్లు, పరమాత్మ సత్యముగా నెంచి తక్కిన వెల్లను స్వప్నముగా నెఱుంగుచు వివిధకార్యంబులఁ జేసినను, జూచినను, దహనుండు సర్వ భక్షకుండయ్యును నిర్దోషియగునట్లు జ్ఞానికెన్నం డేమాయ లంట నేరవు వినుము. 49

## 34. కీర్తన. ఆనందభైరవిరాగము – అటతాళము.

జ్ఞానికంటదుసంసారంబు – తానుదానైన వెనుకఁదథ్యంబు ॥ జ్ఞాని॥౧॥ జ్ఞానికంటదు బంధుసతిసుతాప్తులఁగూడి–పూనియిల వ్యవహా రంబుల నెల్లసల్పిన॥ జ్ఞాని॥ ౨॥ బురదయందున నెపుడుచరియించు కుమ్మర–పురువునకునింతైనబురదయంటనియట్లు। జ్ఞాని॥ 3॥ క్షీరంబిలను బెరుగై – చిల్కఁదేలినవెన్న – యారూఢిగాఁ జల్ల – యందుఁగలియని భంగి॥జ్ఞాని॥౪॥ అందంబుగనుదామ – రాకులాయుదకంబు – లందుండి త జ్జలముఁ – బొందకుండినభాతి॥ జ్ఞాని॥౫॥ మొనసిజలబిందువును–ముత్తెం బునైనయా – వెనుకఁదొల్లిఁటినీరం – బునను గలియనిసరణి॥ జ్ఞాని॥ ౬॥ వర శేషాచలగురు స – త్కరుణరంజిలఁగన్న – నరసింహాఖ్యునిభావ – మరసిపొందినమేటి॥ జ్ఞాని॥ ౭॥

క. అనలమున నిలను దారువు, ననువొందఁగఁ దరువులోన • నలరు దహనుఁ డ, య్యనువున సంసారిగ జగ, మున మెలఁగుఁ బరాత్మలోన • బుధుఁడును మనసా. ४౦

వ. ఓ మనసా, సంసారియగుట, సన్న్యాసియగుట, భుజించుట, భుజింపకుండుట, కట్టుట, నగ్నుఁడగుట, నిద్రించుట, మేల్కనుట, మాటలాడుట, మౌనముగొనుట, చదువుట, చదువకుండుట, యింటనుండుట, యడవినుండుట, చేయుట, చేయకుండుట, మొదలైన సమస్తమును దేహసంబంధమగు పనులు గాని, యిందొకటియైనను బరమార్థ విచారణంబుగాదు. ఇవియన్నియు మనోవికారకల్పనంబులు. ఇట్టి వికారకల్పన లెవ్వియు నాత్మకు లేవు. ఆత్మవేత్త యిట్టి దేహమనః కల్పన లెన్నఁడు మోక్షంబునకుఁ గారణంబని చూడఁడు. తులాధారుండు వాణిజ్య వృత్తిచేతను, ధర్మవ్యాధుండు కటికపనిచేతను, జనకుండు రాజ్యపాలనచేతను, వసిష్ఠుండు దారాసుత వ్యాపార యుతుండయ్యుఁ దద్వృత్తులాది సంసార మాయలం జెందక ముక్తాత్ములై చిరకీర్తివహించిరి. కావున బ్రహ్మవేత్తలు ప్రారబ్ధకర్మవశమున నెట్టి వ్యవహారములు చేసినను మోక్షంబునకుఁ గొఱంతరాదు. వినుము. 50

## 35. తోహరా.

ఎట్టులుండినను-నేమితక్కువగు - నెంచిచూడసుజ్ఞాని -
గట్టిగానుసర్వంబుమిథ్యయని - గాంచుచునున్నను బూని॥ ౧॥
చేయక చేయునుగార్యములెల్లను - జెలువుమీఱుసుజ్ఞాని -
పాయుచుఁబాయకె మోహశోకములఁ - బరఁగునన్నిఁటఁబూని॥ ౨॥
చూడకెచూచుచునుండు సమస్తము - చోద్యమలరసుజ్ఞాని -
కూడకెకూడునుమతశాస్త్రాశ్రమ - కులధర్మంబులఁబూని॥ 3॥
భావింపఁగరోగాది విపత్తులఁ - బడయకె పడయును జ్ఞాని -
చావకెచచ్చునుధాత్రిలోపలను - జనులందఱివలెఁబూని॥ ४॥
ప్రల్లుమఱు శేషాచలసద్గురుకృపఁ - బ్రస్తుతించుసుజ్ఞాని -
యిలలోపల నరసింహదాసుహిత-మెఱిఁగిన లేదికహాని॥ ४॥

క. విడువరు దుశ్చరితంబుల, నడువరు సజ్జనులత్రోవ • నఘు

ములకెపుడుర్గ, జడియరు యమబాధలకును, గడవరు దుర్జనులు
జన్మకర్మలు మనసా. ౪౧

వ. ఓ మనసా, యీజన్మకు ముందును, జచ్చినవెనుకను జన్మంబేరికి లేదని కొందఱందురు. అట్లయినజగంబునఁ బుట్టినవారెల్ల నొక్కపోల్కినుండవలయు. అట్లుండక, నృప మంత్రి భటప్రజలుగా నేర్పడుట కేమిహేతువు. ఒకఁడు ధనవంతుఁడు, నొకఁడు దరిద్రుఁడు, నొకఁడుభోగి, యొకఁడురోగి, యొకఁడుదాత, యొకఁడర్థి, యొకఁడు సుఖి, యొకఁడు దుఃఖిగానుండనేల? అందుచే సమస్తజీవులును జన్మించి, తమతమ కర్మఫలంబుల ననుభవించుచున్నట్లు చెప్పవలసె. ముందు జన్మమే లేకున్న నీజన్మమెట్లుగలిగె ? పూర్వజన్మ కర్మఫలంబనుభవింప నీజన్మమును, నిప్పటి కర్మఫలంబు గుడువ మఱల జన్మంబును గలుగుచున్నది. ఆపత్కాలంబున జనులు తమపూర్వకర్మంబని తలంచుటయు, సత్పురుషులు జన్మభీతిచేఁ బరతత్త్వవిచారులై జీవన్ముక్తులగుటయుఁ బ్రత్యక్షముగాఁ దెలియవచ్చుచున్నది. ముందువెనుక జన్మంబులు లేనియెడఁ గర్మానుభవము లేనిదేకదా! అట్లైనఁ జారచోర హింసానృత మద్యపానాది దుష్క్రియలొనర్ప రాదనియు దుష్టసాంగత్యంబు దొఱంగి శిష్టులసేవించుమనియుఁ జెప్పనేల ? శాంతసత్యంబులఁ బ్రవర్తించుట, సత్కర్మలాచరించుట, దైవచింతన, ధర్మవృత్తి మొదలైనవి గలుగనేల ? ఇవియెల్ల మరలజన్మముండుట చేతనే చేయవలసివచ్చె. మఱుడి జన్మలేనిది నిక్కమనిన, సజ్జన దుర్జనులును, మంచిచెడ్డలును, సమానంబగుచున్నది. అట్లగుటచేఁ బూర్వాచారంబగు ధర్మంబెత్తిపోవుచున్నది. కాన, నట్లనందగదు. వేఁచిన విత్తనంబెందును మొలవనేరదు. వేఁచకున్నబీజంబు మొలకెత్తి వృద్ధియగును. కాన జన్మకు హేతువగు. కర్మబీజంబును గురుకరుణయను జ్ఞానాగ్నింబడ వ్రేల్చినఁ గర్మబీజంబువచ్చు. కర్మబీజంబు నశించినఁ బునర్భవంబులేకుండు. పునర్భవంబులేకున్నదదియే శాశ్వత పదంబగు. అట్టిపునరావృత్తిరహితంబగు త్రోవనెఱింగి జన్మకర్మంబులఁ బాపుకొన నందఱికిని శక్యంబుగాదని చెప్పి మఱియు నిట్లనియె.

**36.** కీర్తన. ముఖారిరాగము – ఏకతాళము.

ఎక్కువైన గురుబోధ – యిది-టక్కుగాదు నిజబోధ–మక్కువ

తోనను-మానము లేక యె-కుక్కను మెక్కిన-కులహీనులకును॥ ఎ॥ ౧॥ అందఱికందనిబోధ-యిది-యందినవారికిమేధ - డెందమందమఱి- సందియ మొందక-పందినిగుడిచిన - పరదేశులకును॥ ఎ॥ ౨॥ మానితమగు సద్బోధ-యది-మానినవారికిగాధ - సానుగమదిలో - శంకవహింపక - యేనుఁగు మెసవిన - హితసుజ్ఞానుల॥ ఎ॥ 3॥ జాతిఖండనగు బోధ-యీ-లోతు దెలియుచే మేధ - భీతిలకంతశ్శత్రులగెచ్చియు -కోతినిఁబట్టిన-నీతిపరులకును॥ ఎ॥ ౪॥ స్థిరమైనదియీబోధ - సం-సిద్ధి యొసఁగు సద్బోధ-ధరలో శేషాచలసద్గురుకృప - నరసింహాఖ్యుం - డందితరించిన॥ ఎ॥ ౫॥

వ. అనిన, లోకంబున మహాత్ములకు మరణకాలంబు దెలియవచ్చు నని చెప్పుదురు. అది యెట్లు దెలియవచ్చుననిన మనంబునకు బుద్ధియిట్లనియె. 52

క. చావెపుడు గలుగదాత్మకుఁ, జావుతనకుఁ గలుగునంచు ♦ శంకించుమదిర్, జావునభవమును భవమునఁ, జావగుఁ జావెఱుఁగఁ దరమె ♦ జనులకు మనసా. ౪౨

వ. ఓ మనసా, మృతసూచకంబు లనేకంబులుగలవు. అవి జ్ఞానికిందక్క నొరులకెఱుంగ రాకుండు. అట్టిరహస్యంబులఁ గొన్నింటి వివరింతు, వినుము. కమలాప్తునకు విముఖముగానిల్చి, మేనిచాయను గమనింపుచు, గళంబున దృక్కునిలిపి, యాదృక్కుఁజలింపనీక నభంబునఁ జూచిన నటఛాయాపురుషుం డవయవములతోఁ గనుపించును. ఆపురుషునకు మస్తకము లేకున్న షణ్మాసములకును, హస్తములు లేకున్న మాసత్రయమునకును, చరణములు లేకున్న నొకమాసంబునకును జావుసిద్ధించును. మఱియుఁ గుడిచేయి లేకున్న సోదరుండును, వామకరము లేకున్న భార్యయు, నుదరంబు లేకున్నఁ బుత్రుండును, మొగంబు దెలియకున్న సమీపబంధువును, గేశంబులు లేకున్నఁ దలిదండ్రులును, దప్పక నశింతురు. కంధరము లేకున్న దివసాష్టకంబునకుఁ దానే మృతుండగు, నఛాయ నల్లగానుండిన దారిద్ర్యాది దేహరుగ్మతలును, నెఱుపుగానుండిన సంపత్తును, బసుపుగానుండిన రాజత్వంబును, దెలుపుగానుండిన సంతానలాభంబును, శరీరసుఖము, దీర్ఘాయువును, మచ్చలుగానుండిన దుఃఖంబును సంప్రాప్తంబగు. ముద్రయందు నినదంబు వినఁబడకుండిన మాసచతు

ష్ఠయమునకును, రవినాడి రేవగల్వీడువక చరించినఁ బక్షుముదినంబు లకును, నైదహంబులు చంద్రుండెడపక పాఱిన నొకవత్సరంబున కును, నిన్నుఁడైన విధుండైనఁ గాన్పింపకుండిన నేకాదశమాసంబుల కును నాశంబుగల్గు. తన నీడయందుఁగాని, జలమందుఁగాని శిరంబు దోఁచకున్నను, రిక్కలుకృష్ణవర్ణమై తోఁచినను ధ్రువమండలమున నరుంధతి చూపట్టకుండినను నర్ధాబ్దంబునకు మరణంబుప్రాపించు. కరాంగుళ్య సంధానవియోగంబైన సప్తదివసంబులకును, హస్తమస్తక సంధానంబున మణిబంధంబు లావైతోఁచినఁ బదునైదుదినంబుల కును మృత్యువాసన్నంబగు. ఏవస్తువుఁజూచినను భిన్నంబుగాఁ గన్పిం చుచు, నీప్రపంచ మొకవింతయై తనభావంబునఁ దోఁచుచున్న నొక మాసంబునకును బంచత్వం బొనరు. ఇట్టి మర్మంబులు చక్కఁగా వీక్షించుమని చెప్పి మఱియు నిట్లనియె. 53

## 37. తోహరా.

అన్ని కార్యములుచేయుచందమున – నరయఁదగునుమృతిజ్ఞాని-
యెన్నండేయేభ్రమతలఁజెందక – యెంతోనిర్మలుఁడుజ్ఞాని॥ ౧॥
చావుదెలియకుండిననుజ్ఞానికి – సద్గతిగలుగకపోదు-
చావునెఱింగినయంతనమోక్షము – సంభవంబుగాఁబోదు॥ ౨॥
నాశములేనిపదంబున నిల్చిన – నాశంబేగతివచ్చు-
వాసిగననుభవజన్మకర్మములు – వరుసగనవుడేవిచ్చు॥ 3॥
చావుపుట్టువులునిశ్చయంబుగాఁ – జలనవుమాయకేగాని-
భావింపఁగనణుమాత్రమైనఁదన – కేవియుఁగలుగవుపూని॥ ౪॥
నరవితోశేషాచలగురునమ్మిన – సకలమర్మములు దెలియు-
స్థిరముగనరసింహాఖ్యునిభావము – దెలిసినమాయలుపొలియు॥ ౫॥

క. ఇలజాగ్రద్ధాది వృత్తులు, కలయేయది జాగ్రతయును • గాదుతలంపఁగ, మెలఁకువ లోపలమెలఁకువ, సలలితముగఁ గాంచు నదియె • జాగ్రతమనసా. ౮౩

వ. ఓమనసా, పుట్టుట, వృద్ధియగుట సతిసుతాప్త బంధువు లతోఁ గూడియుండుట, వివిధకార్యంబు లొనర్చుట, చచ్చుట యివి యెల్లను గలగాని జాగ్రతిగాదు, జాగ్రతయందు స్వప్నసుషుప్తులును స్వప్నంబున జాగ్రత్సుషుప్తులును, సుషుప్తిలోఁ గల మేల్కలును,

మొదలైన సమస్తము మిథ్యగాఁదెలియుచుఁ బరమాత్మ సత్యమని గాంచుటే మెలఁకువయనంబడు. కావున, 54

౩౮. మేలుకొలుపు - భూపాళరాగము - చాపుతాళము.

మేలుకొనవే - మనసా - మేలుకొనవే॥ మేలుకొనవేముద్ర లేవియు-మూలమునుగావనుచుముక్తికిఁ-జాలఁగావచియించుపెద్దల - సంగతులువినుచు॥ మే॥ ౧॥ ఛిద్రమొందకనిద్రఁజెందక - నిద్రఁగలజాగారములను - భద్రమగునిర్నిద్రలోపల - నిద్రఁదెలియుచును॥మే॥ ౨॥ మానితంబుగమర్మమగుచును-లోనికిందగలాగుపవనము - పూని కెఱుఁగుచు వెలికిఁబాఱెడి - పోకఁగనుఁగొనుచు॥ మే॥ 3॥ మేనునేనను భ్రాంతులెల్లను-మాని యెద్దియుఁగాని యాత్మే - నేనటంచును మానసంబునఁబూని దృఢముగను॥ మే॥ ౪॥ స్థిరముగా శేషాచలార్యులఁ - జిత్తమునఁ దలపోయుచునుధరఁ - బరఁగు శ్రీనరసింహదాసుని - భావమరయుచును॥ మే॥ ౫॥

క. వేయి దళంబులగృహమున, నాయకుఁడును లేనిమోక్ష ♦ నాయకిగల దా, మాయయను తలుపుఁదీసియు, నాయువతినిఁ గలియు వాఁడె ♦ నాథుఁడుమనసా. ౪౪

వ. ఓ మనసా, ముక్తికాంత బయలను దేశంబునందుఁ బంచరంగుల పట్టనంబునఁ ద్రికోణ హర్మ్యాంతరంబున, సుషుమ్నామణి పీఠంబునఁ గ్రొక్కాఱుమెఱుంగు తెఱంగున వసించి,దశవిధ దేవవాద్యములు మ్రోయ, నింద్రియబృందంబులను భటులుసేవింప, నోంకారశబ్దంబున వినోదకరంబుగా వీణెమీటుచుఁ బదునాల్గు జగంబులకు రాణియై చెలంగుచుండు. ఆసతీమణింగవయని జన్మంబు వృథా, యనిన మనోరూపంబను జీవుం డప్పరమసతి కతివినయంబున నిట్లనియె. 55

౩౯. తలుపుతీయుపాట - యమునాకల్యాణిరాగము - ఆదితాళము.

కలికీతొలకరిమెఱుపానీపై - వలపునవచ్చితికాంత-యిఁక-దలుపుఁదీయవేశాంత॥ కలికీ॥ ౧॥ తలుపుదీయనిది - తరుణముగాదు-నిలుకడెఱిఁగిరావోయి - నీ-కలఁతదెలిసెపోవోయి॥ తలుపు॥ ౨॥ ఇలలోపల నేశేషాచలగురు - వలనఁదెలిసితినికాంత - నీ-నిలుకడనంతయుశాంత॥ కలికీ॥ 3॥ పుడమిమాయయను తలుపుదెఱచుకొని - కుడియెడమలరావోయి-యికఁ-దడవుసేయఁదగదోయి॥ తలుపు॥ ౪॥ కుడియెడమ్మల నీ

గు ర్తునవచ్చెద-విడువ నెపుడునిన్నుఁగాంత - నీ-నడక నెఱింగితిశాంత॥ క॥ ౫॥ సహస్రారమనుచిత్రశయ్యపై - శయనింతమురావోయి-రతి - రహస్యమునుగనుమోయి॥ తలుపు॥ ౬॥ అవనిఁబోలకంనరసింహాఖ్యుఁడఁ - గవయుదిపుడునిన్నుఁగాంత - నా-భవములడంగనుశాంత॥ కలికీ॥ ౭॥

వ. అని యిట్లు ముక్తికాంతంగూడి మహదానందసుఖం బనుభవించు మనంబునకు బుద్ధియిట్లనియె. 56

క. లాలియని పరమహంసకు, లాలితబ్రహ్మాండమనెడి ♦ లక్షణయుతమౌ, డోలికలోఁ బరమాత్ముని, బాలునిఁగాఁ గనుచులాలి ♦ పాడుము మనసా. ౭౫

వ. ఓ మనసా, లాలియనఁగా; లాయనలావణ్య మనంబడు లియనలియ్యం బగు. అనఁగా, లావణ్యమగు నాత్మారామునియందు లియ్యమగుటకుఁ బ్రార్థింపుమని భావము. కావునఁ ద్రిగుణాది వివిధేంద్రియంబుల నహంకారమం దడంచి, హంకారంబుఁ జిత్తంబునం జేర్చి, చిత్తంబు బుద్ధింబఱపి బుద్ధిమనంబునఁ జొప్పించి, మనంబు జ్ఞాతంగూర్చి, జ్ఞాత నాత్మారామునింగలిపిన జీవుండు పరమాత్మయందు లియ్యమగు ననిన, మనం బట్లు పంచభూతాది తత్వంబు లొకదానియం దొకటి లయంబుసేయ గమకించుచు నాత్మారాముని కతివినోదంబున లాలిం బాడఁదొడంగె. 57

## 40. లాలిపాట-నవరోజురాగము-అటతాళము.

లాలియాత్మారామ - లాలిపరనామా - లాలిబుధనుతసేను - లాలినిష్కామా॥ లాలి॥ ౧॥ తొడరి బ్రహ్మాండమను - తొట్టి లోపలను - జడత లేక యెనీపు - శయనింపఁగాను - కుడియెడమ లను త్రాళ్ల - గుర్తుగాఁబట్టి-పుడమిలోనూఁచెదరు-బుధులుగఁజెపెట్టి॥లాలి॥ శక్తియుక్తులను-విస్తారమనిరోసి-ముక్తికై బ్రహ్మాది - మును దేవతలు-భక్తిచేనజపయను - పాటపాడుచును-యుక్తిచేసీరూప-మూహింతురిలను॥ లాలి॥ 3॥ మఱిఁదెలియఁదర మెనీ - మహిమభావించి - సరసముగ భక్తర-క్షణసేయ నెంచి-సరగ శేషాచల-స్వామివై నావు- కరుణతో నరసింహ-కవి నేలినావు॥ లాలి॥ ౪॥

క. అనిప్రకటించుచుబుద్ధిం, గనిమనమిట్లనియెనీదు ♦ కరుణనచలబో, ధనుదెల్పు మిపుడునీచే, వినఁదగు ధర్మంబులెల్ల ♦వింటిని బుద్ధీ.

క. సంసార శరధిబంధన, హింసానృత దుఃఖహరణ ♦ హిత సచ్చరణా, హంసోత్తంస విమోహా, ధ్వంసాఖిల భువనవాస ♦ తత్త్వ విలాసా. ౪౭

మాలిని॥ సరసవిరసనాశా ♦ సాధులోకప్రకాశా, పురవిపినసమానా ♦ భూత సర్వాత్మయానా, ధరణి సుజనరక్షా ♦ తాపదుష్టైక శిక్షా, సరసురసమవర్తీ ♦ జ్ఞానవిజ్ఞానమూర్తీ. ౪౮

క. మంగళమిదె సద్గురునకు, మంగళము చిదాత్మునకును ♦ మాయాంతునకున్, మంగళము సర్వసాక్షికి, మంగళ రూపునకు దివ్య ♦ మంగళము సదా. ౪౯

**41.** మంగళ హారతి – సురటరాగము – ఆదితాళము.

మంగళం మంగళం – సద్గురురాయా – మంగళం మంగళం॥ మంగళం॥ ౧॥ మంగళమనియంత – రంగంబులనునాత్మ – లింగంబుగని భక్తపుంగవులును–రంగుగజన్మాది – సంగములనుబాపి–భంగములేనట్టి–పదముఁగైకొనిరయ్యా॥మంగ॥ ౨॥పొలుపొందలోకములఁ – బుట్టింపఁ–బోషింపఁ – బొలియింపఁగర్తలై – చెలువుమీఱఁ – గలకాలమును నొక్క–గతిమైనాశములేక– నలువొందుచున్నట్టి–జ్ఞానచిన్మయరూపా॥ మంగళం॥ ౩॥ అందంబుగనువిశ్వ – మందునీవుందు నీ – యందువిశ్వం బెల్ల – నలరుచుండు – నిందందునెందునీ – వెద్దియంటక వేత్తై–యుందునీ మహిమనే – మందుపరంధామా॥ మంగళం॥ ౪॥ పంచభూతాదిప్ర – పంచముండినవేళ – నంచితంబుగసమయు–నట్టివేళ–నెంచిచూడఁగనీవే–నిల్చియుండెదుగాక – యించుకైననునిల్వ – దేదింద్ఁబరమాత్మా ॥ మంగళం॥ ౫॥ హరవిష్ణుసురలాది – పరమేష్ఠికైననీ – మఱుఁగుదెలియఁ గరాక – మర్మమగుచు –నరుదార శేషాచ – లార్యుండవై జగతి – నర సింహదాసు – సుస్థిరునిఁజేసినస్వామీ॥ మంగళం॥ ౬॥

గద్య. ఇది శ్రీమన్ పోకల – శేషాచల దేశికానుగ్రహాశ్రిత,
కర్పురగోత్రాన్విత, పోలకం – లక్ష్మీనృసింహార్యసుత,
సజ్జనహిత, నరసింహనామ రచిత బుద్ధ్యుపదేశిని
యను మానసబోధ సుజ్ఞానతత్త్వకీర్తనల
గ్రంథంబునందుఁ ద్వితీయాశ్వాసము,
సమాప్తము.




శ్రీ సద్గురవేనమః.

# బుద్ధ్యుపదేశిని

యను

# మానసబోధ సుజ్ఞాన తత్త్వ కీర్తనలు.



## తృతీయాశ్వాసము.

క. ఆకారగుణ వివర్జిత, యేకానేకాది విగత ♦ హితజన వినుతా, లోకాతీత సమంచిత, పాకారిముఖామరాళి ♦ వందితచరితా. ౧

వ. అవధరింపుము. ఆ బుద్ధి మనంబున కిట్లనియె. ఓమనసా, యచలభావంబు స్వల్పంబని యెంచియడిగితి గాఁబోలు. ఆహా! యది బ్రహ్మాదులకసాధ్యంబు. సమస్తభువనంబులు చరింపవచ్చు, భువిం దూఱవచ్చు, దివికేగవచ్చు, గిరులెత్తవచ్చు, అబ్ధుల్ దాఁటవచ్చు, అగ్నింబట్టవచ్చు, సతిసుత గృహధనక్షేత్రాదులు విడువవచ్చు, జటావల్కలములు దాల్చవచ్చు, ఆకలములు దినవచ్చు, ఇంద్రియముల జయింపవచ్చు, మదింగుదియింపవచ్చు, ప్రాణంబునిల్పవచ్చు, యోగములుసాధింపవచ్చు, నాసనంబులఁ బన్నవచ్చు, ముద్రలూన్చడవచ్చుఁ, దపంబు సల్పవచ్చు, వనంబుననుండవచ్చు, సాంఖ్యం బెఱుఁగవచ్చు, తారకం బరయవచ్చు, అమనస్కమందవచ్చు, కాని, పరిపూర్ణం బిట్టిదని యెఱుంగరాదు. అది మదికిందోఁచదు. భావంబునఁదగులదు. యుక్తికిం బట్టదు. శక్తికింజిక్కదు. చూపులకందదు. పల్కులకిందదు. మఱియు నట్టి పరమపదం బచలగురు కటాక్షంబునఁ బ్రత్యక్షంబగు వినుము.

క. ఎఱుకైన మార్గముల నే, మఱఁగిప్రవర్తింతురెల్ల ♦ మానపులునునా, పరిపూర్ణ భావమరయఁగ, ధరనెంతటివారికైనఁ ♦ దరమే మనసా. ౨

**1. కీర్తన. ఖమాచిరాగము – జుల్వాతాళము.**

పరమపద మదెట్టులఁ బా – మరుల కరయఁగల్గును – మఱఁగి యెఱుక జాలములో – పలనుబొరలుటాయెను॥ ౧॥ జడమజడసమా జము లే–సగుణమగుణభాసము పడయ దెవుడుఁబుణ్యముఁబా – పమును భవవినాశము॥ ౨॥ తుదయు మొదలు లేకయు నెం–దునను నొకటిగైనది– కదల మెదల దేమదిచో – క్కముగనిలిచియున్నది॥ ౩॥ పలుకులకును నందదుభా–వమునకుఁదగులొందదు–తలఁపు లెఱుఁగ దేతటిభూ – తముల గతిమెలంగదు॥ ౪॥ హరుఁడుహరివిరించిసమూ – హములకధికమైనది – గురుకృపనరసింహకవికి గుర్తుగలిగియున్నది॥ ౫॥

క. పరబయలుఁ జూపియెఱుకను, నిరసింపఁగఁ జేయుగురుఁ
డె ♦ నిజగురుఁడనఁగాఁ, బరిపూర్ణ మెఱుఁగ కెఱుకను, గుఱుతులబో
ధించువాఁడు ♦ గురుఁడే మనసా. ౨

వ. ఓ మనసా, లోకంబునఁ డక్కుంబసిఁడి మిక్కిలి గలదు. నిక్కఁపు హేమంబు చిక్కుటరుదై యుండు. అట్టు లెఱుక బోధించు గురుల లెక్కింప శక్యంబుగాదు. భ్రాంతిరహితుండగు నచలగురుండు దొరుకుట దుర్లభంబు. అట్టి గురునిఁ గనిపెట్టి, కల్లనిజంబులు తెల్లంబుగ నెఱింగి, యెట్టివేళలఁ బట్టువిడక, బట్టబయలను పుట్టినెక్కి పుట్టుగిట్టులుగల మాయా సముద్రంబుగడచి గట్టెక్కిన గట్టివాఁడగుఁ గాక వట్టిమాయలఁ బట్టువడి, యిట్టట్టు మిట్టిపడిసఁ బుట్టుగిట్టుల రట్టు పడక తప్పదు. కావున, గట్టిగా సద్గురునిచే బట్టబయలు గుట్టెఱుంగుటయే దిట్టమనిన మనంబుపట్టుగా గురుస్వామింగాంచి యిట్లనియె. 2

**2. కీర్తన జంఝూటిరాగము – అటతాళము.**

పరిపూర్ణమది యెట్లు–భావింపవలెనో, సు – స్థిరముగ సెలవిమ్ము దేశికేంద్రా – ఎఱుఁగింతువినులేని – యెఱుకచేతనె దాని–దరిశింపఁదగు నయ్యా–దాసవర్యా॥ ౧॥ ఎఱిఁగియచలమునంత – నేమిసేయఁగవలెనా– తెఱఁగేమొ వినిపింపు – దేశికేంద్రా–ఎఱిఁగినదె లేదనుచు–నెఱిఁగియా యెఱుక స–త్వరముగనువిడుమయ్య – దాసవర్యా॥ ౨॥ నెలవైనయా యెఱుక–నేనువిడుచుటయెట్లో–తెలిపి నను దరిఁజేర్చు–దేశికేంద్రా– ఇల యుఁగాయము కార్యం – బులు నెల్లఁగలయంచుఁ – దలఁచుటె విడుటె ఱుక – దాసవర్యా॥ ౩॥ కలగనెంచినయెఱుక –నిలకపోవునె మాయ–

యలరఁదోఁచక యెందు–నార్యవర్యా–కలగాంచి మేల్కొన్న–కలస్వానుభవమెల్లఁ – జెలఁగిచూడఁగఁగలమె – శిష్యవర్యా॥ ౪॥ ఎఱుక లేదని కన్న – మరలఁదోఁచుచు నున్న–దెఱిఁగించుమిది యేమొ – దేశికేంద్రా– ఎఱుకనిప్పుడెనాకు – గురుదక్షిణగనిమ్మ – తఱినిదోఁచదు నీకు–దాసవర్యా॥ ౫॥ వారితముగ నెఱుక–వదలించితిరి శంక–దీఱె శేషాచల శ్రీ–దేశికేంద్రా – కోరియిఁక నెప్పటికి–గుర్తింపకుమ యెఱుక–ధారుణి నరసింహ–దాసవర్యా॥ ౬॥

వ. అనియిట్లు పూర్ణభావంబు గురునిచే నెఱింగి సంతసించు 3
మనంబునకు బుద్ధియిట్లనియె.

క. పట్టవలెఁబూర్ణబోధను, గట్టిగ సద్గురుని దివ్య ♦ కరుణ
నుమాయర్క, గొట్టవలెఁగలను మేల్కని, పుట్టుక వాయంగ వలయు ♦ 3
బుధుఁడిల మనసా.

వ. ఓ మనసా, శిఖకర్పూరములు వేఱువేఱుగాఁదోఁచి, యవి రెండును నేకమై లేకపోయినట్లు, గుర్తులేనిగురుండు గుర్తుగల శిష్యునకుఁ గనుపించి గుర్తుగలయెఱుక, యెఱుకయనెడు స్వప్నంబుఁ బాపిన గుర్తువిడిచిపోయె. అటుమీఁద గురుఁడేమయ్యెనో శిష్యుఁడేమయ్యెనో చెప్పువారెవ్వరు ? అడుగువారేరి ? జననమెక్కడ ? మరణమేది ? అంతయుహుళిక్కే. ఏమియులేదు. అన్నియుఁగలలో వార్తలై పోయె. అట్టిభ్రాంతిలేని గురుండు గావలయు. బట్టబయలున వట్టి యెఱుక గట్టిగా విచారింపవలయు. పుట్టుగిట్టులు పట్టులేక వట్టివై పోవలయు. అనినమనంబచల గురుచరణంబులకుఁ బ్రణమిల్లి వినయంబున నిట్లనియె.

## 3. కీర్తన. సౌరాష్ట్రరాగము – అటతాళము.

చెప్పుమా–సద్గురు రాజచంద్రా–తప్పక–నామది యందుఁగల్గె – నిప్పుడొకసందేహమెఱుకే–చొప్పునను నుత్పన్నమయ్యెనో – యొప్పుగానదిమరలనెటువలెఁ – దప్పకను బ్రవినాశమగునో॥ చె॥ ౧॥ ఎఱుఁగుమా–నాప్రియశిష్యతిలకా – సరగునఁ–దెల్పెదదాని నిపుడే– యెఱుక నారికేళమున జల – మేగుదెంచిన కరణివచ్చెను – గరిభుజించుకపిత్థఫలమునఁ–గలుగు గుజ్జుహరించుగతిలయ॥ యెఱుఁగు॥ ౨॥ సరవినెఱుకజనించుటకు – నిఁకస్థా – వరముపరిపూర్ణమోనిజ – మరయదానికి

వేఱుగానొక - నిరవు నెద్దియునైనఁగలదో॥ చెప్పుమా॥ ౩॥ ఎఱుక పుట్టుటగిట్టుటెల్లను - నేమిలేదిఁక వట్టిదారయ-నెఱుక మఱపులు లేని బయలున - నెఱుకయేగతిఁ బుట్టఁగలదో॥ యెఱు॥ ౪॥ అట్టియెఱుక సమూహమెల్లను - బట్టుగా నుద్భవముఁజేసిన - యట్టి వారెవ రిలను నదియే - గట్టిగా వినఁగోరియడిగెదఁ॥ జెప్పుమా॥ ౫॥ వరుసనెఱుక సృజింపఁజేసిన - వార లెవ్వరు లేరు - అదియే - యరుగుదెంచె సుషుప్తి నుండియు - నరయఁదోఁచిన తెలివివిధము॥ ఎ॥ ౬॥ ఎవరుదాని సృజింపకున్నను - నెట్లువచ్చెనుదనకుఁదానే - వివరమేమో తెలియఁజాలను - విస్మయముగల్గించెమదికిని॥ జెప్పుమా॥ ౭॥ సవిరళంబుగ నశ్వగజ రథ-సైన్యములు బహుకోట్లుకలలో - నెవరు వెన్నఁగొనివచ్చిరవితుద-కెవరుగొనిచని రేమిలేదు॥ ఎ॥ ౮॥ కనులకును బ్రత్యక్షముగనిల - గలిగితోఁచుచు నుండలేదని - యనఁగ నెట్లు విరుద్ధమిది యిల-ననుటకును వినుటకుహితవే॥ చెప్పుమా॥ ౯॥ ఎండమావుల నీళ్లులేవని-యెఱిఁగియున్నను జలములట్టుల - నెండమావులయందుఁదోఁచుచు-నుండినను నదినమ్మనగునే॥ ఎ॥ ౧౦॥ జోకనాగమశాస్త్ర విద్యల - నేకచదువులు చదివియును నీ-పాకమెఱుఁగర దేమి చిత్రము - లోకమున శేషాచలార్యా॥ చెప్పు॥ ౧౧॥ కీలుదెలియని చదువులెల్లను - జాలఁగాఁ జదువంగ నేటికిఁ-గీలుదెలిసెడు చదువునిదియే - పోలకం నరసింహదాసా॥ఎ॥౧౨॥

వ. అనియిట్లుగురునివలన నెఱుకసమాచారమంతయు స్పష్టముగాఁ దెలియఁబడి యాశ్చర్యంబునొందు మనంబునకు బుద్ధి యిట్లనియె.

క. పరికింప నచలబోధకు, సరిగావే బోధలెఱుఁగఁ ♦ జాల మెయగుటక్, మఱియెఱుక బోధలందునఁ, జొరకుము గను మచల బోధఁ ♦ జొప్పడ మనసా. ౪

వ. ఓ మనసా, యచలము గుణవర్ణకామాంది షట్కరహితము. అండపిండ బ్రహ్మాండ వికారకల్పశూన్యము. నామరూప కర్మ జన్మ వినాశగతము. స్త్రీపురుషనపుంసకచ్ఛేదము. బాల్యకౌమార యౌవన వార్ధి కాంతము. స్వగతవిగత స్వజాతి విజాతి భేదవిలయము. కాయేంద్రియ స్వప్నసుషుప్తి జాగ్రజ్జీవలోక వర్జితము. మంత్ర యంత్ర తంత్ర మహిమాతీతము. హరివిరించి శివాదులకాదిదైవము. సమస్తము నశించినను నిల్చియుండు శాశ్వితపదము. దాని కెందు

నుం బ్రతిలేదు. దానికదియే. వీక్షించు మనిన మనం బాపరిపూర్ణ
సౌజ్ఞలో నిలిచి యిట్లని యభివర్ణించె. 6

4. కీర్తన. శహానారాగము - ఆదితాళము.

ఏమివింతెగురునికరుణ-యింతయంతనరానిదే- తామరసగర్భా
దులకును - దలఁపశక్యముగానిదే॥ ఏమి॥ ౧॥ ఎండకెండదగ్నిఁగాల-
దెపుడుచలికివణఁకదే - దండిగాడ్పువడదువానఁ - దడియ దలుఁగులఁ
దునియదే॥ ఏమి॥ ౨॥ పట్టువడదుపాశములచేఁ - బాషాణములఁ బగుల
దే - పుట్టినట్టి దెపుడుగాదే - గిట్టుఁజెందనట్టిదే॥ ఏమి॥ 3॥ కన్నవారికెం
దునదియే - గల్గి తోఁచుచున్నదే - ఉన్నదదియే లేనిమాయ-నెన్నఁడె
ఱుఁగకున్నదే॥ ఏమి॥ ౪॥ స్థిరమైనట్టి పరమపదమే - శేషాచల సద్గురు
కరుణ-ధరలో(శ్రీ)నర-సింహాఖ్యునకు-మఱుఁగు లేనిదాయెనే॥ ఏమి॥౫॥

వ. అనియిట్లు కేవలాత్మం గొనియాడుచుఁ బ్రమోదాబ్ధిం
దేలు మనంబునకు బుద్ధి యిట్లనియె. 7

క. ఎక్కడఁజూచినఁ బరబయ, లొక్కటెగల దన్యమెద్ది ♦
యును లేదనుచుర్, నిక్కము నెఱిఁగిన వారలె, యెక్కువగనుఁ
గొన్నయచలు ♦ లిలలో మనసా. ౫

వ. ఓ మనసా, యచలు లనఁగాఁ జలనములేనివారు. తను
వుండి చలనములేనివారు. ఎట్లనిన:— శరీరాది ప్రపంచరూపము
లెల్లను నెఱుకయను కలలోఁ దోఁచుటచే బయలను జాగ్రతను
గాంచి తత్సమస్తము మిథ్యగాఁదెలియఁబడి యచలముదక్క నన్యం
బెద్దియు లేదని నిశ్చయించి, యట్లు నిర్దేశించిన తెలివిని సమూల
ముగా విడుచుటంజేసి చలనరహితులై కేవల మచలస్వరూపు లగు
దురు. అట్టివారే యశరీరులనియు నచలులనియుఁ బరిపూర్ణులనియుం
జెప్పఁబడుదురు. తక్కువా రచలు లెన్నఁడుఁగానేరరు. వినుము. 8

౫. తోహరా.

పరబయలగునా కేవలాత్మఁ ద - ప్పక మదినెఱుఁగఁగవలెను-
నెఱిఁగినయెఱుకే - శూన్యంబంచును - నెఱిఁగియెఱుకవిడవలెను॥ ౧॥
ధరలోఁగొందఱుపరిపూర్ణంబును - దామెఱింగియును వేగ-
నెఱుకవిడువఁగాఁజాలక యుందురు - ఎప్పటియట్లెబాగ॥ ౨॥
అరయ నెఱుకవిడ నేఱక పరిపూ - ర్ణాచలమెఱిఁగి యున్నను-

మఱియచలులుగాఁజాలరు వారలు - నెఱుకవారెగావునను॥ 3॥
ఎఱుఁగుచుఁ జేయుచుఁగుడుచుచు ముడుచుచు - నెల్లనుగలగాఁగనుచు-
నెఱుకదొఱంగినవాఁడె ధాత్రిలో - నెన్నుమచలుఁడతఁడనుచు॥ ౪॥
గట్టిగ శేషాచల గురుకృపచేఁ - గానియెఱుక విడరాదు -
పట్టుగనరసింహాఖ్యుని భావం-బరయక సుఖమునులేదు॥ ౫॥

క. గుర్తుగల యెఱుకలోపల, గుర్తుగ నరుదెంచికలను ♦ గూడి యునానా, గుర్తులఁ దగిలి జనంబులు, గుర్తెఱుఁగరు గుర్తువిడుచు ♦ గోప్యము మనసా. ౬

వ. ఓ మనసా, మక్షికంబులు సుగంధంబు లగు పదార్థంబుల గ్రహింపక దుర్గంధము లగు చోట్లనావరించి, యాదుర్గంధమునే గ్రహించునట్లు పామరజనంబు లచలబోధయం దాసక్తులుగాక, చలన బోధలు వినుచుఁ జలనాధిక్యులై, మాయయను ముసుంగునం గప్ప బడి బయలుగానక మాయతోఁజచ్చుచు మాయతోఁ బుట్టుచు, మాయనెడఁబాయ సమర్థులుగాకుందురని చెప్పి మఱియు నిట్లనియె.

## 6. కీర్తన. మాయామాళవిగౌళరాగము - రూపకతాళము.

బట్టబయటనుండినీవా - గుట్టుదెలియవేమిమాయ - పట్టుపడుట వట్టిశ్రమలేర-యీ-పట్టులేని-యట్టిదీని-గట్టిగావర్జించివేయుమురా॥ బ॥
౧॥ అందరాదుపొందరాదు - ఎందుఁజూచిననేమి లేదు - సందుదెలియ రానిదచలంబు-ఏ - మందుదాని - యందులేని-సందియంబులొందఁగా రాదు॥ బ॥ ౨॥ అక్కజముగఁ గేవలాత్మ - నిక్కమంచుబ్రహ్మశివులు - మ్రొక్కులిడుచునుందురనిశంబు - తాఁ-బెక్కులౌమె-టక్కుమాయ - లొక్కటైననిల్వఁబోవంచు॥ బ॥ 3॥ ధారుణిశేషాచలార్య - సారమైన కరుణఁగన్న-నారసింహదాసు మొరవిన్న-నీ - దారిఁగన్న - కోరియు న్న-వారిభాగ్యము - చెప్పశక్యమ॥ బ॥ ౪॥

క. కుండలి నడుమనుగలదె య, ఖండంబదె పరమటంచుఁ ♦ గందు రఖండం, బుండునె మృషగాకాహా, యుండున దచలంబె యెపుడు ♦ నొప్పుగమనసా. ౭

వ. ఓ మనసా, యఖంబమనఁగా జ్యోతి తజ్జ్యోతినే తారక మని యు, సాక్షియనియు, ద్రష్టయనియు, హంసయనియు, బరాత్మయని

యు, నాత్మయనియు, నెఱుకయనియుఁ జెప్పుదురు. దానినే పరిపూర్ణంబు నెఱుఁగనిపామరులు బ్రహ్మంబని యెంచి యదియే తామనియు, దేహేంద్రియములు తాముగామనియుఁ బరిగణించుచు సోహం భావనాసక్తిం దగిలియుందురు. జల బుద్బుదమట్లు గనుపించి నిమిషంబులో జీవలోకంబుల మోసపుచ్చి మటుమాయముగాఁ బోవు మాయ తమ కెట్లు స్థిరమయ్యెనో. సురముని బ్రహ్మాదులాదిగానాత్మను నమ్మి దాని మాయం దెలియఁజాలక మోసపోయిరి. మఱి, యట్టి మాయను నమ్మినవారు ప్రత్యక్ష మాయకులేగాని, మాయారహితు లెన్నఁడును గానేరరు. కావున, 10

7. కీర్తన. హిందూస్థానికాఫీరాగము - అటతాళము.

ఉన్నదచలమె చూడరా - లే-కున్నమాయను వీడరా - పన్నుగానింతకునుమించిన - భావ మెక్కడలేదురా॥ ఉ॥ ౧॥ ఆదిమధ్యాంతములులేనిదె - యరయఁ బరిపూర్ణంబురా - వేదశాస్త్ర పురాణముల నది-విశదపడునదిగాదురా॥ ఉ॥ ౨॥ కులబలంబులు కలిమిలేములు-గుణములేచంచలమురా-కలుగవివి పరబయలు కెన్నఁడు - వెలుఁగుచీఁకటి లేదురా॥ ఉ॥ 3॥ ఆత్మమూలంబఖిలమునకును - నాటకంబని తెలియరా - ఆత్మయే పెనుమాయ నిజమిా - యర్థ మెఱిఁగినటించరా॥ ఉ॥ ౪॥ గుఱుతుగా శేషాచలాహ్వయ - గురుకటాక్షమెకీలురా - ధరణిలోనరసింహదాసు-హి-తంబు వినుటేమేలురా॥ ఉ॥ ౫॥

క. ఉన్నదని చూడకాత్మను, నున్నదె పరిపూర్ణమంచు ♦ నొగిఁగాంచినచోఁ, గన్నది కన్నట్లేచను, నున్నయ్యెను విశ్వహాత్మఁ ♦ జూడఁగ మనసా. ౮

వ. అనిపల్కిన మనంబు విని, టక్కగు నాత్మనిక్కమని ముందు బోధించుటకును నిప్పు డది దబ్బరని చెప్పుటకును హేతువేమనిన, బుద్ధి, యోమనసా, యాత్మమాయయగుట సత్యంబు. అది మాయయని ముందుగా నీకుం జెప్పిన, లేనిమాయ విచారింప నేల యని మాని యుందువు. మాయ బీఱపీఁచుచిక్కువంటిది. అది విచారణచేతఁగాని విడదు. దానిచే మృషయగు నాత్మ నిజంబని చెప్పుటకుఁ గారణంబయ్యె. కావున, ఓనమాలు చదువక ముందే

పెద్దపుస్తకము చదువుటెట్లు? చెట్టు మొదలుపట్టుకొని మెల్ల మెల్లఁగాఁ బ్రాఁకిన శాఖాగ్రమునకుఁ బోవచ్చును. చెట్టు మొదలుపట్టకయే చివరనుబోయి కూర్చుండవలె ననుయత్నం బెంతటివారికిని సమకూరదు. వడ్లు బియ్యమేర్పడు నంతవఱకు దంచవలసిన పనియుండు. దంచకయే యూరకున్నఁ దఁడులము లెట్లులభించు? చీఁకటింటఁ దనకుఁ గావలసిన వస్తువు చిక్కిన వెనుక దీపమక్కఱలేనట్లు, నదిదాఁటి దరిఁ జేరిన పిదప నావతోఁ బనిలేని పోల్కిని, సాంఖ్యతారక విచారణంబున సమస్తసందేహంబులుదీఱి,యాత్మయను నెఱుకచేఁ బరిపూర్ణంబు సేవించినపిమ్మట నాత్మతో నెంతమాత్రమును బ్రయోజనంబులేదు.వినుము.

8. కీర్తన. తోడిరాగము - అటతాళము.

అందునిందున నెందు - నచ్చలమున్నది - యాత్మమాయే - లేనిదాయె-ఇందునందనరానిదాయెనే- యే-చందమింతయు లేకపోయెనే-ఉందిగాంతునన్న - లేంది లేకయెపోయె-మాయే లేనిదాయె॥ అం॥ ఖండరూపములందఁబోదుగా - అఖండమెన్నఁడునైనఁగాదుగ - ఎండమావులట్టు-లుండి లేనిదెందు - మాయే - లేనిదాయె॥ అం॥ బట్టబయలను పేరులేనిది-యీ-గుట్టు నెవ్వరు నెఱుఁగరానిది - పుట్టిదానిపేరు- పెట్టినదివట్టి మాయే- లేనిదాయె॥ అ॥ వచ్చికల్పనలెల్లఁజేసెనే - తా - హెచ్చిసుఖదుఃఖములడఁసెనే-వచ్చి హెచ్చినొచ్చి-చచ్చునట్టిదియెల్ల-మాయే-లేనిదాయె॥అం॥ అరయంగ శేషాచలార్యుని-సత్కరుణచేతనుజాలనెమ్మిని-ధరణినారసింహ - దాసుసత్వరవిడిన - మాయే - లేనిదాయె॥ అం॥

క. లోకుల మాటలుచీచీ, కాకుల కూఁతలుగణింపఁ ♦ గల్లరి మాయర్ణ, జీకాకు పొంది చెడకుము, ప్రాకటముగ బయలుగాంచి ♦ భ్రమవిడు మనసా.

వ. ఓమనసా, మాయయను కల నావరించుట మృగతృష్ణంగని భ్రమసిన కురంగంబు విధమగు. ఎట్లనిన, నొకహరిణంబు మిక్కిలి దప్పిచే గహనంబెల్లఁ దిరిగి తిరిగి, యెచ్చట నీరుగానక, యరణ్యంబు నెలువడిపోవుచు, నొక్కెడ నెండమావులంగని, యాహా! జలంబులఁ జూడఁగంటినని మిగులగుతూహలంబున నుప్పొంగుచు సలిలాపేక్షచేఁ బరువిడి పరువిడి బహుదూరమేగినను నుదకంబులు చిక్కక వేసరి,

పిపాసచేఁ గుత్తుకయెండి, పోఁజాలక నేలంబడి, విలవిలం దన్నుకొని, ప్రాణంబులు విడిచె. అట్లు నిక్కమగు పరిపూర్ణం బెఱుంగక, లేక కనిపించుమాయ నిజం బని భ్రమించువాఁడా సారంగము గతియగు, నని చెప్పి మఱియు నిట్లనియె. 12

## 9. తోహరా.

మాయయున్న దనిభ్రమయు బెగాని - మాయయేమి లేదోయి- మాయలేనిదనితీర్మానించిన - మదికదియేబల్మాయి॥ ౧॥ మాయవట్టిదని తెలిసివిడుచుటకు బ్రహ్మాదులకునుదరమ - మాయనుబాసిన మహానీయులకును - మహినొక్కటిదుస్తరమ॥ ౨॥ కలలోఁదోఁచినవెల్లనుమెల్లను మెలఁకువఁ-గనిచూడఁగలేనట్లు-అలబయలనియెడిమెలఁకువఁ గాంచిన-కలయిలఁ దోఁచుటయెట్లు॥ ౩॥ అనువుగనిజమైజాగ్రతయందున - నలరఁదోఁచువిశ్వంబు - కనుఁగొననేదిఁకనిద్రయందునను - మునిఁగిపోయె సర్వంబు॥ ౪॥ ఘనముగ శేషాచలసద్గురుదయ - గనుటెమాయాహరంబు - అనిశమునరసింహాఖ్యునివాక్యం - బౌననుటేసారంబు॥ ౫॥

క. మాయ మఱి మఱి విచారణ, సేయఁదగును బీఱపీఁచు • చిక్కవిడదుపో, మాయయన లేనిదనిభ్రమఁ, బాయునదె విచారణకును • ఫలమగు మనసా. ౧౦

వ, ఓమనసా, మాయను గట్టిగావిచారింపకున్న సత్యంబుగాఁ గనుపించు. అది బీఱపీఁచు చిక్కువలె భ్రాంతిరూపమై విడనేరదు. దాని విచారించిన స్వప్నానుభవము క్రియ సమస్తముమిథ్యయైపోవు. మాయయనఁగా నామరూపక్రియలు లేని యచలమందుమరుమరీచికలట్లు లేకతోఁచు అండపిండ బ్రహ్మాండములు. త్రిమూర్తులు మాయ, ఇంద్రచంద్రార్కతారలు మాయ, నరసురగిరిగహనాబ్ధులు మాయ, మత్స్యకూర్మాద్యవతారములు మాయ, పంచభూతములు మాయ, పరమహంసమాయ, చతుర్దశలోకంబులు మాయ, లోకాధిపతులుమాయ, పదవులుమాయ, నరకము మాయ, దిశలు మాయ, దిక్పతులు మాయ, శక్తులు మాయ, గుడిగోపుర వేల్పులాది సమస్తమునుమాయ, మాయగాని దచలపరిపూర్ణ మొక్కటే. అదియెద్దియుఁ గానిది. ఇట్టిదని పలుకరానిది. వినుము. 13

## 10. కీర్తన. తోడిరాగము - ఆదితాళము.

ఏమిగాదు కేవలాత్మ - నేమనివచియింతురా - ఏమనివచియిం తురా నే-నేమనివచియింతురా॥ఏమి॥ ౧॥ అన్నిటికిని నేనటంచు - నున్న దదినే మాయరా-మెన్నబోయిన నేమిలేదు - ఉన్న దేబయలామెరా॥ ఏమి॥ ౨॥ భ్రమలబొరయుదదియు - దేని -భ్రమలద్రోయదరయరా భ్రమవెదోచు - భ్రమయెచూచు - భ్రమయెలేనిదామెరా॥ఏమి॥ 3॥ పుట్టుగిట్టు లనుభవములు-పుణ్యపాపములేవిరా-వట్టివామెనన్నికలలో- వార్తలామెజూడరా॥ ఏమి॥ ౪॥ ధరణిశేషాచలగురూత్తము - కరుణ వలనగన్నది - స్థిరమటంచు నెంచి నార-సింహనాముడన్నది॥ఏమి॥ ౫॥

క. నరసుర మూర్తులురవిశశి, కరిహరిమృగ పశువిహంగ ♦ గహనజలధుల, గ్గిరిపంచ భూతములె యిల, బరబయలున లేక తోచు ♦ భ్రమయదిమనసా. ౧౧

వ. ఓమనసా, యేమిలేనిపరిపూర్ణమందుబంచభూతాదిసమస్త ప్రపంచము భ్రాంతివలనందోచుచుండు. భ్రాంతియనగా జలింపని రజ్జువుంజూచి పాముఅని భ్రమనొందుట. భ్రాంతిరహితమనగా, సర్ప భ్రమనొందినవాడు ధైర్యంబున మెల్ల మెల్లగా రజ్జువుచెంతంబోయి చూచిన నది వట్టిత్రాడని తెలిసి, లేకగలిగినఫణిభ్రాంతిం దొలగుట. అట్లేపరిపూర్ణంబున లేకతోచినప్రపంచము భ్రాంతిచేనున్నట్లు గను పించినను బరిపూర్ణము నిశ్చయముగా నెఱింగిన, నెండమావుల జలంబు లేనట్లు, ప్రపంచభ్రాంతి లేక పోవుచున్నది. భ్రాంతివిడిచిన నేమియు లేదు. కావున, 14

## 11. కీర్తన. ఝంఝూటిరాగము - అటతాళము.

టక్కరయిూయిల - నిక్కముగాదుర-మక్కువతోడను- నిక్క మెఱింగిన॥ట॥౧॥పుట్టుట లేదుర-గిట్టుట లేదుర-వట్టిదె లేనిభ్రమ-వచ్చుట పోవుట॥ట॥ ౨॥ ఇక్కడ నెక్కడ - నెక్కడజూచిన-నిక్కము బట్టబయ లొక్కటెయున్నది॥ ట॥ 3॥ మంత్రములేవిర-తంత్రము లేవిర-జంత్రపు బొమ్మలివి - స్వప్నముచూడర॥ ట॥ ౪॥ సరగునశేషాచల - సద్గురు సత్కృప-ధరనరసింహకవి-తథ్యముగన్నది॥ టక్కర॥ ౫॥

క. తీఁగభరించు ఫలములటు, లోఁగొని భరియించునాత్మ లోకములెల్లన్, దీఁగగతి నాత్మసెడ భువి, భాగముసెడుఁ జెడని దెపుడు ♦ బయలే మనసా. ౧౨

వ. ఓ మనసా, యన్నపానాది వ్యాపారములెల్ల నాత్మకు లేవు, శరీరమునకే యనిన, నాత్మ శరీరమందున్నప్పుడే యన్నపానంబులొనర్చుటయుఁ గలనిదుర జాగరములొందుటయు, సమస్తకార్యంబులాచరించుటయుం గల్గియుండు. దేహమం దాత్మ లేనపు డన్నపానంబులు సల్పుటయు, జాగ్రత్స్వప్నసుషుప్తులం జెందుటయు, వివిధకార్యంబులు గావించుటయులేదు, గావున నఖిలం బాత్మదియేగాని జడమగు మే నెద్దియుం జేయఁజాలదు. విత్తనంబువలనవృక్షంబు గల్గుచున్నది. విత్తనములేకున్న వృక్షంబులేదు. అట్లేయాత్మ విశ్వంబునకు బీజమై, నరసురదైత్య మృగపశుపక్షి క్రిమికీటకాది సమస్త రూపంబులంగలిగించుచున్నది. కావున నాత్మయేసమస్తమాయలకు మూలము. ఆత్మయున్నంతవఱకు నన్నియుంగలవు. ఆత్మలేకున్న నేమియులేదు. కాన నాత్మయే పెనుమాయ. అదియే హుళిక్కి. దానినెన్నఁడునమ్మవలదు. ఆత్మాతీతమగు కేవలాత్మయేసత్యపదంబగునని చెప్పి మఱియు నిట్లనియె.

## 12. తో హ రా.

పరబయలనగురుగుహ్యమచలమనఁ - బరమపదంబనిబాగ - నెఱిఁగియెఱింగిన దేమృషయంచును-నెఱుకనుబాయుము వేగ॥ ౧॥ ఎఱుకచేత నేయెఱుకయుభువనము-లెల్లను గల్పితమాయె-నెఱుక చేత నే పెరుగును నెఱు కే-యెఱుకనుబొరిఁగొనుటాయె॥ ౨॥ నరగునఁదనలోఁగలజలచరముల-సాగర మెఱుఁగనిభాతి-పరిపూర్ణంబొక టెఱుఁగక యున్నది - యెఱుకజగంబులరీతి॥ 3॥ పరిపూర్ణంబున నెఱు కే లేదని - భావనచేసిన తోడ-గుఱుతు నెఱింగిన యెఱుకనువిడిచిన-గుఱు తేమున్నదిచూడ॥ ౪॥ వర శేషాచలగురుకృపగలిగిన - వారికిహితమీబోధ - విరివిగ నరసింహాఖ్యునివచనము - విన్ననుగల్గునుమేధ॥ ౫॥

క. ఇను ని కతన మేఘంబులు, జనియించును సమయునట్లె ♦ జగములు పరమాత్మనివలనఁ గల్గుఁజెడుఁగా, కను నచలము వలన నెద్ది ♦ గలుగదు మనసా. ౧3

వ. ఓ మనసా, కొందఱుపామరులు బయలువలననే సమస్తము పుట్టుచున్నదనియు, మఱుడి బయలందే లియ్యమగు ననియు, బయలే సర్వమునకు మూలమనియువచింతురు. ఆహా! ఏమి వింత! బట్టబయలు పుట్టుక లేనిదగుటచే నాశములేనిదేయగును కావున, సత్యమగుబట్టబయ లం దసత్యంబగుప్రపంచంబెట్లు పుట్టును? నరులకునరులును, మృగము లకుమృగములును, బసులకుఁబసులును, బక్షులకుఁబక్షులును, జీమ లకుఁజీమలును, దోమలకుదోమలును గలుగుచున్న వేగాని, యొకజాతి యందు వేఱొకజాతి గల్గుటలేదుగదా! విత్తనమునఁ జెట్టును, జెట్టున విత్తనమును గలుగుఁగాని బీజవృక్షములకు వేఱొకవిత్తనములేదు.అట్లే యాత్మవలన జగంబును, జగంబువలననాత్మయుఁ గలుగుచున్నది గాక, యాత్మజగంబులం బుట్టించుటకు వేఱొండులేదు. బీజభూజ విధంబు భూతలంబెఱుంగనిమాడ్కి, నాత్మ జగంబులజాడ పరిపూర్ణం బెవ్వఁ డెఱుంగదు. కావునఁ బరిపూర్ణం బెఱుకకు మూలంబుగాదు. వినుము.

## 13. కీర్తన. మోహనరాగము - ఆదితాళము.

ఎఱుకేమూలంబగునుగాక-విశ్వమున కెల్ల-నెఱుకే॥ ౧॥ ఎఱు కకుమూలం - బెఱుకేయెప్పుడు-నెఱుకకుమూలము - పరిపూర్ణముగా॥ దెఱు॥ ౨॥ ఆరయజననీజనకానుజహిత-దారాసుతపరి-వారబంధువుల॥ కెఱు॥ ౩॥ వరశాస్త్రాగమపంచభూతలత - తరుపర్వతసాగరబీజంబుల॥ కెఱు॥ ౪॥ హరిహరబ్రహ్మేంద్రాదామరార్క-శశి - నరమునివరకి - న్నర తారాతతి॥ కెఱు॥ ౫॥ క్రిమికీటకపశు - మృగవిహంగకుల - సముదయ మాది-చరాచరంబుల॥ కెఱు॥ ధర శేషాచల-గురుకటాక్షమున - నర సింహాఖ్యుఁడు - సరగునఁ బాసిన॥ యెఱుకే॥ ౬॥

క. కన్నుల కగపడుచున్నది, యెన్నంగా నదియునంత•యింతన రాకే,యున్నది పరిపూర్ణంబే, నెన్నఁటికిని లేనిదరయ•నెఱుకేమనసా.

వ. ఓ మనసా, యచలమెఱుకగాదు మఱపుగాదు, స్త్రీ గాదు, పురుషుఁడుగాదు, నపుంసకముగాదు, వెలుఁగుగాదు, చీకటి గాదు, లోపలఁగాదు, వెలుపలఁగాదు, దివిగాదు, భువిగాదు. ఊరు గాదు. అడవిగాదు. పగలుగాదు. రాత్రిగాదు. యుగములుగాదు. కల్పములుగాదు. నరులుగాదు. సురలుగాదు. శక్తులుగాదు. శశిగాదు. తరణిగాదు. తారలుగాదు.శరధులుగాదు.గిరులుగాదు. త్రిమూర్తులు

గాదు. దిక్పతులుగాదు. పదవులుగాదు. ప్రపంచముగాదు. భక్తిగాదు. ముక్తిగాదు. ఆత్మగాదు. అంతరాత్మగాదు. జ్యోతిగాదు. విరాట్టుగాదు. విధిగాదు. నిషేధముగాదు. నిష్ఠగాదు. శాంతముగాదు. జడముగాదు. మాటలుగాదు. మౌనముగాదు. తపముగాదు. వ్రతముగాదు. క్రతువుగాదు. తీర్థముగాదు. దానముగాదు. గుడిగాదు. జ్ఞానముగాదు. జ్ఞేయముగాదు. సమస్తమునుగాదు. సర్వశూన్యమునుగాదు. కన్నుల కెదుటఁ బ్రత్యక్షముగాఁ గనుపించు పరిపూర్ణమెట్లు శూన్యమగును. మెఱపు తీఁగవలెఁ గనుపించి మరలఁ గనుపించకపోవు మాయయే శూన్యమనఁదగుఁగాని, పరిపూర్ణముశూన్యమని చెప్పఁదగదు. వినుము.

## 14. కీర్తన. జంఝూటిరాగము – అటతాళము.

పరిపూర్ణమందున లేనిదేగనుపడెను నీమాయ–కనుపడెను నీమాయ–గణుతింపలేదాయెఁ॥పరి॥ చెలఁగిబయలేయెందునను భా– సిల్లుచున్నది–భాసిల్లుచున్నది – గాసిల్లకున్నది॥పరి॥ గురుకరుణలేకయజాదులకునది–యెఱుఁగ రానిది–మది–నెఱుఁగరానిది–మఱుఁగేమిలేనిది॥ పరి॥ ఎఱుకమఱపులులేనియచలం–బెఱుఁగునదియెఱుకే–త – న్నెఱుఁగునది యెఱుకే–మఱి–లేకపోనెఱుకే॥ పరి॥ స్థిరముగాగురుకృపనుగనునర – సింహకవిమాట–నరసింహకవిమాట–మఱి–విన్నబహుతేఁట॥ పరి॥

క. అండాండము పిండాండము, నుండునులే కుండభ్రాంతి • యుండకయుండు, న్నొండనఁగ రాకయెందున, నుండియు లేకున్నదదియె • యున్నది మనసా. ౧౬

వ. ఓ మనసా, యండమనఁగా భూమి. పిండమనఁగాఁ జరాచరములు. బ్రహ్మాండమనఁగాఁ జంద్రార్కనక్షత్రాది యుతంబగు నాకసము. ఇవియే ఖండంబనఁబడు. అఖండమనఁగాఁ బ్రకృతిరూపమూలంబగు పరాత్మయనంబడు. ఇవి రెండును లేక తోఁచునవి. విచారించఁగా లేనివి. మఱియుఁ దోఁచుట తోఁచకుండుటలు లేకుండునది. ఉండియు నామరూపక్రియాదులు లేనిది. ద్వంద్వములుగానిది. ఎందున్నుంగలది. ఖండాఖండవిగతమైనది. కేవలాత్మయనంబడు నీనిజమెఱుంగని మాయావాదులు కొందఱు పరిపూర్ణమాకసమని వచింతురు. అట్టి గాబ్బారువాక్యము లెన్నఁడును నీవు వినకుము. ఏమి

యు లేని పరిపూర్ణ మాకసమెట్లగును? నభంబునకు శబ్దమేగుణము. పరిపూర్ణము శబ్దరహితము. గగనము శూన్యమైనచో నని లాదిభూత ప్రపంచము లెట్లుగల్గె? కాన, నంబరము సమస్తదోషాస్పదమైన మాయగాని గుణశూన్యమెప్పటికిని గానేరదు వినుము.

## 15. తోహరా.

పరబయలేనిజమాకసమాది - ప్ర - పంచ మంతయునుమాయె - సరులందఱికినిజంబై తోఁచెడి - యెఱుకేగనలేదాయె॥ ౧॥ పలురూపంబులు మాయచిత్రమిది - భ్రాంతులకూటమిసంత - కలయేయీజగమంతతిరంబుగఁ - దలఁపలేదునిజమింత॥ ౨॥ వినివివరింపరుకనికానరు బయలనవరతము ప్రజలెల్లఁ - గనిగ్రుడ్డియువిని చెవుడనుసామ్యము - గానున్నది విలసిల్ల॥ ౩॥ బయలన్నదిబయలగునాబయలను-భావము బ్రహ్మంబగునా - బయలన్నదితావిన్నది - భ్రమయది బయలనఁదగునా॥౪॥జోకతో శేషాచల సద్గురుకృప - లేకబయలుబయలగునా - ప్రాకటముగ నరసింహదాసుహిత - మరయక భ్రమతలుదెగునా॥౫॥

క. శివజీవుల దేఁకము

శివుఁడూడిన లోకమేది ♦ జీవుండేడీ,
శివుతోడ మునిఁగెసర్వము,
శివజీవులు మాయబయలె ♦ స్థిరమగు మనసా. ౧౮

వ. ఓమనసా, కేవలాత్మపుట్టినదిగాదు, దేనింబుట్టింపదు, పెంచదు, త్రుంచదు, చొక్కదు, చిక్కదు, పెరుఁగదు,విఱుగదు, కఱుగదు,అరుగదు,తిరుగదు, ఎఱుఁగదు, కదలదు, మెదలదు, చెదరదు,పదరదు,ముదురదు, చావదు, అందదు, పొందదు, సందులేక యెందుననొక్కటై, శబ్దస్పర్శరూప రసగంధాదులులేక, ప్రపంచరహితమై, హరిహరహిరణ్యగర్భాదులకతీతమై, మునిబృందారకగణంబులకు ముఖ్యమై, మాయావాదుల కగమ్యమై, ప్రాజ్ఞులకుఁ బ్రత్యక్షమై, నిష్కళంకమై, నిర్వికారమై, నిరంజనమై, నిర్గుణమై, నీరంధ్రమై, నిర్భిన్నమై, యిట్టిదట్టిదని నిర్దేశింపరాక, విలసిల్లునదియే పూర్ణ తత్త్వం బనఁబడు. వినుము, 19

## 16. కీర్తన. జంఝూటిరాగము - అటతాళము.

పూర్ణతత్త్వము-పూనిచూడవిచిత్రము- పూర్ణతత్త్వంబరయఁజాలని-బూటకులకే మెఱుకది॥ పూ॥ ఏమిగానిది - కామాదిగుణములు

లేనిది-భూమియాదిగ భూతపంచక - భువనములుగాకున్నది॥ పూ॥ చెప్ప రానిది - గొప్పకొద్దులుగానిది - అప్పుడిప్పుడు మాఱిపోకది-యెప్పుడొక విధమున్నది॥ పూ॥ రక్తిఁజెందదు - ముక్తబంధములొందదు-యుక్తిసల్ప దుశక్తిఁజూపదు - ఊహాపోహాలుసేయదు॥ పూ॥ శుద్ధమైనది- శేషాచలా ర్యుల కరుణది - సిద్ధముగనిలఁబోలకం నర-సింహకవిమదిఁగన్నది॥ పూ॥

క. తాననిన విశ్వమనినను, నేనసిన్ మేనఁటన్న ♦ నిఖిలము మా
యే, తానేననుభావంబులు, లేనిదెయచలంబు తెలియ ♦ లేరది మనసా.

వ. ఓ మనసా, తాననఁగా మూలములేని మాయయనంబడు. అట్టి మాయయందే జీవేశ్వరులు, మంచిసెడ్డలు, పుణ్యాపాపములు, స్వర్గనరకములు, జ్ఞానాజ్ఞానములు, బంధమోక్షములు, ఎఱుకమఱపులు, స్త్రీపురుషులు, బీజజడములు, శుక్లరక్తములు, నీరన్నములు, భూనభములు, సూర్యచంద్రులు, నరసురలు, జననమరణములు, ధర్మాధర్మములు మొదలైన ద్వంద్వములు గలిగియుండు. ఇవి యెల్ల నెఱుకను భ్రమచేఁ జుట్టఁబడినవారికే గలవు. ద్వంద్వరహితమగు పరిపూర్ణ భావజ్ఞుల కెన్నఁడును గలుగ నేరవు. వినుము, 20

## **17.** కీర్తన. తోడిరాగము.- ఆదితాళము.

జగమిదిమాయల దేతంత్రం- జగదాత్మయెగనఁజిన్మయమంత్రం- అగణితమగుబయలందర్ జెందర్ - దగమృష యేపో - తంత్రంమంత్రం॥ జగ॥ ౧॥ కలలోఁదోఁచిన దేగాత్రం - కలకును మొదలిటిదేసూత్రం - అలయచలంబునుదెలియర్ వెలయర్ - కలయులనిల్లే-గాత్రంసూత్రం॥ జగ॥ ౨॥ పరిపరిరూపములేఖండం - పరమాత్మరూపమేయఖండం - పరిపూర్ణంబును నెఱుఁగర్ సరిగర్ - కరముహులిక్కేఖండమఖండం॥ జగ॥ 3॥ వాదభేదములనే వేదం - పాదైయున్నది యేనాదం - వేదాంతమువివరించన్నెంచర్ - గాదేదబ్బర వేదంనాదం॥ జగ॥ ౪॥ పరిపూర్ణంబే గురురూపం - ఎఱిఁగిన దేశిష్యునిరూపం - ధర శేషాచలగురునిర్ బరునిర్ - మఱవం నరసింహాఖ్యుండన్నది॥ జగ॥ ౫॥

క. చూపులచేఁ గనరానిది, చూపింపఁగ రానిసర్వ ♦ శూన్య
పదంబుఁ, జూపించు గురుఁడుసాజ్ఞను, నేపారఁగఁ దోఁచునదియె ♦
యెందున మనసా. ౧౯

వ. ఓమనసా, కొందఱు వివేకశూన్యులు పల్కు భావములేని పరిపూర్ణమును సేవించుటవలనఁ బ్రయోజనం బేమనియందురు. నిక్కడ దెలియనేరని భ్రమికుల పల్కు లేమనవచ్చు. ఆహా! యిలా తలంబునఁ గలనొందినవాఁడు జాగ్రత్తను గన్నయంతనే స్వాప్నానుభవము దబ్బరమై, తద్భ్రాంతి వదలినట్టు లెఱుకయనెడు కలలోనచలమనెడు మెలఁకువంగాంచినతోడనే యెఱుకయను స్వప్నంబుఁ బాసి, జగదనుభవ కర్మజన్మబంధంబులు దొలఁగినవాఁడగు. అదియే పరిపూర్ణదర్శన ఫలంబు. అంతకంటె వేఱొండు ప్రయోజనంబు గలుగనేర్చునే. మఱి యిట్టివిపరీత భావంబులు సేయువారు, తాము మాయయను ముసుంగునంబడి, జననమరణాది విపత్తులందగిలి చెడుటయే సిద్ధంబుగాక యేమిసార్థకంబు ఘటింపఁగలరు? వినుము. 21

## 18. తో హ రా.

అంతయుఁబరిపూర్ణంబేగనుమది - యరయఁగ లెందునఁగలదు - ఎంతయునీ వితరాంతరంబులగు - భ్రాంతులు చెందఁగవలదు॥ ౧॥ అది ఇదిచూచుటయంతయుభ్రమయే - యదియిది యేదియగాదు-అదియు నవాఙ్మానసగోచరమై - యలరుదానిప్రతిలేదు॥ ౨॥ ఘనముద్రాసన యోగతపంబులఁ - గష్టించినఁగనరాదు - నొనరఁగ మదిగుదియించి యింద్రియము-లుడిపినఁజిక్కఁగఁబోదు॥ ౩॥ రేచకపూరకకుంభకంబులను - రీతులుగాదదియెన్నఁ - దోఁచదుతోఁచినయోచనలన్నియుఁ-జూచినదంతయుసున్న॥ ౪॥ వరశేషాచలగురుకటాక్షమే - పరమపదంబగుఁగాఁక-మఱియొకటున్నదె నరసింహాఖ్యుని - మాటగ్రహింపఁగలేక॥ ౫॥

క. ఆవరణంబులఁ బొందిన, దే వివరింపంగ మాయ దెలియుమయెందుర్, ఆవరణము మితిగలది ని, రావరణ మనంతమదియె యచలము మనసా.

౧౯

వ. ఓమనసా, నిక్కమెఱయక టక్కుభ్రమలంజిక్కుట గ్రుడ్డివారు హస్తింగన్న విధంబగు. ఎట్లనిన; కాశ్మీర దేశంబున మిథిలయను నొక పట్టణంబుగలదు. మఱియందుఁ బుట్టంధులు నల్వురుండిరి. వారు నల్వు రొకనాఁడొకచోటం గూర్చుండి మాట్లాడుచుఁ బ్రసంగవశంబున, 'మన మేనుఁగుంజూడఁగందుమా' యని యొకరితో నొకరు

చెప్పుకొనుచుండ, నందుండిన యొక పుణ్యపురుషుం డదివిని వారి యందు మిగులదయాళుండై, సత్వరంబునంబోయి, యన్నగరంబెల్ల వెదకి, యొకమత్తేభంబుఁగొనివచ్చి వారియెదుటనిల్పి, 'యోయంధు లారా! ఇదిగో వారణంబుంజూడుఁ' డని పల్కినయంత హర్షంబున లేచి వారిలోనొకఁడు కరితుండంబును, వేఱొకఁడు కాలును, నొం డొకఁడు తోఁకను, మఱియొకఁడు కర్ణంబును, దమతమ కరంబులం బట్టుకొని తడవిచూచి, తమలోఁదాము దంతింజూడఁగంటిమని సంతో షించుచు, మగుడి యథాప్రకారము గూర్చుండిన యంధులంజూచి, తొలుత ద్విరదంబుఁదెచ్చి చూపిన పురుషుండు 'హస్తియెట్లున్న?' దని యడిగిన, మొదటివాఁడు 'గజము రోఁకలివలె నున్న' దనియు, రెండవవాఁడు 'రోటివలెనున్న' దనియు, మూఁడవవాఁడు, 'చీఁపురు కట్టవలెనున్న' దనియుఁ, నాలవవాఁడు, 'చేటఁవలెనున్న' దనియుఁ జెప్పిన నతండు మీరు నల్వురును నిజమెఱింగినవారే యని పరిహ సించుచుఁబోయె. అంత వారిలో వారు నిజముగన్నటుల నొకరినొకరు మెచ్చక యాక్షేపించుకొనుచుఁ గలహంబుమెండై, యందుండక, క్రోధంబులుపెనగొనఁ దమతమ నిలయంబులకుంజనిరి. అట్లు ప్రజ లు నిజమగు నచలబ్రహ్మము నెఱుంగక భ్రాంతులై పట్టుదలతో వాదించుచుఁ బలు తెఱంగులఁ జెప్పుకొనుచుందురు. అట్టి భ్రమలం జెందక యథార్థం బెఱుంగవలయు. వినుము. 22

## 19. కీర్తన. జంఝూటిరాగము – జుల్వతాళము.

ఈరూపమారూప మేరూపమునుగాక – యీాయుత్తబయలొ క్కటున్నదయా– వేఱెద్దిగలదింకవివరించిచూడంగ – విశ్వమెల్లను బెద్ద మాయేనయా॥ ఈ॥ ౧॥ భ్రమయెనిక్కంబంచు భావించిపండితులు – భ్రమసిగాబారుగవ్రాసిరయా – సమలీలనటువంటిజను లెండమావులను జలమున్న దనిచెప్పఁ గలవారయా॥ఈ॥౨॥ లేనట్టియిలమాయ లేదనక కలదంచు–లేదంచుఁబల్కుర దేమోనయా– మేనంద మేధ్యము మెండుగఁ బూసుక–దానిఁగడిగినరీతిగానుందయా॥ ఈ॥ 3॥ ధరలోన శేషాచలా ర్యులఘునదివ్య–కరుణేనిదానమని యెఱుఁగుమయా–ఎఱుకే మిథ్యయనె డు నరసింహదాసునకుఁ – పరిపూర్ణమే సత్యమాయెనయా॥ ఈ॥ ౪॥

క. ఇలకు యుగములకుఁగల్పం, బులకును గల్పాంతములకుఁ ♦ బూర్వము వెనుకన్, గలయచలంబే సత్యము, నిలుకడలే నట్టిమాయ ♦ నిక్కమె మనసా. ౨౦

వ. ఓ మనసా, నిలుకడలేనిదనఁగా స్థిరములేనిది. నిలుకడయనఁగా నెప్పుడునుండునది. అదియే పరిపూర్ణము. నిలుకడలేనిదే మాయ. మాయయనఁగా భ్రమ. భ్రమయనఁగా లేనిదున్నట్టు తోఁచుట. లేనిదనఁగా స్వప్నమం దనేకరూపములు గాన్పించుచు మేల్కనిన నొక్కటియైన లేకపోవుట. ఇదియే చిన్నస్వప్నము. జాగరమునఁ గలిగిన ప్రపంచానుభవము పెద్దస్వప్నమనంబడు. కలయందెఱుక లేకున్న స్వప్నానుభవంబెట్లు చెప్పఁగలుగు? స్వప్నవ్యాపారములును, జాగ్రద్వ్యాపారములును సమంబులగు. కలవట్టిదనిన జాగ్రతయు వట్టిదే. ఎట్లనిన: కలయందున్నపుడు కలయే నిజముగాఁ దోఁచు. జాగరంబునఁ బ్రపంచమే సత్యముగాఁ గనుపించు. నిద్రయందీరెండును లేకపోవు. అందుచే మాయవట్టిదని చెప్పవలసె. వినుము,

## 20. కీర్తన ఫీల్ రాగము – అటతాళము.

ఇంద్రజాలమురీతి–నిలదోఁచుటాయె– నిద్రయందుసనింక – నేమి లేదాయె॥ ఇం॥ పుడమివింతలుతోలు–బొమ్మలివిచూడ–నొడయడెవ్వడు దీని – కునికిలేదేడ॥ ఇంద్ర॥ మొదలువచ్చుటయెట్లు – మూలంబె లేదు–తుదనుబోవుటయెట్టు–లదిగానరాదు॥ఇం॥ ఎవరుగొనివచ్చిరి – యీమాయనెల్ల–నెవరుగొనిపోయిరి–యిదియెల్లఁగల్ల॥ఇం॥ అరయంగ శేషాచలార్యుసత్కృపను–నరసింహాఖ్యుఁడువాసి – నట్టిఘనమాయె॥ఇంద్ర॥

క. కనుదెఱచినఁ గనుపడునిల, కనుమూసినఁ గానరాదు ♦ గావునవిశ్వం, బునుగలయం దనుభవమై, గనుపడుమేల్కనినజగము ♦ గలదే మనసా. ౨౧

వ. ఓ మనసా, పరిపూర్ణమందుఁ బంచభూతంబులును, రవిసుధాకరతారలును, నగారణ్యసముద్రంబులును, నరసురమృగ పశుపక్షి క్రిమికీటకాది జంతుజాలంబులును, దరుబీజలతాయుత చరాచర ప్రపంచము నున్నట్లు తోఁచుటే భ్రమ. చూచుట భ్రమ. భ్రమ లేకున్న నొకటియైన లేదు. భ్రమచేతనే సమస్తముగలుచున్నది.

భ్రమవిడిచినఁ బరిపూర్ణమునకంటె నేమిలేదు. సమస్త దేశములందును, వివిధవస్తువులందును, నిండి నిబిడీకృతమై, సర్వకాల సర్వావస్థలను జలనములేక పరిపూర్ణమే గలిగియున్నది. లేనిభ్రమ యెప్పుడును లేదు. లేనిభ్రమలేదని యెఱుంగుటే భ్రాంతిరహితము. లేనిభ్రమ గల్పించుటయే యధ్యారోపము. లేక దోఁచు గారడిమాయ నిక్కమని భావింపందగదు. వినుము. 24

## 21. కీర్తన. యమునాకల్యాణిరాగము – అటతాళము.

వట్టిరజ్జుభుజంగవతుగఁ – బ్రపంచమరయనబద్ధము – బట్టబయలొక్కటియెనిజమై–పరగుచుండుటసిద్ధము॥ వట్టి॥ స్థాణుతస్కరున్యాయముగను– దనరులోకమబద్ధము–సానుగాఁబరిపూర్ణతత్త్వమె–సత్యమగునది సిద్ధము॥వట్టి॥శుక్తిరజితభ్రమగఁగనుపడు – చుండువిశ్వమబద్ధము – యుక్తముగనచలంబదొక్కటె–యున్నదెప్పుడుసిద్ధము॥ వట్టి॥ ఎండమావులరీతిఁదోఁచుచు – నుండుజగములబద్ధము–దండిగానాకేవలాత్మయె – తథ్యమగుటయుసిద్ధము॥ వట్టి॥ క్రాలశేషాచలగురునికృపఁ–గనినతనువులబద్ధము – పోలకంనరసింహదాసిలఁ – బొందునచలమెసిద్ధము॥ వట్టి॥

క. అంతమువిద్యల కెల్లను,
నంతము ధర్మములకెల్ల ♦ నంతంబిలకు,
న్నంతం బఖిలంబునకు న,
నంతమె వేదాంతమందు ♦ రార్యులుమనసా. ౨౨

వ. ఓ మనసా, కొందఱు మూఢమతులు వేదాంతమనఁగా నేమని వాదింతురు. వేదములు ప్రపంచాత్మల కనుగుణముగా జ్ఞానకర్మముల బోధించుచు మాయను స్థాపించుచున్నవి. కావున, వేదములవలన నచలంబు దెలియరామింజేసి, యచలము సమస్త వేదాతీతమని దెలియవచ్చుచున్నది. అందుచేతఁ బరిపూర్ణమే వేదాంతమనియు, వేదాంతమే పరమపదమనియు బుధజనంబులు పరిగణించి వక్కాణింతురు. అట్టిభావంబు సమగ్రముగా నెఱింగిన వారికి సమస్తమును దెలియవచ్చు. కావున, 25

## 22. తొ హ రా.

భావనసేయర వేదాతీతమె–పరిపూర్ణంబనినమ్మి– సావధానమున మాయనుబాయుము–సంశయములువిడఁజిమ్మి॥ ౧॥ పట్టముట్టఁగా రాక

యుబయలే - పట్టునవొకవిధమగుచుఁ - జట్టురీతిఁగనుగదలకయున్నది-సకలమునకు వేఱగుచు॥ ౨॥ముందు వెనుకలన రానదియుందు - దెందున నొక టీయంచ - ఎందుఁజూచిననుముల్లుమోపనిక - సందులేనిదది గాంచ॥ ౩॥ ఉన్నబయలువీక్షించిననీవే-యుండ లేవిఁకొక్కింత - పన్నగనీవును లేనియప్పుడే - సున్నచూడజగమంత॥ ౪॥ పరువడి శేషాచల గురుకృపఁబర - బయలుసేరు టేఖ్యాతి - నరసింహాఖ్యునిహితవచనము విని-యెఱుకదొలంగు టెనీతి॥ ౫॥

క. ధరముద్ర యోగములు దు, ష్కరసాధన లెల్లనొక్క గవ్వకుఁగొలఁగా, వరయఁగ సాధన లెవ్వియుఁ, బొరయని పరిపూర్ణ బోధఁ బొందుము మనసా. ౨౩

వ. ఓ మనసా, జగంబునఁ బరిపూర్ణభావంబు దెలియనేరక కొందఱు బ్రహ్మవిష్ణు మహేశ్వరుల ధ్యానింతురు. కొందఱు క్రతు వ్రతదాన తీర్థాది కర్మములే శ్రేష్ఠములని గావింతురు. కొందఱుపంచ ముద్రలే ముక్తిదములని సేవింతురు. కొందఱు మంత్రలయ హఠ యోగంబుల సాధింతురు. కొందఱు సాంఖ్య తారకా మనస్కంబుల పఠింతురు. కొందఱు చక్రషట్కంబున మనంబు గీలించియానందింతురు. కొందఱు తపంబుసలిపి యణిమాదిసిద్ధులంగాంతురు. కొందఱు పరకాయప్రవేశ విద్యల వర్తింతురు. ఇవియెల్ల నెఱుకసాధనలేగాని, యిందొకటైన భ్రాంతిరహితమగు నచలభావంబుగాదు. కావున, 26

## 23. కీర్తన. నాదనామక్రియ రాగము - ఆదితాళము.

సాధన లేటికిరోరన్న-గురు - బోధఁదెలియరామాయన్న - బోధలన్నిఁటికి మేధయైనఘన - బోధయచలమేగాధలు లేనిది॥ సా॥ ౧॥ పుట్టుగిట్టులదియోరన్న-యీ - చట్టమాయరయోరన్న-బట్టబయలు ధర్శించిననీకిఁక-బుట్టుక లేదురమాయన్న॥ సా॥ ౨॥ చిత్తుగాదురాయోరన్న-యది-సత్తుగాదురామాయన్న-ఉత్తదియేమిలేనిదిదాని - యుపమెఱుంగరామాయన్న॥సా॥ ౩॥ క్రిందుమీఁదులను - సందుగొందులను-ముందువెన్కలనునోరన్న - యెందెందునదిశలెల్లబయలుసం దెందున లేదుర మోయన్నా॥ సా॥ పరిపూర్ణుండగు శేషాచల-సద్గురుకటాక్షమునవోరన్న మఱిమఱిఁదెల్పెడి నరసింహాఖ్యుని - మాటనువినరామాయన్న॥సా॥ ౫॥

క. మించు కలవంటిదే యని, పంచదశాక్షరియుఁ బల్కు ♦ బయ లేమియులే, దంచును ద్వాదశి, షోడశి, నెంచంగా లేదు మేను ♦ లెప్పుడు మనసా. ౨౪

వ. ఓ మనసా, కొందఱు కనులుమూసి, భ్రూమధ్యమునఁ జూపునిల్పి, పండువెన్నెలలోపల బయలుగనవలెనందురు. మఱియు. నది నేమెఱుక. అది నిలువనేరదు. జాగరంబునఁ జూచినది, తోఁచినది సమస్తము మాయయేగాని యచలముగాదు. అచల మేసాధనము లేక, కనులుమూసినను, తెఱచినను బ్రత్యక్షముగాఁ గనుపించు చున్నది. లేదులేదని వాదించినను బరిపూర్ణమే నిండియున్నది. కలదు కలదని దృఢముగా నమ్మినను, నెఱుకే నిశ్చయముగా లేనిది. విశదంబగు నిట్టి మర్మ మెఱుంగక వట్టి భ్రమల రట్టువడు భ్రష్టులవాక్యంబు లెట్టితఱిం జెవిఁబెట్టక, గట్టిగాఁ బరిపూర్ణము సేవించి, లేనికలఁ బాయుమని చెప్పి. మఱియు నిట్లనియె. 27

## 24. కీర్తన. శ్రీరాగము – అట తాళము.

కలఁబాయవే–యలబయలుగాంచియును నెంతయుఁ – గలఁబాయవే॥ తలఁపులన్నియువ్యర్థమగునీ–నిలుకడను దెలిసికొనకుండిన – కలను గల్గిన యనుభవంబును–గలిగిమేల్కొన లేనివిధమున॥క॥౧॥ పుట్టిగిట్టదు రట్టుఁజెందదు – పట్టువడదే మాయలనునా – బట్టబయలొక్కటియె సత్యము – వట్టిదేజగమంతయును భ్రమ॥ క॥ ౨॥ ఇట్టిదట్టిదనంగరాని – యట్టిదానికిబట్టబయలని – వట్టిభ్రమదోఁచియును బేరును–బెట్టిమాయే వట్టిదాయెను॥ క॥ 3॥ యుగములునుగల్పంబులైనను – జగములన్నియుఁ దెగినఁదెకగయె – మిగిలియుండినయచలమందున – మిథ్యవిశ్వభ్రమలు సర్వము॥క॥౪॥ అమలుఁడగు శేషాచలార్యుల – విమలకరుణారసమునన్ మది – స్థిమితమొందినపోలకంనర–సింహకవియభిమత మెఱుంగుచు॥ క॥

క. తనువింద్రియములు విషయము, లనువొందఁగ మనము తలఁపు ♦ లాత్మయనెడిమా, యనువిడిన వారి కచలము, ఘనమగుఁగా కన్యులకును ♦ ఘనమేమనసా. ౨౫

వ. ఓ మనసా, నీచులు తమనీచవృత్తియే యెక్కువయని సద్వృత్తిందూలనాడుట, యంచలవంచించిన కొంచలగతియగు. ఎట్లనిన;

వింధ్యాచలసమీపంబున నొకవిశాలంబగు హ్రదంబు శోభిల్లు. అం దనేకబకంబులు నివాసంబుసేయుచుండు. అంతనొకనాఁడు క్రౌంచంబు లామడుపుపొంత విహరించుచు నచ్చేరువం గనుపించుచుండిన కొన్ని మరాళంబులంజూచి, 'యివి మనజాతిపక్షులవలెనున్నవి, నిక్కంబిట కెందుండివచ్చెనో విచారింత' మని యోచించి సత్వరంబున వానిచెంతకుఁబోయి, 'మీరెవ్వరు ? మీ నివాసమెద్ది ? మీ కాహారమేమి ?' యని యడిగిన, నవి, 'మేము హంసలము, మాయునికి మానససరోవరము. మాకాహారము జీవమణు' లనిన గ్రొంచఁ, 'లాహా! మీరుండుచోట నత్తలులేవో ?' యన నంచలు 'రత్నములుగాని నత్తలులే' వనినఁ, గ్రౌంచములుఁ 'ఛీ, 'ఛీ, నత్తలులేనికొలను పర్ణవర్జితంబగు భూజంబునూడ్కి వృథా' యని నవ్వి, హేళనముగావించె. అట్లు లోకులకు సహజంబగు మాయయే ఘనపదంబుగాని, నిక్కమగు నచల మెప్పటికి నెక్కువగా నేర దనిపల్కి, మఱియు నిట్లనియె. 28

## 25. తో హ రా.

కనఁబడునచలం బెఱుఁగకకన్నులు - గల్గియునంధకులైరి-కనినవారలది కోటికొక్కరిల - గణుతింపఁగనరుదైరి॥ ౧॥ మాయావాదులు మాయనుబడిచెడు - మాయనమ్ముదురుగాని-వేయిభంగలను జెప్పిననచలము - వివరింపరుమదిఁబూని॥ ౨॥ కలలోవచ్చియుఁగలలోఁజేయుచుఁ-గలవ్యాపారములెల్లఁ - గలలోఁజచ్చియుఁ గలలోఁబుట్టుచుఁ - గలఁబాయఁగలేరెల్ల॥ 3॥ నానావిధభ్రమలందునఁదగిలిన - నరులతిప్పలేమందుఁ-బూనియగర్తనుబడుమార్జాలము-పోలికగాదేమెందు॥౪॥ అధములకును శేషాచలగురుకృప - నందఁగసాధ్యంబగున - పృథివిలోనరసింహదాసుహిత - మెఱుఁగకమాయలఁదెగున॥ ౫॥

శ్లో॥ సర్వశూన్య మయంరూపం । జన్మశూన్యం స్వభావతః ।
జన్మాభావే నమృత్యుశ్చ । పరిపూర్ణం స్వభావతః ॥

వ. అని యిట్లార్యోక్తి గలిగియున్నది. కావునఁ బరిపూర్ణమే సత్యమగుదేవుఁడు. అంతకంటె వేఱొకటిలేదు. ఉన్నదనిన నచలము దక్క నేమియున్నది. జన్మనాశంబులుగల సమస్తమును లేనిదేగదా యదార్థంబు. ఇట్లు దృఢంబుగాఁ దెలియంబడుచుండ. 29

క. హరియని యజ్ఞుఁడని శివుఁడని, సురపతియని బహువిధములఁ ♦ జూచెదరిలలోఁ, మఱివీరలు నిజమైనను, బరిపూర్ణము తోడనిల్వఁ ♦ బడరేమనసా. ౨౭

వ. ఓమనసా, ప్రపంచజనంబులు దేవుండొక్కఁడనియు, నతనికి నామరూప కర్మ జన్మనాశంబులు లేదనియు, సతిసుత బంధువర్జితుండనియు, నతఁ డెవ్వరికిం గనరాఁడనియు నెందునుం గలఁడనియు సహజముగాఁ జెప్పుకొనుచున్నారు. మఱియీజనవాక్యము కేవలాత్మకు సహజమైయున్నది. వారట్లు చెప్పుకొనుచుండియు, మరల నామరూపక్రియలు గలవారి దైవములని భ్రమించు పామరజనుల నేమనవచ్చు. ఆహా ! లోకుల పల్కులు వాచ్యార్థములేగాని, పరిపూర్ణంబిట్టిదని లక్షింపనేరరు. వారికిలేక గనుపించుగారడీ మాయయే నమ్మకము. పరిపూర్ణము నమ్మఁజాలరు. వారే మాయను దాఁటలేనివారు వారే ప్రత్యక్షమాయకులు వినుము. 30

**26.** కీర్తన. శంకరాభరణము – ఆదితాళము.

ఎంతోచిత్రముచూడ – నీలోకవార్తలు–ఇంతనిక్కము లేశ–మింతైనఁగనలేరు॥ ఎంతో॥ ౧॥ పుట్టుగిట్టులులేనిది – బట్టబయలేగాని–పుట్టిగిట్టెడుమాయ – యెట్టులనిజమౌను॥ ఎంతో॥ ౨॥అంతటఁగలిగిన–దచలమొక్కటెగాక – అంతటింతటఁదోఁచు – నంతటిదేమాయ॥ ఎంతో॥ 3॥ పట్టిమాయనునమ్మి–గట్టిగజగమంత–పట్టినిల్పుదమన్నఁ– బాయకుండునెమాయ॥ఎంతో॥ ౪॥ అరయంగ శేషాచ – లార్యునికృపచేత – నరసింహాఖ్యుఁడుదెల్పు – సరణినెఱిఁగినవారి॥ కెంతో॥ ౫॥

క. ఇమ్మెగఁ బ్రపంచబోధలు,
కమ్మఁదనము గానియచల ♦ ఘనబోధవినక,
నెమ్మది రుచిపుట్టదు ని,
క్కమ్ముగనిల నెంతవారి ♦ కైననుమనసా. ౨౮

వ. ఓమనసా, తాను మునిఁగినదే గంగయనియుఁ, దా వలచినదే రంభయనియు నను లోకసామ్యంబున, జనులు తమ కిష్టమగు జపతప వ్రతక్రతుదాన తీర్థాచరణంబులం దగిలి, యెఱుకయను స్వప్నంబున మెలంగుచు, భ్రమయను మహాసముద్రంబునఁ జలనం

బను నోడ నెక్కి, జననమరణంబులను రాకపోకల నటింతురు, గాని యెప్పటికిని నచలమార్గంబుఁ జొరనేరరు. లోకంబున నచలమార్గమే నిక్కిలి తేఁటయగు రాజబాట. ఆమార్గంబునఁ బోయినవారి కెన్నఁటికిని రాకపోకలులేవు. ఇతరమార్గంబులన్నియు దొంగత్రోవలు. మఱి యేమార్గంబులఁబోయినను భవంబులను సంకెళ్లు దప్పనేరవు. కావున,

## 27. కీర్తన. ముఖారిరాగము - అటతాళము.

కన్నులకెదుట నచల-మున్నదిగానవేర - మిన్నగునిష్ఠ లేల-బన్నములొందమేల॥ ౧॥ కాయమునునమ్మరాదు - న్యాయంబాత్మగాదు - మాయ - యది - నిల్వఁబోదు-ఈయిలభ్రాంతిలేదు॥ కన్ను॥ ౨॥ పట్టుగబయలుగన్న-వట్టిది విశ్వంబెన్న- గుట్టిది దెలియుమన్న-పుట్టునుగిట్టుసున్న॥ కన్ను॥ ౩॥ మతవర్ణాశ్రమములు - క్రతుజపవ్రతదానములు-క్షితిఁగల్గుతీర్థములు - హితవునుజూపఁగలవె॥ కన్ను॥ ౪॥ ధర శేషాచలార్య - కరుణాతిశయమునను-నరసింహదాసిలను-సరగునఁగన్నబోధ॥కన్ను॥౫॥

క. తనువు లిలఁదోఁచు నిజముగ, దనువునఁదా నున్నవేళఁ దానేగినచోఁ, దనువుమృష తానబద్ధము, తనుఁదాఁగనుటిల్ల జగము దబ్బరమనసా.          ౨౫

వ. ఓమనసా, లేకతోఁచు శరీరాత్మల నిజమని నమ్మికొని యుండుట బూరుగుపండ్ల కాశించిన విహగంబులచందంబగు. ఎట్లనిన వినుము. దండకారణ్యంబున ఘనంబగు శాల్మలీభూరుహంబొండుగలదు. మఱియు నమ్మహీజంబు చక్కఁగాఁబూచి కాచుచుండె. ఆఫలంబుల కపేక్షించి, పులుఁగు లనేకము లాభూజం బాశ్రయించి యుండె. అంతనాఫలంబులు చక్కఁగా ఫలించినతోడనే యా పక్షులవి భక్షించుటకై మిగులహర్షించుచుఁ దీవ్రంబునఁ దమముక్కులతో నాపండ్లను బుటపుటఁబొడిచిన నవిపొట్టలువిచ్చి, వానియందుండు దూది గాలికి లేచిపోవుటం జూచి, "యకటా! మన మిన్నిదినంబు లిటఁగాచుకొని యున్నను మఱియాఫలంబులుదిన నుపయోగింపకపోయె" నని, పెన్నిధిం గోల్పోయిన చందంబున ఘోరముగాదుఃఖించుచుఁ బక్షు లావృక్షంబువిడిచి చనియె. అట్లునిజమెఱుంగక భ్రమరూపకమగు వట్టిమాయనమ్మినవారు గట్టిగాఁ దుదకు నిష్ప్రయోజకు లగుదురు. కావున,

## 28. కీర్తన. నాయకీరాగము - ఆదితాళము.

నిజమైనబయ లేగను-నిఖిలంబుమాయరా - నిజమొకటిలేదుర - నిశ్చయము నెంచరా॥ ని॥ గగనానిలాగ్నిజల - ఘనభూములాదిగా - జగమెల్లఁ దెగిపోయిన-మిగిలియుండునది॥ని॥ పరమేష్ఠి శ్రీశంకర-హరినిర్జరేంద్రాదుల-కరుదైనభావంబది - కడుసులభమైనది॥ ని॥ స్థిరముగనుసాందీపులా-శ్రీకృష్ణమూర్తికి-నరుదారబోధించిన-పరమరహస్యము॥ ని॥ధరలోన శేషాచల-గురుమూర్తి కృపను - నరసింహదాసుమది - కిరవొందు భావము॥ ని॥

క. బట్టబయలన్న పదమును, గుట్టెఱుఁగనివారికదియె గూఢంబగు నా, గుట్టెఱిఁగినఁ బ్రత్యక్షము, బట్టబయలు సులభమగుచుఁ బరఁగునుమనసా. 30

వ. ఓమనసా, పరమరహస్యమే బట్టబయలనియు, సూక్ష్మములో మోక్షమనియు వచించు పెద్దలవాక్యమే సత్యము మఱి యేసాధనంబులునుగాదు. నభంబునకెగయుట, భూమిలోఁదూఱుట, నగంబులెత్తుట, జలధులు దాఁటుట, యగ్నింబడుట, నీటందాఁగుట; నేలమీఁదికిలేచుట, యుదకంబుపైఁ గూర్చుండుట, మహిమలుచూపుట, జటావల్కములు దాల్చుట, దండకమండలుపట్టుట, యోగాసనములఁ బూనుట, ముద్రలు చూచుట, సన్న్యాసియగుట, గహనముననుండుట, యాకులలములు దినుట. అన్నపానములవర్జించుట, తపంబుసల్పుట, చలియెండవానలకోర్చుట, యణిమాది సిద్ధులఁగాంచుట, మొదలగు ననేక కష్టంబులొందుట, అచల భావంబుగాదు. ఎవండేని యచలగురుకరుణవలన బట్టబయలుగుట్టెఱింగిన గట్టిగా మోక్షంబు సులభంబగుట సిద్ధంబు. కావున,

## 29. తోహర.

భారమేమియును లేదుసులభమగు- బట్టబయలుస్పష్టంబు-గారడిమాయనుదూరఁబోకుమది - ఘోరమైనకష్టంబు॥ ౧॥ కనఁబడుచున్నది యెందునచలమె- కల్లగాదుగనవోయి - కనదువినదన దేమియుఁ జేయదదిఘనమైనదివినవోయి॥ ౨॥ఆదిమధ్యాంతములు లేనిదై - యలరుదానితోసాటి-లేదొక్కటిభావించిచూచినను- లేదెందునఁబరిపాటి॥౩॥కప్పురదివ్వియదృష్టాంతముగాఁ - గైకొనితృప్తినిఁజెందు - విప్పిచెప్పఁగారాద

ప్పగిదిని-విశ్వంబేదిఁకనిందు॥ ౪॥ పట్టుగ శేషాచల సద్గురుకృపఁ - బ్రత్యక్షముబయ లెందు-గుట్టైనదినరసింహదాసుమదిఁ - గోరివచించినదిందు॥

క. కనులయెదుట నారికెడం, బునుగనిశుని మర్కటములు ♦ భుజియింపఁగఁ జా, లనికైవడి నచలాంబుధి, మునిఁగియునది గానలేరు ♦ మూఢులుమనసా. ౩౧

వ. ఓ మనసా, లోకమున సత్యము ముష్టిపండువంటిది. అసత్యము దక్కెరవంటిది. అసత్యమందుండుతిపి సత్యమునందు లేదు. దానివిధమెట్లనిన; సత్యమనునది కులగుణ నామరూపంబులు లేక, నిరాధారమైనది. అసత్యము కులగుణ నామరూపక్రియల కాస్పదమైనది. కావున, నసత్యాస్పదులై కులగుణ నామరూపంబులవర్తించువారికి సత్యమెట్లు రుచించు? అసత్యమేమిక్కిలిరుచ్యముగానఁ బరిపూర్ణముసత్యమాటను, బ్రపంచ మసత్యమాటను, నచలబోధ వేదశాస్త్రపురాణంబులకును, బ్రపంచమునకును బ్రత్యక్షవిరోధంబై యుండు. ఉన్నను నిజమున కేమిన్యూనంబగు! శాస్త్రలోకములకుభయపడక యథార్థంబగునచలబోధ సమస్తజనులకుఁ దెలియునట్లు బాహాటముసేయు టేయుత్తమము. కావున,

## ౩౧. కీర్తన. ఆనందభైరవిరాగము - అటతాళము.

కొట్టరాధంకాకొట్టరా-జగమెల్లఁజూటి- కొట్టరాధంకాకొట్టరా॥ కొట్టరాసద్గురునివాక్యము-కంటెనన్యము లేదటంచును-గట్టిగానెఱనమ్మువారికి-పుట్టుగిట్టులు లేవఁటంచు॥కొ॥ ౧॥ తల్లిదండ్రులునాలుబిడ్డలు-నిల్లుధనధాన్యములుభూములు- నెల్లవారలబ్రతుకుభాగ్యము- లెంచిచూడఁగనేమి లేదని॥ కొ॥ ౨॥ లేనిభ్రమలనుమానసంబున - బూనినిజముగఁ గేవలాత్మను-గాంచ లేనివారుయుగముల-కైనఁదరిజేరంగ లేరని॥కొ॥ ౩॥ పన్నుగానలభూతభవిష్య - ద్వర్తమానత్రికాలములయం-దెన్న లేనిది జగము స్థిరముగ-నున్న దేపరిపూర్ణమంచు॥కొ॥ ౪॥ చక్కఁగా శేషాచలార్యుల-సత్కృపారతిచేతభవములఁ - జిక్కువాసినపోలకం - నరసింహదాసుని భావమిదియని॥ కొ॥ ౫॥

క. వేదాంత భావమునుమది, మోదముతోఁ దెలియలేక ♦ మూర్ఖులగుచు దు, ర్వాదములు చేసి చెడుదురు, వేదాంతము వాదభేద ♦ విగతముమనసా. ౩౨

వ. ఓమనసా, తమకు వాంఛించినవస్తువు లభింపకపోయిన దానియం దలక్ష్యముసేయుట గోస్తనీఫలంబులు దినఁగోరిన ఫేరవంబు పోల్కినగు. ఎట్లన:- ఒకపర్వతబిలంబున నొకజంబుకము నివసించియుండె. అట్లుండ నొకకాలంబున, దానికి ముద్దినంబు లాహారంబు దొరకక, క్షుద్బాధచే మిగుల సంకటపడుచు, మితిలేని వ్యసనమునం గుందుచు, నెందైనం బోదమని తననిలయంబుఁ బాసిపోవుచు, నొక్కెడ ద్రాక్షలతలు వినోదంబుగా నల్లి ఫలవంతంబులై యుండుటం జూచి, దరిద్రునకు ధనంబు దొరికిన చందంబున, నుప్పొంగి గంతులు వేయుచు, నచ్చోటి కరిగి యాఫలంబులు గోసితినుటకై యొకదినంబెల్ల శ్రమపడినను నవి యందకపోవుటచే, వానియం దసూయనొంది, చీ, చీ, యీ పండ్లు పులియు, నని యొకసొడ్డు వానిపైఁబెట్టి యథేచ్ఛం జనియె. అట్లు దుష్టులచలభావంబందలేనికతంబునఁ దమభావంబులే మంచివిగా నెన్నుచు, నచలభావమునం దసూయతగల్గి తద్భావజ్ఞులతో లేనిపోని కలహము లాడుచుందురు. కావున, 35

## 31. కీర్తన. తోడిరాగము – ఏకతాళము.

వాదమేలర–గాథలేల బేల–వాదమేలర–వేదాతీతంబైన–బోధింత గనలేని॥ వా॥ ఎన్నఁడు లేదాయె-నెఱుకేచూడఁగమాయె–యున్న దేబయలాయె–నుండఁబోదురహమాయ॥ వా॥ పాపపుణ్యంబులు – బంధమోక్షంబులు–ఆపోజ్యోతియువిశ్వ–మఖిలజీవులుమిథ్య॥ వా॥ బట్టబయలన్నమా–గుట్టెమొగనలేక–పట్టిమాయనునమ్మి–మిట్టిపల్కెదవిట్టి॥ వా॥ అరుదార శేషాచ–లార్యునికృపగన్న–నరసింహదాసాత్మ – నానందించనిమాయ॥

క. ఎఱుకే నే నెఱుఁగుదునని, పరిపరివిధములను భ్రాంతి ♦ పడుచున్నదిపో, యెఱుఁగనిఁక నేమియున్నది, యెఱిఁగిన దంతయును మాయ ♦ యేగను మనసా. 33

వ. ఓ మనసా, తాననునెఱుక పరిపూర్ణమును దర్శింపఁబోయినఁ దానే లేకపోవుచున్నది. పరిపూర్ణమును గంటినని చెప్పుట కేమి లేదు. రవిబింబంబుగాంచ గమకించుతమంబు లేకపోయె. ఇంక నాప్రభాకరుని వృత్తాంతంబు వివరింపనేమున్నది? కావున, నచలంబు జాడఁ దెలిసిన, వారిని గలలోఁగన్నగజంబుమాడ్కి, నెఱుక నశించు. అటుమీఁద నేము

న్న దోయములుంగువా రెవ్వరు ? విచారించుట కెఱుకే లేదు. అట్టిభావంబు గ్రహింపక యంతటివారికిని భ్రమవిడువ నేరదని చెప్పిమఱియు నిట్లనియె.

35. కీర్తన. అపరూపరాగము - ఆదితాళము.

తెనుఁదానెపరిపూర్ణమునుగన్నదా యే-మునుము క్తిగోరినమనసే లేదా యె-యా-ఘనబంధమోక్షంబు - లునుదబ్బరా యెఁ-గన నేమిగల దింకఁగలశూన్యమా యె॥తను॥౧॥కలనిసురజాగర-ములెల్లోకమార తల పోయజగమంతఁ-దగమాయెయేర-యీయిలమాయెకలయంచుఁ-దెలి యంగవలద-కలమేలుకొనిచూడఁ-గలనిల్వఁగలద॥తను॥ ౨॥ పరిపూర్ణ మునగొంచుభ్రమలేని దేర-పరికించిమృగతృష్ణ-పగిదిఁగనవేర- యీంధర లోన శేషాచ-లార్యులసేవ-నరసింహదాసున-కిరవైనత్రోవ॥ తను॥ 3॥

క. రవియందు లేనితిమిరము, భువిఁదోఁచియు రవియుఁదోఁచఁ ♦ బొలియుఁదమంబా, రవితమముల గతి నచలము, వివరించిన వారి కెఱుక ♦ విడుచును మనసా. 3౮

వ. ఓ మనసా, భానుప్రభలకు హిమంబువిరియునట్టు లచలగురు కటాక్షంబున నెఱుక విడిచిపోవు. మఱియు భ్రాంతిరూపంబగు నెఱుక నిడువనేరక, హరిశ్చంద్రునివలె సత్యవ్రతం బాచరించినను,భూదేవివలె శాంతంబువహించినను, శ్రీరామచంద్రునివలెఁ బితృవాక్యంబుఁజెల్లిం చినను, ప్రాచీనబర్హివలెజన్నంబులొనర్చినను,బలిచక్రవర్తివలెదానంబు లొసంగినను,శిబివలె శరీరంబుఁ గోసియిచ్చినను, వాల్మీకివలె నింద్రియ ములజయించిమౌనియైనను, భీష్మునివలె వనితాసంగంబు వర్జించినను, శుక్రునివలెశుద్ధదృష్టి తెలిసినను,మన్మథునివలెఁదనువులేకనటించినను, ధర్మరాజువలె ధర్మంబుదప్పకుండినను, బొందితో గైలాసమున కేగినను, నిహమందు జీవసమాధి గావించినను ప్రయోజనంబు లేదు. ఎట్లనిన: ధర్మాధర్మములు,సత్యాసత్యములు, శాంతాశాంతములు, మాతాపితలు, యజ్ఞాయజ్ఞములు, స్నానాస్నానాసనంబులు, భాషాభాషలు, కామాకామ ములు,గతాగతవర్తమానములు, కాయాకాయములు,స్వర్గనరకములు మొదలైనవెల్లను గలలో వార్తలగుటచే నిందొకటియైననిజము లేదు. కలలోనున్నంతవఱకు సత్యముగాఁ దోచినను గలఁబాసిన సమస్తము దబ్బరగు. ఇంకేమిగలదు! పరిపూర్ణమే సత్యమగు వినుము. 37

**33.** కీర్తన. ముఖారిరాగము - చాపుతాళము.

లేనిభ్రాంతిగదరా-కలనిక్కమగునెవినరా - యేనుఁగులశ్వములొంటెలురథములు-సేనలుప్రభువులుసేనాధిపులును॥ లేని॥౧॥ రాజొకండు లేఁడు-ఇఁక-రాజ్యమొకటిలేదు- ప్రజలుమంత్రిభట-రాజ్యసైన్యములు - గజిబిజిపల్కులుకలలోవార్తలు॥ లేని॥ ౨॥ తరణేందులుగిరులు-హరిహరుఁడునజుఁడుశరధుల్-నరసురఖగమృగనానాజీవులు-వరుసగనిర్జరమర్త్యలోకములు॥ లేని॥౩॥ మునులుదిక్పతులును-ఘనులౌనరమహాత్ములును-ఘనులగుజ్ఞానులుకవులుపండితులు - మునుదిగంబరులుమొదలుగసర్వము॥౪॥పరగఁదెలియవలెరా-పరబయలేనిక్కమురా- సరగున శేషాచలగురుకృపచే-నరసింహాఖ్యుఁడు- దొఱఁగినయెఱుకే॥ లేని॥ ౫॥

క. ఇలవేశ్య సమము మతములు, పలుశాస్త్ర శ్రమవిధాన • బహుమార్గములున్, కులకాంతతోడసమమగుఁ, బొలుపొందఁగ నచలబోధ • భువిలోమనసా. ౩౫

వ. ఓమనసా, యెవ్వండైన నచలభావం బొందుటయుత్తమోత్తమంబు. సాంఖ్యతారకామనస్కభావంబుల వర్తించుట మధ్యమంబు. ముద్రాసనయోగ సాధనంబుల మెలంగుట యధమంబు. పుణ్యపాపకర్మంబులాచరించుట మిగుల నధమాధమంబు. కావున, సమస్తభావశిరోమణియగు నచలభావంబునొంది, యఖిలమాయలకు మూలంబగు నెఱుక నిరసింపవలయు. ఇతరభావంబుల వర్జింపవలయు. అట్టివానికి నేజగంబున సమానులులేరు. అతఁడేపరమపదస్వరూపుఁడు, వాని నిట్టివాఁడని చెప్పుటకుహరిహరహిరణ్యగర్భాదులకుశక్యంబుగాదు. వినుము,

**34.** తోహరా.

అజ్ఞానియుసుజ్ఞానియుఁగాఁడిఁక-నచలభావసంగతుఁడు-ప్రజ్ఞాప్రజ్ఞవివర్జితుఁడతఁడే-భావాభావవిగతుఁడు॥ ౧॥ ఉన్నదిబయలేయేమియులేదని-యొప్పుగమదినూహించు-అన్నదివిన్నదితిన్నదికన్నది - సున్నయనుచుభావించు॥ ౨॥ ఇదిసరియదిసరిగాదటంచుదా - నెప్పుడెవ్వరితోననఁడు-పదపడిలోకులవార్తలునిజమని- భ్రమగొనియునుదావినఁడు॥ ౩॥ మావారనిమీవారనిభ్రమగొను-మనుజులవలదనియనఁడు - ఏవిషయంబులసహజవృత్తిచే - నెలమిసటించునుఘనుఁడు॥ ౪॥ ఇలశేషాచలగురు

కారుణ్యమె నిలుకడయని పరికించుఁ - బలుమఱు నరసింహాఖ్యుని సదమల భావంబును వీక్షించు॥ ౫॥

క. వినుశు క్షితితలిరజతం, బని భ్రమసిన మూఢజనుని ♦ పగిదిజ గంబుల, గినినిక్కంబని భ్రమఁగొను, చెనఁటులు గన లేరుబయలు ♦ సిద్ధముమనసా. 38

వ. ఓమనసా, పరిపూర్ణ భావము లోకమున నరుదగు. ఆరహస్యంబుఁ దెలిసి యెఱుకనుజయింప మునినిర్జరులకైన దుస్తరంబు. మఱియు నట్టి భావంబు, పరమశివునివలన విష్ణువును, విష్ణువువలన బ్రహ్మయు, బ్రహ్మవలన వసిష్ఠుఁడును, వసిష్ఠునివలన జనకుండును, జనకునివలన శుకుండును, శుకునివలన సాందీపుండును, సాందీపునివలన శ్రీకృష్ణుండును, శ్రీకృష్ణునివలన నుద్ధవుండును, నుద్ధవునివలన బ్రహ్మానందుండును, బ్రహ్మానందునివలన రామావధూతయు, రామావధూతవలనఁ గబీరుదాసును, గబీర్దాసువలన వేమన్నయు, వేమనవలన శ్రీధరస్వామియు, శ్రీధరస్వామివలన శివరామ దీక్షితులును గ్రహించిరి. మఱి యా శివరామ దీక్షితులవలనఁ గ్రమక్రమంబుగ నచలబోధ లోకంబునం బ్రకాశించెనని బుద్ధిపల్కిన మనం బాశ్చర్యంబంది, 'యౌరా! యిట్టిదివ్యబోధ నాకందఁగల్గె' ననిపరమానందాబ్ధి వాలలాడుచు పరిపూర్ణతత్త్వంబు నిట్లనియభివర్ణించె 39

## 35. కీర్తన. కేదారరాగము - ఆదితాళము.

చరాచరంబులకాదియచలమై- శాశ్వతమైనద దేకదా- పరాపరంబులకన్యంబగుచును - భాసిలుచున్నద దేకదా॥ చ॥ ౧॥ హరిహరబ్రహ్మేంద్రాద్యమరులకును- బరమపదంబనన దేకదా- ధరవసిష్ఠశుకజనకాదులును- సిరముగఁ గాంచినద దేకదా॥ చ॥ ౨॥ ఏకవిధంబై రాకపోకలను లేకయునుండినద దేకదా- ఏకాలంబునఁ బ్రత్యక్షంబై- యెందుననున్నద దేకదా॥ చ॥ 3॥ ఉన్నది లేదనుసందేహంబులు- ఎన్నఁడుఁదోచనిద దేకదా- కన్నులమనమున వాక్కుననిట్టని - యెన్నఁగరానిద దేకదా॥ చ॥ ౪॥ అతిప్రేమంబున శేషాచలగురుఁ - డలరఁగఁ దెల్పినద దేకదా - క్షితిలోపల నరసింహదాసునువీ - క్షించినతత్త్వంబ దేకదా॥ చ॥ ౫॥

వ. అనియిట్లు కేవలాత్మను బహువిధంబులఁ బ్రకటింపుచున్న మనంబునకు బుద్ధియిట్లనియె. 40

సీ. ధరనుసుజ్ఞాన ♦ తత్త్వకీర్తనలను, వచనపద్యయుతము ♦ భక్తిమీఱ, సతతంబువ్రాసిన ♦ జదివినవిన్నట్టి, నరులుపూర్ణాయువు♦ నందఁగలరు, దాసవాహనపుత్ర ♦ ధనకనకాద్యష్ట, ఘనతరైశ్వర్య ముల్ ♦ గాంచఁగలరు, తీఱనిలేములు ♦ తెవులులాదిగఁగల్గు, బహు విపత్తులనెల్లఁ బాయఁగలరు. తే. అంత్యమందునఁదప్పక యమరలోక, సుఖములాదిగఁ గందురు సారిదిగురుని, దయను నిందలి యనుభవా ర్థంబుఁగనిన, జనులు జన్మంబులకురారు సత్యముగను. 3౭

క. భాను సుధాకరతారలు, నానిగమంబులును గిరులు♦నబ్ధులుజగముల్, భూనభము లుండువఱకును, నీనిరుపమ శ్రుతిధరిత్రి ♦ నిల్చును గాతక్. 3౮

వ. అనియిట్లు బుద్ధినుతివిన, మనం బమితోత్సాహంబున బుద్ధిం గొనియాడుచుఁ దనదు సంకల్ప వికల్ప చాంచల్యంబుల మాని, నిర్మలత్వంబుఁబూని, యలవిగాని పరమపదంబున విడిదియై, దేహాత్మ లాది మోహంబు లడంచి, యితరంబెఱుంగక, సమస్తముఁ జేయుచుఁ జూచుచుఁ, గుడుచుచు, ముడుచుచు, గుహ్యానందాది సుఖంబు లనుభవించుచుఁ దద్భ్రాంతులం జెందక, యెఱుకను సమూలంబుగా విడిచియుండె. 41

క. సర్వపరిపూర్ణ విలసిత, సర్వాకారాంతవిగత ♦ చలనమితాంతా, సర్వ నిగమాంతసంతత, నిర్వచనాత్మాంత సత్య ♦ నిత్యానంతా. 3౯

మాలిని. సలలిత పరిపూర్ణా ♦ సర్వవిచ్ఛేదవర్ణా, నిలయ చలితహంతా ♦ నిర్గుణాత్మానిరంతా, ఫలవిలయ విభావా ♦ భ్రాంతిమూలాంతజీవా, కలిత సుజనసారా ♦ కాలనాశా శరీరా. ౪౦

క. మంగళ మవ్యయగురునకు, మంగళ మాద్యంతరహిత ♦ మగుబయలునకున్, మంగళము కేవలాత్మకు, మంగళ మచలమున కలఘు ♦ మంగళముసదా. ౪౧

**36.** మంగళహారతి – యదుకులకాంబోదిరాగము–ఝల్వ తాళము.

మంగళంజయమంగళమనరే – గురుభక్తులెల్ల – మంగళంశుభ మంగళమనరే। మం॥ మంగళంజయమంగళమని రంగుమీఱ నిలిచి సర్వ–సంగరహితుఁడైనశే – షాచలసద్గురునకిపుడు। మం।ఈ యుక్తబట్ట

బయలును - నేమియును లేదని యెంచుచును - సమంచితముగను - బాయ కాత్మ న్వాద శాక్షరి - పఠన చేసికొనుచుఁ జాల - మాయ యేమి లేనిదంచు - మానసనిర్వికారులగుచు॥ మం॥ మేదినిమూలంబు లేకను - గుర్తెఱుఁగు సట్టి - మేను నేమి లేదటంచును - సాదరముగ షోడశాక్షరి - సారె సారె కెన్ని కొనుచు - నాద్యంతములు లేని - యట్టి కేవలాత్మకప్రభు॥ మం॥ కలనుదోఁచు కాయ మేటులనో - యటువలె నెఱుఁగా - కాయ - మలరఁదోఁచె నంచును - సలలితముగఁబంచదశా - క్షరిని సరిగ జపించుచును గల విధంబుదోఁచు మాయ - నిలువనీక పాఱఁదోలి॥ మం॥ అరయ శరీరంబు గాకను - జీవాత్మ గాక - మఱియును ఆపరాత్మ గాకను - ధరణిలోన నారసింహ - దాసునకును మఱుఁగు లేక - సురుచిరముగఁ దోఁచుచున్న - పరమపదమునకు॥ మం॥

——(*) శిష్యుఁడు - కుప్పం రంగయ్యదాసుగారి మంగళహారతి (*)——

జయమంగళం - నిత్య శుభమంగళం - జయా - జయమంగళం - మహోత్సవమంగళం॥ జయమంగళం - సర్వ - సాక్షిస్వరూపునకు - జయమంగళం - భక్తసదయునకును - జయమంగళం - సర్వ - సంపూర్ణ రాయునకు - జయమంగళం - సదా - సద్గురునకు॥ జయ॥౧॥ తనువు పళ్లెముఁ జేసి - మనము కుదురుగఁ జేసి - మొనసి కర్మము తైల - ముగ నమర్చి - ఘనచంచలము వత్తి - గాఁ జేసి జ్ఞానాగ్ని - యనెడి వెలుఁగొనరించి - హారతిత్తు॥ జయ॥ ౨॥ లోకసృజనాధ్యునకు - లోకసంరక్షునకు - లోకసంహారునకు - లోకపతికి - నాకారశూన్యునకు - నాద్యంతరహితునకు - నేకమై వెల్గుని - ర్లోకునకును॥ జయ॥ 3॥ నింగిసదృశునకు - నిర్భిన్ను నకు భవ - భంగ హీనునకు విగ - తాంగునకును - మంగళప్రదునకును - మండితోజ్వ్యలునకును - లింగరూపునకుని - స్సంగునకును॥ జయ॥ ౪॥ స్థిర మెప్పఁబోలకం - నరసింహ గురుఁడవై - పరమభక్తులపాలి బ్రహ్మమగుచు - ధరణికుప్పము రంగ - దాసునిఁ బరిపూర్ణ - కరుణ నేలిన మేటి మద్గురునకు॥ జయ॥ ౫॥

శ్రీమాన్ - కుప్పం రంగయ్యగారి శిష్యప్రేరణచే

పోకల - వేంకట నరసింహారాయ విరచితము మంగళమ్.

మంగళం మంగళం మంగళం - జయమంగళాలయ భవతే॥ శుభ మంగళాలయ శుభతే॥ సారతరమగు నెందు - శేషాచలార్యులపొందు - సాక్షిరహితుఁడు - సత్యమార్గవిశారదుండగు - సద్గురునకు॥ మం॥ ౧॥

మాయరూపములనుచుఁ- బాయకెటులఁ గనుగనుచు - ధ్యేయశూన్యము-
పాయమరసె - నా-రాయణాంబకు-రాజిలంగను॥ మం॥ ౨॥ లాలితంబ
గు బాట-లీలఁ జనియెడుమాట-శీలమూర్తి విశాలకీర్తియా-పోలకం-నర
సింహగురునకు॥ మం॥ ౩॥ సూటిమాయాబోధ - చాటఁ జెప్పినగాధ-లేటి
కనుచునుదీటుఁబలికెడు - బోటిగురుసతి - కోటమాంబకు॥ మం॥ ౪॥
అంగమేమియులేదు - గన-లింగముగాఁబోదు- అంగలింగముసంగశూ
న్యమె-ఉంగుకుప్పము - రంగయకును॥ మం॥ ౫॥ ధరణిదేహాతీత-మర
సినభవమాత-సరసతో భువి - సత్యలక్ష్మి- నరసమాంబకు-నిరతమును -
మం॥ ౬॥ పారమార్థిక మశ-రీరభావముజగతిఁ - జేరినరహరి- సఖుఁడు
నరహరి - వారకనుభవబంధహరునకు॥ మం॥ ౭॥

గద్య. ఇది శ్రీమాన్ పోకల - శేషాచలదేశికానుగ్రహాశ్రిత, కర్పూర
గోత్రాన్విత, పోలకం - లక్ష్మీనృసింహార్యసుత, సజ్జనహిత,
నరసింహనామ రచిత బుద్ధ్యుపదేశిని యను మానసబోధ
సుజ్ఞాన తత్త్వకీర్తనల గ్రంథమందుఁ-దృతీయాశ్వాసము
సర్వంబును - సమాప్తము.

స్వస్తి.